# జె. కృష్ణమూర్తి



# గతం నుండి విముక్తి




సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాదు - 500 001.

**GATHAM NUNDI VIMUKTI**
Telugu Translation of Freedom from the Known.
*Translation into Telugu by* N.C. Ramanujachary (SRIVIRINCHI)

ప్రతులు : 1000
తొలి ముద్రణ : కృష్ణమూర్తి ఫౌండేషన్ ఇండియా, 1990
ద్వితీయ ముద్రణ : జనవరి, 1999



ముఖ చిత్రం: ఉమ

వెల: రూ. 30-00



ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్ హైదరాబాద్ - 29. ఫోన్: 3229831

# ప్రస్తావన

జె. కృష్ణమూర్తి (1895–1996) విశ్వవిఖ్యాత తత్త్వవేత్త. అరవయి సంవత్సరాలు పైబడి ప్రపంచంలో పలుదేశాలు పర్యటించి జనసమూహాలకు జీవన సందేశాన్ని అందజేశారు. " 'సత్యం' అనేది రహదారి లేని క్షేత్రము. సంస్థలద్వారా, నమ్మకాల ద్వారా, క్రతువుల ద్వారా, గురువుల ద్వారా దాని చెంతకు చేరలేము. ఆధ్యాత్మ బోధనల వల్ల, మానసిక వికాస ప్రక్రియల ద్వారా దానిని అందుకోలేము. పరస్పర సంబంధమను దర్పణం సహాయంతో, మన మనసులోని సరంజామాను అర్థం చేసుకోవడం ద్వారా, పరిశీలన వల్ల మాత్రమే ఈ పని సాధ్యం అవుతుంది" – అని వక్కాణించారు.

తాను బోధకుడిని – గురువును – కానని, పదిమందితోపాటు విషయచర్చ చేస్తూ స్వస్వరూప జ్ఞానం ద్వారా సత్యాన్ని తెలుసుకోవాలని అన్నారు. తాను చెబుతూ వున్న విషయాలను సాధికారంగా తీసుకుని వల్లె వేయవద్దనీ, వాటిని జాగ్రత్తగా పరిశీలించి ఎవరికి వారు నిగ్గుతేల్చుకోవాలనీ పదేపదే చెప్పారు.

కృష్ణమూర్తి ఉపన్యాసాలు, రచనలు అన్నీ ఇంగ్లీషులోనే సాగాయి. ఇంగ్లీషు రాని వారి కోసం ఇతర భారత భాషలలోనికి కొన్ని ప్రసంగాలు, పుస్తకాలు యిప్పటికే అనువాదం చేయబడినాయి. ఇతర భాషలలోనికి జరిగే అనువాద కార్యక్రమాలను స్వయంగా చేపట్టాలని, కృష్ణమూర్తి భావప్రసారాలను వీలయినంత వరకు సజావుగా, సరళంగా అందరికీ అందచేయాలని కృష్ణమూర్తి ఫౌండేషన్ ఇండియా సంకల్పించింది. ఈ ప్రయత్నంలో భాగంగా ఈ సంవత్సరం కొన్ని మౌలిక గ్రంథాలను తెలుగులో ప్రచురించటానికి యేర్పాట్లు జరుగుతున్నాయి.

ఈ పుస్తకాల సహాయంతో కృష్ణమూర్తి ఆశించిన నవ మానవ ఆవిర్భావం, నవ సమాజ అవతరణ గురించి చదువరులు యధాతథంగా తెలుసుకోవటానికి వీలవుతుందని ఆశిస్తున్నాం. కృష్ణమూర్తి తత్త్వ దర్శనాన్ని తరచి తరచి చూచుకుని, అవగాహన చేసుకోవటానికి, ఆచరణలోనికి తీసుకు రావటానికి ఈ పుస్తకాలు దోహదం చేస్తాయి. పాఠకులు వీటిని ఆదరిస్తారని నమ్ముతున్నాము.

ఈ పుస్తకం 1990 లో 'జ్ఞానం – స్వేచ్ఛ' పేరుతో ముద్రించబడినది – ఇపుడు దానినే 'గతం నుండి విముక్తి' పేరు మార్పుతో ముద్రిస్తున్నాం. ఈ మార్పును పాఠకులు గమనించగోర్తం.

వసంత విహార్,
గ్రీన్ వేస్ రోడ్డు,
మదరాసు – *600 028.*
20 నవంబర్ 1990.

డా॥ గజాననరావు
సమన్వయ కర్త
దక్షిణ భాషల అనువాద విభాగం,
కృష్ణమూర్తి ఫౌండేషన్, ఇండియా.

ఈ పుస్తకం కృష్ణమూర్తి సూచనపై, వారి అనుమతితో వ్రాయడం జరిగింది. ప్రపంచంలోని పలుతావులలో వారు ఇటీవల చేసిన ప్రసంగాల (ఇంగ్లీషు) నుండి ఈ పదాలు సేకరించాము. ఈ ప్రసంగాలు 'టేప్' అయినాయి; యింతవరకు ప్రచురణ కాలేదు. వీటి ఎంపిక, క్రమంలో కూర్చి సంపుటీకరించడం పూర్తిగా నా బాధ్యత.

– మేరీ లుటియన్స్

# విషయసూచిక


1. మానవుని అన్వేషణ – క్షుభిత మనసు – సంప్రదాయ సరణి – మర్యాద అనే ముసుగు – మానవుడు, వ్యక్తి – అస్తిత్వం కోసం సంఘర్షణ – మానవుని మూలస్వభావం – బాధ్యత – సత్యం – స్వస్వరూప రూపాంతరం – జీవశక్తి దుర్వ్యయం అయిపోవడం – అధికారాల ఒత్తిడి నుండి స్వేచ్ఛ. ... 1
2. మనసు గురించి తెలుసుకోవడం – సరళత, వినయము – నిబద్ధత. ... 12
3. ప్రజ్ఞ – జీవ సంపూర్ణత – ఎఱుక. ... 19
4. సుఖాల వెనుక పరుగులు – కోరిక – ఆలోచన పట్టించే పక్కదారులు – జ్ఞాపకాలు – ఆనందము. ... 23
5. స్వానురక్తి – పదవులకోసం వెంపర్లాట – భయాలు, పూర్తి భయావస్థ – ఆలోచన ముక్కలు ముక్కలుగా తెగిపోవడం – భయాన్ని అంతం చేయడం. ... 27
6. దౌర్జన్యం – కోపం – సమర్థన, ఖండన – ఆదర్శము: నిజంగా వున్నదీ. ... 35
7. పరస్పర సంబంధాలు – సంఘర్షణ – సంఘం – బీదరికం – మందులు – పరాశ్రయం – పోల్చిచూచుకోవడం – కామన – ఆదర్శాలు – దాంభికత. ... 42
8. స్వేచ్ఛ – తిరుగుబాటు – వంటరితనం – అమాయకత – ఉన్నవాళ్ళం ఉన్నట్లుగా జీవించడం. ... 50
9. కాలము – దుఃఖము – మృత్యువు. ... 54
10. ప్రేమ. ... 60
11. అవలోకనం, మెలుకువగా వినడం – కళ – అందం – క్లుప్తత – ప్రతీకలు – సమస్యలు – నిరావరణ. ... 68
12. పరిశీలకుడు: పరిశీలన వస్తువు. ... 74
13. ఆలోచన అంటే ఏమిటి? – అభిప్రాయాలు: ఆచరణలు – సవాలు – ద్రవ్య వస్తువు – భావ ప్రారంభం. ... 77
14. నిన్నటి బరువులు – ప్రశాంత మనసు – విచార వినిమయం – సాధన – నేర్చుకోవడం – నిశ్శబ్దం – సత్యము: యదార్థము. ... 82
15. అనుభవం – సంతృప్తి – ద్వంద్వం – ధ్యానము. ... 86
16. సంపూర్ణ విప్లవం – మతైక మనసు – జీవశక్తి – ఉద్వేగం. ... 91

# 1

**మానవుని అన్వేషణ - క్షుభిత మనసు - సంప్రదాయ సరణి - మర్యాద అనే ముసుగు - మానవుడు, వ్యక్తి - అస్తిత్వం కోసం సంఘర్షణ - మానవుని మూలస్వభావం - బాధ్యత - సత్యం - స్వస్వరూప రూపాంతరం - జీవశక్తి దుర్వ్యయం అయిపోవడం - అధికారాల ఒత్తిడి నుంచి స్వేచ్ఛ.**

**యు**గయుగాలుగా మానవుడు తనకంటే అతీతమైనది యేమయినా వున్నదా – వస్తుసంపద సంక్షేమాన్ని మించినది యేమిటి – సత్యమనో, భగవంతుడనో, యథార్థత అనో మనం పిలిచేది; కాలానికి అతీతమయిన స్థితి – పరిస్థితుల ప్రభావం వల్ల మార్పులు చెందనిది యేమిటి – ఆలోచనవల్ల మానవుని జోక్యం వల్ల కలుషితం కానిది యేమిటి అని నిరంతరం వెదుకుతూ వున్నాడు.

మనిషి ఎప్పుడూ ఈ ప్రశ్న వేసుకుంటున్నాడు: ఇదంతా యేమిటి? జీవితానికి అర్థం అంటూ యేమయినా వున్నదా? జీవితంలోని అసంఖ్యాక గందరగోళాలు తను గమనిస్తున్నాడు: దుర్వర్తనలు, తిరుగుబాట్లు, యుద్ధాలు, మతం అనేక విభాగాలుగా చీలిపోవడం, ఆదర్శవాదాలు, జాతీయభావాలు,... యివన్నీ చూచి ఒకరకమైన నిరాశలో మునిగిపోయి అతను అడుగుతున్నాడు: ఇప్పుడు యేం చేయాలి? మనం 'జీవనం' అని పిలిచే యీ ప్రక్రియ అంతా యేమిటి? దీనికి అతీతమయినది, ఇది అందుకోలేనిది యేమయినా ఉన్నదా?

వేలకొద్దీ పేర్లతో పిలుస్తున్నా యీ అనామక వస్తువు యేదో అతనికి గోచరం కాలేదు. అందుచేత విశ్వాసాన్ని అలవరచుకున్నాడు – ఎవరో రక్షకుడో, ఏదో ఆదర్శమో – యిదే మిన్న అయినదని నమ్మనారంభించాడు. విశ్వాసం దౌర్జన్యానికి దారి తీస్తుంది.

జీవనం అనే యీ ప్రక్రియలో నిరంతరం జరుగుతున్న సంఘర్షణలో మనం నివసిస్తున్న, మనం పెరిగి పెద్దలమైన సాంఘిక వాతావరణానికి అనుగుణంగా ఒక ప్రవర్తనావళిని రూపొందించుకుంటున్నాం. కమ్యూనిస్టు సంఘం కానివ్వండి – పేరుకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో విలసిల్లుతున్నా మనుకుంటున్న సంఘం కానివ్వండి – దానికి

అనుగుణంగానే వుంటుంది మనం తీర్చిదిద్దుకునే ప్రవర్తనావళి. హిందువులుగానో మహమ్మదీయులుగానో క్రిస్టియన్లుగానో – మన మన సంప్రదాయాలను అనుసరించి ఆచరణ వైఖరులను అంగీకరిస్తాము. సత్ప్రవర్తన అంటే యేమిటి – చెడునడత అంటే యేమిటి; మంచి ఆలోచన యేది – చెడ్డ ఆలోచన యేది – అన్న విషయాలు యెవరో మనకు తెలియపరచాలని ఆశిస్తాము; ఎదురు చూస్తాము. ఈ చట్రంలో యిమిడి పోవడం వల్ల మన ప్రవర్తన, మన ఆలోచన ధోరణి యాంత్రికంగా తయారవుతాయి. మన ప్రతిచర్యలన్నీ నిరాలోచనగా వెలువడుతాయి. దీనిని కాస్త గమనిస్తే – మన జీవితాలలోనే చూడవచ్చును.

శతాబ్దాల తరబడి మనకు గురువులు, అధికారులు, పుస్తకాలు, సాధువులు ఎప్పటికప్పుడు యేమి అవసరమో చెబుతూ వచ్చారు. మనం అడుగుతాం: 'నాకు ఈ సంగతులన్నీ చెప్పండి – ఈ పర్వతాల వెనక, కొండలు – భూమి – యివన్నీ దాటి యేమున్నదో తెలపండి' అని. వారి వర్ణనలతో సంతృప్తులమవుతాం. అంటే యేమన్న మాట? మనం కేవలం మాటలతో కాలక్షేపం చేస్తున్నాం; మన జీవితం అసమగ్రం – శూన్యం అయిపోతోంది. మనం నకిలీ మనుషులుగా తయారవుతున్నాం. మనకు అందిన బోధనలను అనుసరించి, కాస్తో కూస్తో మన అనుకూలాలను జోడించి, పరిస్థితులు – వాతావరణం తీసుకువచ్చిన ప్రభావాలకు లొంగిపోయి జీవన సాగిస్తున్నాం. అన్ని రకాల ప్రభావాలకు మనం పరిణామం. అంతేగాని, మనలో నవీనత అనేది యేమీ లేకుండా పోయింది. మనకై మనం నూతనంగా కనుగొన్నది యేమీలేదు. అసలయిన, స్పష్టమయినది, స్వచ్ఛమయినదీ యేమీలేదు.

మత చరిత్రనంతటినీ పరిశీలించినట్లయితే మతగురువులు మనకు అనేక నమ్మకాలు కలిగించ బూనుకోవడం అగుపిస్తుంది. కొన్ని క్రతువులు చేసినట్లయితే, కొన్ని మంత్రజపాలు ప్రార్థనలు చేస్తే, ఒక క్రమశిక్షణకు ఒదిగివుంటే, కోరికలను అణగద్రొక్కుకుంటే, ఆలోచనలను నిగ్రహించ గలిగితే, కోరికలను మరోమార్గం పట్టించ గలిగితే, ఆకళ్లను పరిమితం చేసుకుంటే, లైంగిక వ్యవహారాలనుంచి వైదొలగితే – అప్పుడు శరీరము, మనసు తగినంతగా బాధలకు లొంగిపోయి – ఈ సంకుచిత జీవితం కంటే విస్తృతం అయినదేదో కనుక్కోగలుగుతాము. యుగయుగాలుగా లక్షలాది మత అనుయాయులు అవలంబించిన మార్గం యిది. ఏకాంతంలోనో, ఎడారులకో, పర్వత ప్రాంతాలకో వెళ్లి, గుహలలో కూర్చుని, భిక్షా కార్యక్రమంతో గ్రామగ్రామాలు తిరుగాడి, యేదో జనసమూహంతో చేరి – మనసును ఓ ప్రత్యేక సాధనకు లోబరచుకోవడంలో మునిగిపోయారు. అయితే, యిటువంటి క్షుభిత మనసు, ముక్కలు ముక్కలుగా విరిగిన మనసు, అన్ని కష్టాలు – బాధలనుండి పరుగెత్తుకు పోయే ప్రయత్నంలో వున్న మనసు, బాహ్యప్రపంచాన్ని నిరాకరించి క్రమశిక్షణతో సోమరిగా యంత్రవతుగా తయారయిన మనసు యెన్నాళ్లు తన అన్వేషణను సాగించినప్పటికీ తన వికారాలకు విరూపాలకు సరిపడే విషయాలనే కనుక్కో కలుగుతుందిగాని యింకేమీ చేయలేదు.

అందుచేత, ఈ ఆదుర్దాలు – అపరాధాలు – భయసంకులత – పై పోటీ మనోభావం --- వీటన్నిటికీ అతీతంగా యథార్థం యేమయినా వున్నదా అన్నది కనిపెట్టవలెనంటే అందుకు మరేదో భిన్నమయిన మార్గాన్ని అనుసరించడమే అవసరం అని నాకు అనిపిస్తోంది. సంప్రదాయ మార్గం యేమిటంటే – చుట్టు ప్రక్కలనుంచి లోపలకు కేంద్రం వైపు వెళ్లడం, సమయ, సాధన, సన్యాస సంగతులమయి ప్రవర్తించి క్రమంగా అంతరంగ సుమం వైపు ప్రయాణం చేయడం, ఆంతరిక సౌందర్యాన్ని, ప్రేమను అందుకోవడం. మనిషిని సంకుచితుడిని, క్షుల్లకుడినీ, భయానకుడినీ చేయటానికి యేది అవసరమో అదంతా చేయడం, క్రమక్రమంగా చర్మం వలవడం మోస్తరుగా, సమయ విరామం తీసుకోవడం; రేపు చూచుకుందాం; వచ్చే జన్మలో చూద్దాం – యిలా. చిట్ట చివరకు కేంద్రానికి వచ్చేసరికి, రాగలిగే సరికి, అక్కడ యేమీ అగుపించదు. ఎందుకంటే – అప్పటికే మనిషి మనసు సామర్థ్యాన్ని కోలుపోయింది; మొద్దు బారిపోయింది; యేమాత్రం సునిశితత్వం లేదు.

ఈ ప్రక్రియ అంతా గమనించినప్పుడు అనిపిస్తుంది – యింతకంటే వేరయిన మార్గం యేమీ లేదా – అంటే, కేంద్రస్థానం నుంచే అన్వేషిస్తూ పోవటానికి కుదరదా? – అని.

ప్రపంచం సంప్రదాయ పద్ధతిని ఆమోదిస్తుంది. మనలో క్రమత లేక పోవటానికి ప్రధానమయిన కారణం – మరెవరో వాగ్దానం చేసిన సత్యాన్ని మనం వెదుకులాడుతూ కూర్చోవటమే. సర్వత్ర అనుకూలమయిన అధ్యాత్మ జీవనాన్ని సమకూరుస్తుంది – అని ఎవరయినా భరోసా యిస్తే చాలు, ఆ ప్రక్రియను అవలబించటానికి మనం సన్నద్ధులమై వున్నాం. మనలో విభ్రాంతం యేమిటంటే – మనలో చాల మందిమి రాజకీయ దౌర్జన్యానికి, నియంతృత్వానికీ వ్యతిరేకులము; అయినా, అంతరంగికంగా మనమందరమూ అధికారాన్ని, హింసను, యితరులు మన మనసులను వక్రీకరించడం, మన జీవన విధానాలను మార్పు చేయడం – వీటన్నిటినీ ఆమోదిస్తాం. మనం వీటన్నిటినీ నిరాకరించి – కేవలం మాటలుగా కాదు, ఆచరణలో – అధ్యాత్మ అధికారాన్ని, క్రతువులను, పూజా పురస్కారాలను, విశ్వాసాలను తిరస్కరించి నిలబడినప్పుడు ఏమవుతుంది? మనం ఒంటరివాళ్లం అవుతాం; సంఘంతో సంఘర్షణ యేర్పడుతుంది. మర్యాద, మప్పితం వున్న మనుషులుగా పరిగణన వుండదు మనకు. మర్యాదలో చిక్కుకుపోయిన మనిషి అనంతము, అప్రమేయము అయిన సత్యం – యథార్థత వైపు రావటానికి సాధ్యం కాదు.

పూర్తిగా అసంబద్ధం అయిన సంప్రదాయ సరణిని మీరు యిప్పుడు తిరస్కరిస్తున్నారు. ఈ తిరస్కారం యేదో 'ప్రతిచర్య'గా చేస్తూన్నట్లయితే మీకు మీరే మరో 'చట్రం' తయారుచేసుకుంటున్నట్లు. దానిలో యిరుక్కుపోతారు. కేవలం మానసిక ఉద్వేగంతో యీ తిరస్కారం వివేక యుతమయిన పని అని చెప్పకుంటూ – అందుకు అనుగుణమయిన ఆచరణకు ఉద్యమించనట్లయితే – – మీరు ముందుకు అడుగువేసినట్లు కాదు. సంప్రదాయ సరణిలోని మూర్ఖత – మౌఢ్యము – అపరిపకత్వ గమనించి అప్పుడు మీరు నిరాకరణ చేసినట్లయితే – అది వివేకయుతమైన పని.

మీకు యిప్పుడు భయ విహ్వాలత లేదు. మీరు స్వేచ్ఛా జీవులు. మీలోను, మీ చుట్టూ కొంత తీవ్రమయిన గందరగోళం సృష్టిస్తారు - కాని, లాంఛన పూర్వకమయిన మర్యాద కవచాల నుంచి బయట పడిపోయారు. అప్పుడిక మీకు 'అన్వేషణ' అవసరమే లేదు. ముందుగా తెలుసుకోవలసినది యిది; వెదుకులాట అవసరం లేదు. ఈ వెదుకులాటలో మీరు కిటికీలలో సుందరంగా పేర్చిన వస్తు సముదాయాన్ని మటుకే చూస్తున్నారు.

భగవంతుడు ఉన్నాడా లేడా, సత్యము యథార్థత అనేవి యేమిటి - - యిటువంటి ప్రశ్నలకు పుస్తకాలు, పురోహితులు, తత్త్వవేత్తలు, రక్షకుల ద్వారా సమాధానాలు దొరకవు. ఏ వ్యక్తీ ఏ వస్తువూ యీ ప్రశ్నలకు జవాబు యివ్వరు; దీనిని మీరే స్వప్రయత్నం వల్ల తెలుసుకోవాలి. అందుచేతనే మిమ్మల్ని మీరు తెలుసుకోవాలి. స్వవిషయం పూర్తిగా తెలియకపోవడం వల్ల అపరిణతి యేర్పడుతుంది. మిమ్మల్ని మీరు తెలుసుకోవడం జ్ఞానానికి నాందీ ప్రస్తావన.

సరే, మీరు యేమిటి? వ్యకిగతంగా మీరు ఎవరు? మానవుడికి వ్యక్తికి వ్యత్యాసం వున్నదనుకుంటాను. వ్యక్తి అంటే స్థానికుడు, యేదో ఒక దేశంలో ఒక సంస్కృతిలో, సమాజంలో, మతంలో మెలుగుతూ వున్నవాడు.

మానవుడు యిలాంటి స్థానికుడు కాదు. అతను అంతటా వున్నాడు. జీవిత విస్తృత క్షేత్రంలో యేదో ఒకమూల ఒక వ్యక్తి చరిస్తూవున్నట్లయితే అప్పుడు అతని చర్యలు పరిపూర్ణ స్వరూపానికి చెందకుండా వుండిపోతాయి. మనం పరిపూర్ణత గురించి మాట్లాడుతున్నాం గాని, యేదో ఒక ఖండం - ముక్క - గురించి కాదని గమనించాలి. పరిపూర్ణంలో ఖండం - ముక్క, భాగం - వుంటుందిగాని, భాగంలో పూర్తితనం వుండదుగదా! వ్యక్తి అనేవాడు పరిమితుడు, దుర్బలుడు, నిరాశా పూరితుడు, చిల్లరదేవుళ్లతోను - చొప్పదంటు సంప్రదాయాలతోను తృప్తిపడి పూరుకునేవాడు. మానవుడు అలాకాదు. సమగ్రమయిన సంక్షేమం; పరిపూర్ణ దుఃఖం, ప్రపంచంలోని గందరగోళం అంతా అతని దృష్టిని ఆకర్షిస్తుంది. అతనికి దానితో ప్రమేయం, ప్రసక్తి వున్నది.

లక్షలాది సంవత్సరాలుగా మనం యిలానే వున్నాం: నిండా అసూయగ్రస్తులం, దురాశపరులం, దౌర్జన్యహితులం, అసహనపరులం, ఆదుర్దాలకు నిరాశలకు లోనయిన వాళ్లం. అప్పుడప్పుడు తళుక్కుమని సంతోషము, అనురాగము వెలుగుతూ వుంటాయి. అసహ్యము, భయము, పెద్దమనిషి తరహా - యివన్నీ మనలో విచిత్రంగా కలిసిపోయి వున్నాయి. హింస, శాంతి - రెండూ మనలో మూర్తీభవించివున్నాయి. ఒంటెద్దు బండినుంచి జెట్ విమానస్థాయికి ప్రగతి సంపాదించాం బాహ్య ప్రపంచంలో. కాని, మానసికంగా - ఆంతరికంగా - మనలో యెలాంటి మార్పులేదు. ప్రపంచ వ్యాప్తంగా అన్ని చోట్లా యిలాంటి సాంఘిక వ్యవస్థను 'వ్యక్తే' రూపొందిస్తున్నాడు. మానవ సంబంధ బాంధవ్యాల ఆంతరిక ప్రాతిపదికపైననే బాహ్య సంఘనిర్మాణం జరుగుతుంది. వ్యక్తి అనేవాడు అనుభవాల, ఆలోచనల, ప్రవర్తన తీరుల ఫలితంగానే రూపొందుతున్నాడు. మనలో ప్రతి ఒక్కరము గతాన్నంతా పోగుచేసుకుని వున్న

పాతర, మానవాళి అంతా తనలో మూర్తీభవించినవాడు వ్యక్తి. మానవుడి చరిత్ర అంతా మనలోనే లిఖితమై, ముద్రితమై వుంది.

అధికారలాలస, పదవీ వ్యామోహం, పరువు ప్రతిష్టలకోసం వెంపర్లాట, పేరు ప్రఖ్యాతుల కోసం వెతుగులాట — — యిటువంటి కామనల సముదాయం అయిన పోటాపోటీల సంస్కృతిలో నివసిస్తున్న మీరు, మీలోను — మీకు వెలుపల నిజంగా యేం జరుగుతూ వున్నదో గమనిస్తున్నారా? మీరు గర్వంగా చెప్పుకునే సాధన సంపత్తి, ప్రగతి; ప్రతి సంబంధంలోనూ పైకి తొంగిచూస్తున్న వైరుధ్యము, అసహనం — కిట్టనితనం — క్రౌర్యం — అంతులేని యుద్ధాలు — — వీటన్నిటి మధ్య నివసిస్తున్నాం.

దీనిని యథాతథంగా అర్థం చేసుకోలేక దీనినుంచి భయంతో పారిపోవాలనుకుం టున్నాం. మనకు తెలియనివాటిని గురించి కూడా భయమే. మృత్యువు అంటే భయం, రేపు యేం జరుగుతుందోనని భయం; అంటే మనకు తెలిసినవీ తెలియనివీ కూడా భయాన్నే కలిగిస్తున్నాయి. ఇదీ మన దైనందిన జీవితం. ఇది యేమాత్రం ఆశాజనకంగా లేదు. అందుచేత తత్త్వశాస్త్రం యొక్క అనేక రూపాలు, మత విశ్వాసాల తాలూకు విభిన్న రూపాలు యొక్క అనేక రూపాలు, మత విశ్వాసాల తాలూకు విభిన్న రూపాలు — — యివన్నీ యదార్థం నుంచి మనం పారిపోవడానికే దోహదం చేస్తున్నాయి.

యుద్ధాలు, విప్లవాలు, సంస్కరణలు, చట్టాలు, ఆదర్శవాదాలు — యివన్నీ తీసుకు వచ్చిన బాహిక మార్పులు మనిషి మూలస్వభావాన్ని, తద్వారా సంఘ స్వరూపాన్ని మార్చలేకపోయినాయి. ఈ వికృతమయిన వికార ప్రపంచంలో బతుకున్న మానవులుగా మనను మనం ప్రశ్నించుకుందాం: ఈ సంఘం — పైపోటీ, దుర్మార్గం, భయాలమీద బతుకుతున్న యీ సంఘం ఎప్పటికయినా మారిపోతుందా, అంతమొందుతుందా? ఏదో ఊహలాగ, ఆశలాగ కాకుండా యదార్థంగా యీ పరిణామం సంభవిస్తుందా? మనసు తాజాగా, నూతనంగా, అమాయకంగా తయారయి సరిక్రొత్త ప్రపంచాన్ని తీసుకురాగలుగుతుందా? అది సాధ్యం అవాలంటే ఒకటే మార్గం కనిపిస్తోంది నాకు. మనలో ప్రతి ఒక్కరము ప్రధాన సత్యాన్ని గుర్తించగలగాలి: మనం వ్యక్తులుగా — మానవులుగా, ఈ ప్రపంచంలో యేభాగంలో బతుకుతూవున్నా, మన సంస్కృతి ఎటువంటిదయినా — ప్రపంచంలోని స్థితిగతులన్నిటికీ స్వయంగా సంపూర్ణంగా బాధ్యులమనే విషయం గమనించగలగాలి.

మన జీవితాలలో దౌర్జన్యం నిండి వున్నది. కనుక, ఈ ప్రపంచంలో జరుగుతూ వున్న ప్రతి యుద్ధానికీ మనదే బాధ్యత. మన జాతీయ భావాలు, మన స్వార్థపరత, మన దేవుళ్ళు, మన అసూయలు, మన ఆదర్శాలు — — యివన్నీ మనను విడదీస్తున్నాయి. కేవలం మాటమాత్రంగా అభిప్రాయవంతంగా కాకుండా యీ విషయంలోని యదార్థతను మనం గమనించగలగాలి; మన ఆకలినో బాధనో గమనించేంత స్పష్టంగా, సూటిగా, ప్రపంచంలోని గందరగోళం అంతటికీ మీరు, నేను బాధ్యులం. దుఃఖానికంతకూ మనదే బాధ్యత. ఎందుకంటే, మన నిత్య

జీవితాలతో వున్నదే యిది. తద్వారా యీ సంఘంలో యుద్ధాలు, విభజనలు, అసౌకర్యాలు, క్రౌర్యం, అసూయ – యివన్నీ స్థావరించుకున్నాయి. అలా స్పష్టంగా గమనించగలిగినప్పుడే మనం ఆచరణకు పూనుకోగలుగుతాము.

అయితే, పూర్తిగా విభిన్నమయిన సంఘాన్ని రూపుకట్టటానికి, మీరు నేను – సామాన్య మానవులం – యేం చేయగలం? ఇది చాల గంభీరమయిన ప్రశ్న. అసలు చేయవలసిందంటూ యేమయిన వున్నదా? మనం యేం చేయగలం? ఎవరయినా మనకు ఎరుక పరుస్తారా? అనేకులు అప్పుడే మనకు చెప్పారు. ఆధ్యాత్మ గురువులు – వీళ్లు యీ విషయాలను మన కంటే మెరుగుగా అర్థం చేసుకుంటారని పేరు – ఏవో మెలికలు వేసి మనసు మరొక మూసలో తయారు చేయటానికి ప్రయత్నించారు. కాని యిది మనను ఎక్కువ దూరం తీసుకువెళ్లలేదు. ఉదాత్తులు, జ్ఞానులు ఏవేవో చెప్పారు. కాని యిదీ మనను ముందుకు సాగనివ్వ లేదు. అన్ని మార్గాలు సత్యం వంకే నడుస్తాయని చెప్పారు. మీరు హిందువులయినా, క్రిష్టియన్లయినా, మహమ్మదీయులయినా – అందరి దారులూ ఒకే ద్వారం దగ్గర కలుసుకుంటాయని చెప్పారు. పరిశీలించి చూస్తే యిది గొప్ప అసంబద్ధం అని తెలిపోతుంది. సత్యానికి మార్గం. పథం అంటూ ఏమీ లేదు. సత్యానికి సంబంధించిన సుందరత అదే. అది సజీవమయినది. మృత వస్తువు దగ్గరకు పోవటానికి ఒక మార్గం, పథం వుంటుంది. ఎందుకంటే, ఆ వస్తువు చచ్చి ఒకచోట పడివున్నది గనుక. సత్యం అనేది సజీవము, సచలము అని గమనించినప్పుడు – దానికి విశ్రాంతి మందిరం అంటూ యేమీ వుండదు; దేవాలయం – మసీదు – చర్చి దానికి ఆరామాలు కాదు. ఏ మతము, ఏ గురువు, ఏ తత్త్వజ్ఞుడు మిమ్మి అక్కడకు తోడుకు పోలేడు. ఈ సజీవ వస్తువే మీ స్వస్వరూపం అన్న సంగతి కూడ మీరు గమనిస్తారు. మీ కోపము, దుష్కృత్యము, మీ దౌర్జన్యము, మీ నిరాశ, మీరు నిరతము నివసించే బాధలు – దుఃఖాల పోగు – ఇదంతా అర్థం చేసుకోవడంలోనే సత్యం వున్నది. మీ జీవితంలోని యీ సరంజామాను ఎలా చూడాలి అన్న విషయం తెలిసినప్పుడే యిదంతా క్షుణ్ణంగా అర్థం అవుతుంది. దీన్నంతను ఏదో ఆదర్శవాదంతో, పదాల పరదాలలో, ఆశల వల్లరులలో, భయాల పోగులలో చూడడం కాదు.

మీరు వేరే ఎవరిపైన ఆధారపడి మనగలగడం అసాధ్యం అని తెలిపోయింది. ఎవరూ మార్గదర్శకులు లేరు; గురువులు లేరు; అధిపత్యం లేదు. ఉన్నదంతా మీరే – ఇతరులతో మీ సంబంధ బాంధవ్యాలు, ప్రపంచంతో మీ సంబంధం – యింతకు మించి యింకేమి లేదు. దీనిని గుర్తించినప్పుడు – గొప్ప నిరాశ మిమ్మల్ని కమ్ముకుంటుంది – దాన్లోంచి దోష దర్శిత్వం, క్రౌర్యం పుట్టుకు వస్తాయి; లేదా – ఈ ప్రపంచానికి మీరే బాధ్యులు తప్ప యింకెవ్వరూ కాదన్న నిజం గుర్తించడంతో మిమ్మల్ని చూచుకుని మీరే జాలిపడడం అనే స్థితి సమిసిపోతుంది. సాధారణంగా మనం యితరులను నిందించడంతో కాలం గడిపివేస్తూంటాం. స్వానుకంపకు యిదో రూపం.

మీరు, నేను – మరే బాహ్య సంపర్కము, ప్రభావము లేకుండా, ఎవరి

ప్రోద్బలము, జులుము, శిక్ష పడుతుందేమో నన్న భయము లేకుండా – మనలో సమూలమయిన మార్పును తీసుకు రాగలమా? మానసికంగా ఆకస్మిక పరిణామం తీసుకు రాగలమా? మనం అప్పుడు క్రూరులం కాకుండా, దౌర్జన్య పరులం కాకుండా, పైపోటీ మనోభావం లేకుండా, అదుర్దాలు – భయాలు – అసూయలు – దురాశలు లేకుండా – – యిప్పుడు మన జీవితాలలో నిండిపోయిన కుళ్ళు, కశ్మలము యేమాత్రమూ లేకుండా వుండగలగుతాము.

ముందుగా ఒక విషయం అర్థం చేసుకోవడం అవసరం. అదేమంటే, నేను ఓ తత్త్వ దర్శనాన్ని రూపొందించడం లేదు. మతపరమయిన కట్టడం – అభిప్రాయాల కూర్పు చేయడం లేదు. అటువంటి ఆదర్శాలన్నీ అర్థరహితమని నా ఉద్దేశ్యం. జీవితానికి సంబంధించిన తత్త్వదర్శనం కాదు మనకు కావలసింది; జీవితాన్ని యథాతథంగా – బాహ్యంగా, అంతరికంగా జరుగుతున్నదంతా – చూడగలగడం అత్యవసరం. ఏం జరుగుతున్నదో గమనించి, పరీక్షించుకోగలిగితే యిదంతా యేదో సిద్ధాంత ప్రాతిపదిక మీద జరుగుతున్నట్లు విశదమవుతుంది. సిద్ధాంతం ఒక్కటే ఉనికికి అధారభూతం కాదు. అది ఒక భాగం, అంతే. ఎంత వివేకయుతమయినా, ఎంత పురాతనము – సాంప్రదాయికము అయినా అది ఉనికిలో భాగం మాత్రమేగాని సర్వమూకాదు. జీవితం అంతటితోను మనం వ్యవహరించవలసి వున్నది. ప్రపంచంలో పనులు జరుగుతున్న తీరు చూచినప్పుడు, బాహ్యం – అంతరికం అనే ప్రక్రియ అంటూ విడిగా యేమీలేదని మనకు అవగాహన అవుతుంది. ఒకే ఒక ప్రక్రియ – అది సమగ్రం, పరిపూర్ణంలోని స్పందనమే బయటకూ పరావర్తిస్తుంది. బయటి స్పందనమే తిరిగి లోపలి ప్రక్రియను ప్రభావితం చేస్తుంది. ఈ సంవిధానాన్ని చూడగలగడమే ప్రధాన విషయంగా కనిపిస్తుంది నాకు. ఎలా చూడవలెనో – గమనించవలెనో – నేర్చుకున్నట్లయితే – అంతా స్పష్టం అయిపోతుంది. అలా చూడటానికి తాత్త్విక ధోరణి అవసరం లేదు; గురువుల ప్రమేయం లేదు. ఎలా చూడవలెనో – అ ప్రక్రియ – మరెవరో మీకు చెప్పవలసిన పనిలేదు. కేవలం మీరు చూడడమే అవసరం అయిన పని.

ఈ సమగ్ర చిత్రం గమనించినమీదట – ఉత్తి మాటలలో కాకుండా చేతల ద్వారా గమనించాక – మీరు సరళంగా, ఉన్నట్లుండి మిమ్మల్ని మార్చుకోగలరా? అదీ నిజమయిన సంగతి. మానసిక వాతావరణంలో పరిపూర్ణ విప్లవాన్ని తీసుకురావడం సాధ్యమవుతుందా?

ఈ ప్రశ్నకు మీ ఉత్తరం యేమిటో నాకు తెలియదు. 'నేను మారదలుచుకోలేదు', అని మీరు అనవచ్చును. చాలమంది మనుషుల విషయంలో యిదే జవాబు. ముఖ్యంగా – సాంఘికంగా ఆర్థికంగా తమకు భద్రత వున్నదనుకున్నవారు, ఖచ్చితమయిన విశ్వాసాలు వున్నవారు, తమస్థితితో తాము సమాధానము – సంతృప్తి పడగలవారు, కొద్దిపాటి మార్పులతో అంతా సరిపోతుందనుకునేవారు – యిలాగే వ్యవహరిస్తారు. మనం విచారిస్తున్నది అటువంటి మనుషుల గురించి కాదు. లేకపోతే, మీరు మరోరకంగా సూక్ష్మంగా చెప్పవచ్చును – 'ఇదంతా చాల కష్టమయిన పని; నావల్ల కాదు;' అని. అంటే మీ ద్వారాన్ని మీరే మూసివేసుకున్నారన్నమాట.

విచారణ నిలిపివేశారు. ఇంక ముందుకు వెళ్లి యేమాత్రం ప్రయోజనం లేదు. మీరు మరో విధంగానూ చెప్పవచ్చును. 'నాలో ఆంతరికంగా సమూలయిన మార్పు రావలసి వున్నది అన్న విషయం నేను అంగీకరిస్తున్నాను. అయితే, మా మార్పు తీసుకురావడం ఎలా? నాకు దారి చూపండి, ఆ మార్పువైపుగా నన్ను నడిపించండి,' అనవచ్చును. మీరు యిలానే చెప్పినట్లయితే మీకు మార్పుపట్ల యేమాత్రమూ ఆసక్తి లేదన్నమాట. సమూలమయిన విప్లవంపట్ల మీకు ఆలోచన లేదు: ఏదో ఒక ప్రక్రియ – పద్ధతి కోసం వెదుకాడుతున్నారు, అంతే. వాటివల్ల మార్పు తీసుకు రావచ్చునని అనుకుంటున్నారు. మీకొక పద్ధతిని యిచ్చేంత అవివేకిని నేనయి, ఆ పద్ధతిని అనుసరించేంతటి అవివేకులు మీరయినప్పుడు మీరు కేవలం నకిలీ రాయుళ్లు అవుతారు. అనుకరణదారులు అవుతారు. కట్టుబడిపోయేవాళ్లు, దేనినయినా ఆమోదించేవాళ్లు అయిపోతారు. అంటే, యితరులు చెప్పిన దానిని అధికారికంగా తీసుకుని అనుసరించే గుణం మీలో వున్నదన్నమాట. అప్పుడు మీకు, అధికారానికి మధ్య సంఘర్షణ యేర్పడుతుంది. ఎవరో చెప్పినారు గనుక నేను ఫలానా పనిని చేయవలెను – అనుకుంటున్నారు మీరు. మళ్లీ ఆ పని చేయగల సామర్థ్యం మీకు లేదు. మీ మీ ప్రత్యేక లక్షణాలు, వైఖరులు, ఒత్తుడులు మీకు వున్నాయి. అవి మీరు అనుసరించవలెననుకొన్న పద్ధతిలో సంఘర్షణ తీసుకు వస్తాయి. అప్పుడు వైరుధ్యం యేర్పడుతుంది. అంటే, మీరు విశ్వసిస్తున్న ఆదర్శ వాదానికి, దైనందిన జీవితంలో ఎదురయ్యే యదార్థతకు భిన్నత వుండిపోయి మీరు ద్వంద్వ జీవితం గుడుపుతున్నట్లు అవుతుంది. ఆదర్శవాదంతో అనుగుణంగా వుండడం కోసం, మిమ్మల్ని మీరు అణచుకుంటారు. అయితే, నిజంగా యదార్థం మీరుగాని మీ ఆదర్శవాదం కాదు. మరెవరో చెప్పినట్లుగా, ఆదేశించినట్లుగా మిమ్మల్ని మీరు పరిశీలించ ప్రయత్నించినట్లయితే మీరు యెప్పటికీ నకలు మనుషులుగానే మిగిలిపోతారు.

'నేను మారదలుచుకున్నాను. ఎలా మారవలెనో చెప్పండి –' అని అడిగే మనిషి ఎంతో శ్రద్ధాళువులా అగుపిస్తాడు. కాని, నిజానికి కాదు. అతనికి తనలో ఒక క్రమత తీసుకువచ్చే పద్ధతి, అధికార యుతమయిన ఆదేశము కావాలి. కాని, అధికారం అనేది ఎక్కడయినా 'క్రమత' తీసుకు రాగలుగుతుందా? బయటనుంచి ఆపాదించిన క్రమత తప్పనిసరిగా గందరగోళాన్నే తీసుకువస్తుంది. ఈ మాటలలోని సత్యాన్ని మీరు మానసికంగా అవగాహన చేసుకోవచ్చును. కాని, దీనిని ఆచరణలోనికి తీసుకురాగలరా? అప్పుడు మీ మనస్సు ఎలాంటి అధికారాన్నీ ప్రతిపాదించదు, పుస్తకం – గురువు – భార్య – భర్త – తండ్రి – స్నేహితుడు – లేక సమాజము యేదీ మిమ్మల్ని శాసించదు. మనం ఎప్పుడూ ఒక నియమిత – లేక సమాజము యేదీ మిమ్మల్ని శాసించదు. మనం ఎప్పుడూ ఒక నియమిత చట్రంలో అధికారికం, ఆదర్శయుతం అయిపోతుంది. అయితే 'నేను ఎలా మారగలను' అనే ప్రశ్న వేసుకున్న ఉత్తర క్షణంలో – మరో కొత్త ఆధిపత్యం రంగ ప్రవేశం చేస్తుంది. ఈ విషయం గమనించ గలిగినట్లయితే మీరు అధికార వ్యవస్థ నుంచి శాశ్వతంగా బయటపడినట్లే.

దీనినే మరో రకంగా చెప్పుకుందాం: నేను సమూలంగా - పరిపూర్ణంగా మారిపోవాలనుకుంటున్నాను. ఏ విధమయిన సంప్రదాయాలమీద ఆధారపడలేను. ఎందుకంటే, యీ సంప్రదాయాలు అంతులేని సోమరితనాన్ని, డూ డూ బసవన్న తత్వాన్ని, విధేయతను తీసుకువచ్చాయి తప్ప యింకేమీ కాదు. నేను మరొకరి సహాయం అర్థిస్తూ చూడగల అవకాశం లేదు. ఏ గురువును, భగవంతుడిని, విశ్వాసాన్ని, ప్రక్రియను, బాహ్య ఒత్తిడులను, ప్రభావాలను ఉపకారకమయినవిగా చూడలేను. అప్పుడు యేం జరుగుతుంది?

మొట్టమొదటి సంగతి - మీరు అధికార ఆధిపత్యాలను యేకంగా త్రోసిరాజు అనగలరా? అనగలిగితే, యింక మీరు యేమాత్రం భయస్థులు కాదన్నమాట. అప్పుడు యేం జరుగుతుంది? అనేక తరాలుగా వస్తున్న తప్పుడు విషయాలను మీరు త్రోసిపారేసినట్లయితే, వాటి బరువునుంచి బయట పడగలిగితే అప్పుడు యేం జరుగుతుంది? మీకు యెక్కువ శక్తి ఉన్నట్లు లెక్క. మీకు మరింత సామర్థ్యం, మరింత చొరవ, మహత్తరమయిన తీవ్రత, జీవనసత్వం వున్నాయన్నమాట. మీరు యిలా అనుకోకపోతే, పాత విషయాలను త్రోసిరాజు అనలేరు, అధికార ఆధిపత్యాల బరువులనుంచి బయటపడేవారు కాదు.

దీనంతటినీ త్రోసిరాజు అని, యేమాత్రం భయంలేని జీవసత్వం వున్నప్పుడు - తప్పుచేస్తామని భయంగాని, సరి - కాదు అనే విచక్షణ దంద్వాల భయంగాని లేనప్పుడు - అదే చాలదూ మార్పుకు దోహదం చేస్తున్న శక్తి మీ దగ్గర పుష్కలంగా వున్నదనటానికి? మనకు యిటువంటి జీవనసత్వం పుష్కలంగా అవసరం. అయితే, దీనిని భయాలకు లోబడిపోయి, దూరం చేసుకుంటున్నాం మనం. అన్ని భయాలను త్రోసిరాజు అనేసి యీ శక్తిని నిలుపుకుంటున్నామంటే అదే ఆంతరిక విప్లవానికి అవసర వస్తువును సమకూరుస్తుంది. దానికోసం ప్రత్యేకంగా మీరు చేయవలసిన పని అంటూ యేమీ లేదు.

కనుక మీకు మీరే మిగిలిపోయారు; ఇలాంటి విషయాలలో తీవ్రత వున్న మనిషికి కావలసింది యిదే స్థితి. మీరు సహాయంకోసం మరొకరి వంక - మరో వస్తువు వంక చూడడం లేదుగనుక, మీకు మీరే అన్వేషణ కొనసాగించటానికి తగినంత స్వతంత్రులుగా రూపొందుతున్నారు. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం వున్నచోట - జీవనసత్వం వుంటుంది. స్వాతంత్ర్యం వున్న చోట తప్పు జరిగి పోతుందేమోనన్న భయం వుండదు. స్వాతంత్ర్యం తిరుగుబాటుకన్న భిన్నమయినది. అది వున్నప్పుడు, తప్పు చేస్తున్నామా సరిగా వర్తిస్తున్నామా అనే ప్రసక్తి లేదు. మీరు సర్వ స్వతంత్రులు. ఆ కేంద్రం నుంచే వర్తిస్తారు. భయం అంటూ యేమీ లేదు గనుక. భయావహంకాని మనసు మహోన్నతమయిన ప్రేమను ప్రజ్వరిల్లచేస్తుంది. ప్రేమ వున్నప్పుడు, అది యేమయినా చేయగలదు.

అందుచేత యిప్పుడు మనం చేయబోతున్న పని యేమిటంటే - మనసు గురించి మనం తెలుసుకోవడం. నేను చెప్పిన చొప్పున ఎవరో విశ్లేషణకారుడు, తత్త్వవేత్త చెప్పిన సూత్రాల ప్రకారం అని కాదు. ఇతరుల సూత్రాలను అనుసరించి చూచుకుని, మనను మనం పరిశీలించుకుంటే మనం వాళ్లను గురించి తెలుసుకున్నవాళ్లం అవుతాముగాని,

మనను గురించి మనకు యేమీ తెలియకుండానే పోతుంది. మనం యేమిటో, మన స్వరూప స్వభావాలు యేమిటో స్పష్టంగా తెలుసుకోవాలనుకుంటున్నాం.

మన మానసిక వాతావరణంలో – ప్రాంగణంలో – పరిపూర్ణ విప్లవం తీసుకు రావటానికి, బయటి అధికార ఆధిపత్యాలపై ఆధారపడి ప్రయోజనం లేదని గుర్తించాము గనుక; యిప్పుడు మరో గొప్ప యిబ్బంది యెదురువుతోంది. అది మన ఆంతరిక ఆధిపత్యాన్ని త్రోసిరాజు అనగలగడం. మన చిన్న చిన్న అనుభవాలు, పోగుచేసుకున్న అభిప్రాయాలు, విషయసంచయం, ఆలోచనలు, ఆదర్శాలు – యివన్నీ తీసుకువచ్చే అధికారాన్ని త్రోసిరాజు అనగలగాలి. నిన్న మీకో అనుభవం కలిగింది, దానివల్ల ఒక పాఠం నేర్చుకున్నారు. ఈ పాఠం కొత్త 'అధికారం' స్థాపించుకుంది. వేల సంవత్సరాల నుంచి పోగుచేసుకున్న అధికార ఆధిపత్యం ఎంత వినాశకరమో, యిది – నిన్న నేర్చుకున్నది గూడా – అంతే విద్రోహాకరం. మనను మనం అర్థం చేసుకోవటానికి, యే అధికార ఆధిపత్యములు అవసరం లేదు. నిన్నటిది, వేల సంవత్సరాల క్రిందటిది అయినా సరే, పనికిరాదు. ఎందుకంటే, మనం సజీవ మూర్తులం. ఎప్పుడూ కదులాడుతున్నాం, ప్రాణంతో తొణికిసలాడుతున్నాం. విశ్రాంతంగా లేము. నిన్నటి – పాతకాలపు – మృత అధికార బలంతో మనను మనం వీక్షించుకుంటే, యీ నాటి సజీవ చేతనాన్ని దాని గమనాన్ని అర్థం చేసుకోలేము. ఆ గమనం యొక్క సౌందర్యం, ఉత్తమ ఔన్నత్యం గ్రహించలేము.

అన్ని అధికార ఆధిపత్యాలనుండి విడివడి పోవడం, స్వతంత్రంగా వుండగలగడం – యీ అధికారం మీదయినా, యితరులదయినా ఒకటే – అంటే, నిన్నటి వస్తు సంచయం అంతటినీ విసర్జించ గలగడం అన్నమాట. మనలోని నిన్నటిరూపం మృతి చెందింది. మనసు ఎప్పుడు తాజాగా, యౌవనంతో, అమాయకంగా, శక్తివంతంగా, ఆసక్తికరంగా వుంటుంది. ఈ స్థితిలోనే ఎవరయినా యేమయినా నేర్చుకున్నా, పరిశీలించుకున్నా. దీనికి ఎంతో ఎఱుక అవసరం. మనలో యేం జరుగుతుంది — ఆంతరికంగా వస్తున్న మార్పులు యేమిటి – అన్నది తెలుసుకోవటానికి, దాన్ని మార్పులు చేర్పులు చేయకుండా – యిది సరి, యిది సరికాదు అని వ్యాఖ్యానించకుండా – చూచుకోగలగడం అతిముఖ్యం. సరిదిద్దడానికి ప్రయత్నిస్తున్నారు అంటే – అప్పుడు మీరు మరో 'అధికారం' ప్రవేశపెడుతున్నారన్నమాట. మరో పరీక్షకుడిని నియమిస్తున్నారు.

మనను మనం పరిశోధించుకు చూచుకోదలుచుకున్నాం యిప్పుడు. మీరు చదువుతూ వుండడం మరొకరు వ్యాఖ్యానం వివరణం చేయడం కాదు. మీరు వారితో అంగీకరించడమో, అంగీకరించక పోవడమో కాదు. మన మందరం కలిసి ప్రయాణం చేస్తున్నాం. మన మనసులలోని బహు ఆంతరిక కోణాలలో యేం వున్నదో చూడాలని ప్రయాణం చేస్తున్నాం. అటువంటి ప్రయాణం చేయదలుచుకున్నవారు బహుతక్కువ సరంజామాతో బయలుదేరాలి. అభిప్రాయాలు, ప్రత్యేక అభిరుచులు, పరిసమాప్త వచనాలు – యీ రకమయిన పాతకాలపు వస్తు సముచ్చయంతో కుంగిపోతూ, బరువు మోయలేక భారంగా ప్రయాణం చేయలేము. మిమ్మల్ని గురించి మీరు తెలుసుకున్నదంతా మరచిపొండి; మిమ్మల్ని గురించి మీరు ఊహించుకున్నదీ

– అనుకున్నదీ అంతా  కూడా మరచిపోండి. మనం యేమీ తెలియని వాళ్లమాదిరి, యేమీ యెరుగని వాళ్లమాదిరి యిప్పుడే  యీ ప్రయత్నం ప్రారంభిస్తున్నాం.

నిన్నరాత్రి భారంగా వర్షం కురిసింది. ఇప్పుడు ఆకాశం నిర్మలంగా తయారవుతుంది. ఇది సరికొత్త  రోజు. ఈ సరికొత్త రోజును – యీ ఒక్క రోజే సుమా మనకు లభ్యమయ్యేది అన్నట్లుగా  గడుపుదాం. మనమందరం కలిసి ప్రయాణం చేద్దాం. నిన్నటి వరకు పోగుచేసుకున్న  జ్ఞాపకాలన్నిటినీ వదిలిపెట్టి పోదాం. మొట్టమొదటి సారిగా మనను మనం అర్థం చేసుకోవటానికి  ప్రయత్నం చేద్దాం.

★ ★ ★

# 2

## మనను గురించి తెలుసుకోవడం - సరళత, వినయము - నిబద్ధత.

నేనో లేక యితరులెవరో చెప్పినారు గనుక మిమ్మల్ని గురించి మీరు తెలుసుకోవడం ముఖ్యం అని మీరు అనుకుంటూ వున్నట్లయితే - యిక మనమధ్య అభిప్రాయ వినిమయం ఆగిపోతుంది. మనను మనం పూర్తిగా అర్థం చేసుకోవడం అవసరమని మీరు అంగీకరించితే - అప్పుడు మనమధ్య సత్సంబంధం యేర్పడుతుంది. అప్పుడు మనం కలిసి హాయిగా, జాగ్రత్తగా, వివేకయుతంగా విచారణ చేయగలుగుతాము.

నా మాటలు మీరు నమ్మితీరాలని నేను కోరను. నేను అధిపత్యం నెలకొల్పటానికి ప్రయత్నం చేయడంలేదు. మీకు బోధించటం నా ఉద్దేశ్యం కాదు; నావద్ద కొత్త తత్త్వ దర్శనం, కొత్త పద్ధతి, సత్యానికి సరికొత్త మార్గం అంటూ యేమీలేదు. ఏ రకమయిన అధిపత్యం అయినా - ముఖ్యంగా ఆలోచన, అవగాహన రంగాలలో - వినాశకరం, పాప పంకిలం. నాయకులు తమ అనుయాయులను నాశనం చేస్తారు; అలాగే అనుయాయులూ నాయకులను పాడు చేస్తారు. మీకు మీరే బోధకుడు, శిష్యుడూ అయివుండాలి. విలువయినదనీ, అనవసరమైనదనీ మనిషి భావించిన ప్రతి విషయాన్నీ మీరు ప్రశ్నవేసి తర్కించుకోవాలి.

ఎవరినీ అనుసరించకపోతే, మీకు వంటరితనం అనిపిస్తుంది. వంటరిగానే వుండిపొండి అప్పుడు. వంటరిగా వుండటానికి భయం యెందుకు? మిమ్మల్ని మీరు చూచుకున్నారు. మీలో డొల్లతనం, బద్ధకం, మూర్ఖత్వం, వికారం, తప్పు, అదుర్దా - - యిలాంటివన్నీ కనిపించాయి. మీరు చాల సంకుచితులు, గందరగోళం మనుషులు, నకిలీ వ్యక్తులు అని తేలిపోయింది. నిజాన్ని నిర్భయంగా చూడండి; దానివంక చూపు నిలపండి, దాని నుంచి పారిపోయే ప్రయత్నం చేయకండి. పారిపోవడం ప్రారంభం చేసిన క్షణంలోనే భయం మొలక యెత్తుతుంది.

మనను గురించి మనం విచారణ చేసుకోవడంలో, తతిమ్మా ప్రపంచంనుంచి మనను వేరు చేసుకోవడం లేదు. అదేమీ అనారోగ్యకర ప్రక్రియ కాదు. ప్రపంచంలోని ప్రతి మనిషీ మనమాదిరే దైనందిన సమస్యలలో యిరుక్కుపోయి వున్నాడు. అందుచేత మనను గురించి మనం పరిశీలన చేసుకోవడంలో నీరసంగా వణికే పోవలసింది యేమీ లేదు. వ్యక్తిగా, సామూహికంగా - యీ పరిశీలనలో యెలాంటి వ్యత్యాసమూ లేదు.

వ్యక్తికే, సమాజానికే చేతనం అయిన నన్ను గురించి - నా చుట్టూ వున్న

పరిసర క్షేత్రం గురించి – నేను ముందు అవగాహన చేసుకోవాలి. అప్పుడు యీ వ్యక్తి, సమాజాల పరిధినుంచి మనను అతీతంగా వెళ్లినప్పుడు నాకు నేను వెలుగుగా భాసిస్తాను; ఈ వెలుగు ఎన్నటికీ ఆరిపోదు.

మనను మనం అర్థం చేసుకునే ప్రక్రియను ఎక్కడ ప్రారంభం చేద్దాం? నేను యిక్కడ వున్నాను – నన్ను నేను చదవడం ఎలా, గమనించడం ఎలా, నా అంతరంగంలో యేం జరుగుతుందో చూడడం ఎలా? సంబంధ బాంధవ్యాల సరణిలోనే నేను నన్ను గమనించ గలుగుతాను – ఎందుకంటే, జీవితమంతా యీ సంబంధాల సరాగమే. ఏదో ఒకమూల కూర్చుని నన్ను గురించి నేను ధ్యానం చేసుకుంటే ప్రయోజనం లేదు. నా అంతట నేను ఉండిపోలేను గదా! చుట్టూవున్న మనుషులతో సంబంధించి, వస్తువులతో అభిప్రాయాలతో సమన్వయం అయి – వుంటాను నేను. బయటి వస్తువులు, మనుషులు, ఆంతరిక విషయాలు – వీటన్నిటితో సంబంధించి నా ఉనికిని గమనించగలిగితే అప్పుడే నన్ను నేను అర్థం చేసుకున్నట్లు. మరియే యితర అవగాహన అయినా కేవలం అభిప్రాయాలపోగు, నన్ను అలా చదువుకోలేను. నేనేదో అసంగతమయిన విషయాన్ని కాదు; నేను నా అస్తిత్వాన్ని చదువుకో గలగాలి; గమనించ గలగాలి – నేను ఉన్నట్లుగానే, అంతేగాని నేను ఉందామనుకున్నట్లుగా కాదు.

అవగాహన అనేది మానసిక ప్రక్రియ కాదు. మిమ్మల్ని గురించి మీరు తెలుసుకోవడం, మిమ్మల్ని మీరు అర్థం చేసుకోవడం – యీ రెండూ వేరువేరు విషయాలు. మిమ్మల్ని గురించి మీరు పోగుచేసుకున్న విషయాలన్నీ గతానికి సంబంధించినవి, గతంతో బరువుగా సాగుతున్న మనను దుఃఖభరితమయిన మనసు. మిమ్మల్ని గురించి మీరు తెలుసుకోవడం యేదో ఒక భాష నేర్చుకోవడం, యంత్రాగం నేర్చుకోవడంలో మీరు పోగుచేసుకోవలసిన విషయాలు, గుర్తుంచుకోవలసినవీ ఎక్కువ వుంటాయి. అంతా పునఃప్రారంభం చేయడం అసంబద్ధ విషయం – మానసిక క్షేత్రంలో మటుకు మిమ్మల్ని గురించి మీరు నేర్చుకోవడం అనేది ఎప్పుడూ వర్తమానంలోనే వుంటుంది. జ్ఞాన సంచయం గతానికి సంబంధించినది. మనలో చాలమందిమి గతంలోనే జీవిస్తాము కనుక, అటువంటి జీవనంతోనే తృప్తి పడుతూ వుంటాము. కనుక జ్ఞానం మనకు చాల ప్రధాన విషయంగా తయారయింది. అందుచేతనే మనం పండితులను, తెలివిగలవారిని, మోసగాళ్లను గౌరవిస్తూ వుంటాము. మీరు ప్రతి క్షణమూ గమనం ద్వారా – వినడం ద్వారా నేర్చుకుంటున్నట్లు అయితే, చూడడం, చేయడం ద్వారా నేర్చుకుంటూ వుంటే – అప్పుడు తెలిసి వస్తుంది నేర్చుకోవడం అనేది నిరంతర చలనము – గమనము – అనీ, దానికి గతంతో యేమీ ప్రమేయం లేదనీని.

మిమ్మల్ని గురించి మీరు క్రమక్రమంగా నేర్చుకుంటాను, చిన్నచిన్నగా అనేక విషయాలు జత చేసుకుంటాను – అంటే, మీరు యిప్పుడు వున్నట్లుగా మిమ్మల్ని పరిశీలించుకోవడం లేదన్నమాట. పోగుచేసుకున్న జ్ఞానం ద్వారానే పరిశీలించుకుంటున్నారు. నేర్చుకోవటానికి మహత్తరమయిన సునిశితత్త్వం వుండాలి. గతానికి సంబంధించిన యేదో అభిప్రాయానికి ముడి వేసుకుని వున్నప్పుడు – అది

వర్తమానాన్ని ముంచెత్తి వేస్తున్నప్పుడు – సునిశితత్వం సాధ్యంకాదు. అప్పుడు మనను వాడిగా, పదునుగా, జాగరూకంగా వుండదు. మనలో చాలమందిమి కనీసం భౌతికంగానయినా సునిశితులం కాదు. మనం అతిగా తింటాం, యుక్తాహారం అంటే యేమిటో మనకు గమనంలేదు, అతిగా పొగపీలుస్తాం, తాగుతాం. అందువల్ల మన శరీరాలు మొద్దుబారిపోయి; సునిశితత్వాన్ని కోల్పోతాయి. శరీర తత్వంలో చురుకుతనం, జాగరూకత అనేదే లేకుండా పోతుంది. శరీరం యిలా తయారయితే మరి మనను జాగరూకంగా, సునిశితంగా, స్పష్టంగా ఎలా వుండగలుగుతుంది? మనకేదో వ్యక్తిగత కాంక్షవున్న కొన్ని విషయాలపట్ల సునిశితత్వం వుండవచ్చును; కాని, జీవితానికి సంబంధించిన అన్ని విషయాలపట్ల సమున్నతంగా పరిపూర్ణంగా సునిశితత్వం వుండవలెనంటే – శరీరానికి మనసుకు విభాగం పనికిరాదు, అవి కలిసికట్టుగానే ముందుకు వెళ్లాలి.

అన్నిటినీ అర్థం చేసుకోవటానికి, మీరు దానిని అనుభవించాలి, గమనించాలి. దాని వివరాలన్నీ మీకు తెలియాలి. దాని స్వభావం, నిర్మాణం, కదలిక – అంతా స్పష్టంగా ఎరిగి వుండాలి. మీతో మీరు జీవించడం – అన్నది. ఎప్పుడయినా ప్రయత్నం చేసి చూచారా? అప్పుడు మీకు తెలిసివస్తుంది, మీరు అన్నది ఒక అచల పదార్థం కాదని. అది ఎప్పుడూ సజీవంగా చేతనంగా వుంటుంది.

ఒక సజీవ వస్తువుతో కలిసి జీవించటానికి మీ మనను కూడా ఎప్పుడూ సజీవంగానే వుండాలి. అభిప్రాయాలు, తీర్పులు, విలువలు – – యిలాంటివాటిలో కూరుకుపోతే మనను సజీవంగా వుండలేదు.

మీ మనసు, హృదయాల గమనం, చలనం పరిశీలించటానికి, మీ పూర్తి వ్యక్తిత్వం తెలుసుకోవటానికి, మీకు స్వేచ్ఛగల మనను వుండాలి. ప్రతిదానినీ అంగీకరించడమో, అంగీకరించకపోవడమో చేసే మనను కాదు. వాదాలలో ఒక పక్షం వహించే మనను కాదు. అవగాహన చేసుకునే నిమిత్తం అంతటినీ – వాదప్రతివాదాలను – జాగ్రత్తగా అనుసరిస్తున్న మనను కావాలి. ఇది చాల కష్టసాధ్యం. ఎందుకంటే, మనకు ఎలా చూడాలో తెలియదు, ఎలా వినాలో తెలియదు. మనను మనం చూసుకోవడం చేతకాదు. అలాగే ఒక నది సౌందర్యాన్ని, చెట్లగాలి సవ్వడులను కనడం వినడం చేతకాదు.

మనం సమర్థించడమో, లేక విమర్శించడమో చేస్తూవున్నప్పుడు స్పష్టంగా చూడలేము. మనసులు అంతులేని వదరుబోతుతనంతో నిండిపోయినప్పుడు అంతే. ఉన్నదానిని చూడకుండా దానిని గురించి మనం చేసుకున్న ఊహాపోహలను మాత్రమే చూస్తూవుంటాం. మనను గురించి మనలో ప్రతి ఒక్కరికీ యేదో ఒక అంచనా, రూపం వుంది. మనం ఎలా వుండాలి అనే విషయంలో గూడా మరో అంచనా వుంది. ఆ రూపం, ఆ చిత్రం – మనను మనం వున్నవాళ్లం వున్నట్లుగా చూచుకోకుండా అడ్డుపడుతూంది.

ప్రపంచంలో అతి కష్టమైన పనులలో ఒకటి – దేనినిగాని సరళంగా, సజావుగా చూడగలగడం. మన మనసులు గందరగోళమయినవి గనుక, మనకు సరళత అనేదే

లేకుండా పోయింది. సరళత అంటే బట్ట, ఆహారం విషయంలో కాదు. గోచీ గుడ్డమాత్రమే పెట్టుకోవడం, ఎక్కువ రోజులు ఉపవాసచర్యలో గడుపగలగడం కాదు. ఇదంతా సాధువులు అనుసరించే అపరిణత వ్యవహారం. వస్తువులపట్ల నిర్భయంగా చూడగల సరళత – యేమీ వక్రత, భిన్నత లేకుండా మనను మనం చూచుకోలగడం, అబద్ధం ఆడినప్పుడు అలా అబద్ధం ఆడుతున్నానని చెప్పగలగడం, దాన్నేదో మసిపూసి మారేడుకాయ చేయకుండా వుండడం, దానినుంచి పారిపోవాలనుకోకుండా వుండడం. ఇదీ సరళత.

మనను మనం అర్థం చేసుకోవటానికి ఎంతో వినయం అవసరం. 'నన్ను నేను ఎరుగుదును' అంటూ మీరు ప్రారంభించేస్తే, యింక తెలుసుకోవడం అనేది మానివేశారన్నమాట. లేక, 'నన్ను గురించి తెలుసుకోవలసిందంటూ ఎక్కువ యేమీలేదు. ఎందుకంటే, నేను జ్ఞాపకాలు, అభిప్రాయాలు, అనుభవాలు, సంప్రదాయాల పోగును మటుకే –' అనుకుంటే గూడా మిమ్ము గురించి మీరు తెలుసుకుందుకు ఆటంకం యేర్పడుతుంది. ఏదయినా సాధించిన మరుక్షణంలోనే, మీలో అమాయకత్వం, వినయం అనే ఛాయలు మరుగయిపోతాయి. ఒక తీర్మానానికి వచ్చేసినప్పుడు లేదా ఎరిగిన సమాచారం దృష్ట్యా పరిశీలన చేస్తూ వున్నప్పుడూ మీ పని ముగిసి పోయినట్లే. ఎందుకంటే, ప్రతి సజీవ పదార్థాన్ని మీరు పాతకాలపు మాటలలోనికి అనువదిస్తున్నారన్న మాట. అంటి పట్టుకోవడం, నిశ్చితం, సాధించామనే భావన లేకపోతే, అప్పుడు పరిశీలించటానికి, పొందటానికీ స్వేచ్ఛ ఉంటుంది. స్వేచ్ఛగా చూడగలగడంలో సరికొత్త తనం వున్నది. అంతా ఎరుగుదును అనే విశ్వాసం వున్న మనిషి మృతప్రాయుడయిన మనిషే.

పుట్టిన క్షణం లగాయతు చనిపోయే నిమిషం వరకు మన మనసులు యేదో ప్రత్యేక సంస్కృతిలో, సంకుచిత మార్గాలలో 'నేను – నాది' అనే మూసలో తయారవుతూన్నప్పుడు, మనం స్వేచ్ఛగా చూడగలగడం నేర్చుకోవడం ఎలా సాధ్యం అవుతుంది? శతాబ్దాల తరబడి మనం జాతీయత, కులం, తరగతి, సంప్రదాయం, మతం, భాష, చదువు, సాహిత్యం, కళ, ఆచారం, మర్యాద, రకరకాల ప్రచారం, ఆర్థిక ఒత్తిడి, తినే ఆహారం, నివసించే వాతావరణం, కుటుంబం, స్నేహితులు, అనుభవాలు – – యీ రకమయిన అన్ని ప్రభావాలకు లోనయిపోయి నిబద్ధుల మయ్యాము. అందుచేత, ఏ సమస్యను గురించి ఆలోచించినా మన సమాధానం యీ నిబద్ధతను అనుసరించే వుంటుంది.

మీరు నిబద్ధులయి వున్నారన్న విషయం మీకు తెలుసునా? – ఈ ప్రశ్న ముందుగా వేసుకోవాలి. ఈ నిబద్ధతనుండి బయటపడడం ఎలా అన్న ప్రశ్నకాదు ముందు వేసుకోవలసినది. మీరు దానిలోనుంచి బయటపడలేకపోవచ్చును; 'దీనినుంచి బయట పడాలి' అనుకుంటూనే మీరు మరో బోనులో – మరో నిబద్ధతలో కూరుకుపోవచ్చును. ముందుగా మీ నిబద్ధతను మీరు ఎరుగుదురా లేదా అన్న విషయం ప్రశ్న వేసుకోండి. ఒక చెట్టువంక చూచి 'యిది ఫలానా చెట్టు – – – యిది మర్రిచెట్టు' అని చెప్పకుంటే – అది వృక్షశాస్త్ర సంబంధ తెలివిడి.

ఆమాట మీకూ చెట్టుకూ మధ్య వచ్చి నిలుచుంటుంది. చెట్టును మీరు సరిగా చూడలేకపోతారు. చెట్టుతో సంపర్కం పెట్టుకోవటానికి, మీరు మీ చేయిని దానిమీద వేసి తట్టాలి, అంతేగాని, ఆ పేరు మీకు సంపర్కాన్ని తీసుకురాదు.

మీరు నిబద్ధులయి వున్నారని తెలుసుకోవడం ఎలా? ఎవరు చెబుతారు? మీకు ఆకలిగా వుందని మీకు ఎలా తెలుస్తుంది? – ఆకలిని గురించిన సిద్ధాంతం కాదు, నిజమయిన ఆకలి. అలాగే, మీరు నిబద్ధులయి వున్నారన్న నిజాన్ని మీకు ఎవరు చెబుతారు? ఒక సమస్యకు మీరు ప్రతిస్పందన చేసినప్పుడు, సవాలుకు సమాధానం చెప్పుకున్నప్పుడూ కదూ? ప్రతి సవాలుకు మీ నిబద్ధతను పురస్కరించుకుని సమాధానం చెప్పుకుంటారు. మీ నిబద్ధత కూడా అసమగ్రమయినది గనుక అలా అసంపూర్ణంగానే సమాధానాలు చెప్పుతూ వుంటుంది.

మీకు ఆ విషయం తెలిసి వచ్చిన తరువాత, ఈ జాతి, మత, సాంస్కృతిక నిబద్ధత మీరు బందీ అయివున్నారన్న సంగతిని తెలియ చెప్పుతోందా? ఏదో ఒక నిబద్ధత తీసుకోండి. ఉదాహరణకు: జాతీయత. దాన్ని గురించి తీవ్రంగా పూర్తిగా యోచించండి. ఆ భావం మీకు ఆనందాన్ని యిస్తోందా లేక తిరుగుబాటు తీసుకు వస్తోందా? తిరుగుబాటు తీసుకువస్తునట్లయితే మీరు దీన్నంతటినీ బద్దలు కొట్టుకుని ముందుకు పోదామనుకుంటున్నారా? మీ నిబద్ధత మీకు తృప్తికరంగానే వున్నట్లయితే మీరు అటువంటి పనియేమీ చేయరు. దాన్ని గుమనించి – గుర్తించి – దానితో సమాధాన పడనప్పుడు, దాన్ని గురించి మీరు ఎన్నటికీ యేమీ చేయలేమని గుర్తిస్తారు. ఎన్నటికీ – అంటే, మీరు ఎప్పుడూ గతంలోనే – మరచిపోయి భావాల ప్రచారంలోనే వుండిపోతున్నారన్నమాట!

సుఖం కొనసాగడంలోను, బాధను నెట్టివేయడంలోను – యేదయినా సంఘర్షణ వచ్చినప్పుడే మీరు ఎంత నిబద్ధులయి వున్నారో మీకు అర్థం అవుతుంది. మీ చుట్టూ ఆనందం చక్కగా వెల్లివిరిసి వున్నట్లయితే, మీ భార్య మిమ్మల్ని ప్రేమిస్తూ – మీరు ఆమెను ప్రేమిస్తూ – మీకో మంచి యిల్లు వుండి – ముద్దొచ్చే పిల్లలు వుండి – పుష్కలంగా డబ్బు వున్నట్లయితే – అప్పుడు మీకు మీ 'నిబద్ధత' తెలిసిరాదు. అయితే, యేదో ఒక అవలయ జరిగినప్పుడు – మీ భార్య ఎవరిపయిననో కన్ను వేసినప్పుడు, మీ డబ్బు దుర్వ్యయం అయిపోయినప్పుడు, యుద్ధమో అటువంటి ఆదుర్దా యేదో బెదిరించినప్పుడు – మీ నిబద్ధత మీకు తెలిసివస్తుంది. ఈ రకమయిన ప్రతి బంధకాలనుంచి వైదొలగడానికి తంటాలు పడుతున్నప్పుడు, మిమ్మల్ని మీరు రక్షించుకోవటానికి చూచినప్పుడు – అప్పుడు తెలిసి వస్తుంది మీ నిబద్ధత యేమిటో: మచ్చిక జంతువును వీపు నిమిరినంతసేపూ అది చక్కగానే వ్యవహరిస్తుంది. దానికి యిష్టంలేని పని జరిగిన మరుక్షణంలో దానిలోని దౌర్జన్య ప్రవృత్తి అంతా ఒక్క మారుగా బయటపడుతుంది.

జీతము, రాజకీయాలు, ఆర్థిక సంవిధానము, భయోత్పాతము, క్రౌర్యము, దుఃఖము – ప్రపంచంలోనిది, మనదీని – యివన్నీ మనను చికాకు పరుస్తాయి. ఈ చికాకులోనే మనం ఎంతగా నిబద్ధులమో తెలుసుకుంటాం. అప్పుడు యేం చేస్తాం?

ఆ చికాకులను ఆమోదిస్తూ వాటితో సహజీవనం చేయడమేనా? – మనలో చాలమందిమి చేసేది యీ పనే. నడుము నెప్పితో అలవాటు పడిపోయినట్లే, వాటన్నిటితోనూ సరిపుచ్చుకుంటూ రోజులు గడిపి వేయడమేనా? సర్దుకుపోవడమేనా?

మనందరిలోను ఒక ప్రవృత్తి వుంది – అన్నిటితోనూ సర్దుకుపోవడం అని. అలవాటుపడిపోవడం, పరిస్థితులను నిందిస్తూ కాలం గడపడం, పరిస్థితులు వేరుగా వున్నట్లయితే, నేనూ మరో విధంగానే రూపొందేవాడిని అనో; 'నాకో అవకాశం యివ్వండి; యేం చేస్తానో చూడండి,' అనో; 'అందరూ కలిసి నన్ను అన్యాయం చేశారు' అనో – మన యిబ్బందులను యితరులకు, పరిస్థితులకు, వాతావరణానికీ, ఆర్థిక ఒత్తుడులకు రుద్దటానికి ప్రయత్నిస్తాము.

ఈ చికాకులకు అలవాటు పడిపోయినాడు అంటే, అతని మనను బద్ధకంగా తయారయి పోయిందన్నమాట. మన చుట్టూ వున్న సౌందర్యానికి అలవాటు పడిపోయి దాని అస్తిత్వాన్నే గమనించకుండా వుండిపోతాము గదా! అలవాటు పడిపోకపోతే, దాన్నుంచి పరుగులు తీద్దామనుకుంటాము, ఏ మందో మాకో తీసుకుని, రాజకీయ మఠాలలో చేరి, అరుస్తూ, వ్రాసుకుంటూ, ఆటలకు వెడుతూ – గుడికో గోపురానికో దర్శనానికి నడుస్తూ – – యేదో మరో రకం వినోదం కల్పించుకుంటూ – పారిపోదామనుకుంటాం.

యదార్థ విషయాలనుంచి ఎందుకని పరుగెత్తుకు పోదాం అనుకుంటాం? మనకు మృత్యువు అంటే భయం – ఇది కేవలం ఉదాహరణగానే చెబుతున్నాను. దీనికోసం ఎన్నో రకాల సిద్ధాంతాలు, ఆశలు, విశ్వాసాలు కనిపెడతాం – మృత్యువుకు ముసుగు వేయటానికి. అయినా, యదార్థం అలా యింకా నిలిచే వుంది. యదార్థాన్ని అవగాహన చేసుకోవాలంటే మనం దానివంక చూడగలగాలి; దాని నుంచి పారిపోబోవడం మార్గం కాదు. మనలో చాలమందికి బతుకన్నా భయమే, మృత్యువన్నా భయమే. మనకు కుటుంబం అంటే భయం, పదుగురాడు మాట అంటే భయం, ఉద్యోగం పోతుందేమోనని భయం, మన భద్రత – – యింకా యిలాంటివే వందలాది విషయాలను గురించి భయం. సూక్ష్మ యదార్థం యేమిటంటే – మనకు భయం; దీన్ని చూచీ దాన్ని చూచీ కాదు. ఈ యదార్థాన్ని మనం ఎందుకని ముఖాముఖి సందర్శించలేక పోతున్నాం? యథార్థాన్ని సందర్శించడం అనేది వర్తమానంలోనే సాధ్యం. మీరు ఎప్పుడూ పారిపోవడానికి ప్రయత్నిస్తూ దాన్ని ముందుకు రానివ్వడమే లేదు. పలాయన ప్రక్రియకు అనుగుణంగా మనమో చక్కని వల తయారు చేసుకున్నాం గనుక యీ అలవాటులోనే చిక్కుబడి పోతున్నాం.

మీరు అందరూ సునిశితులు, తీవ్రంగా యోచించేవాళ్లు అయితే, మీ నిబద్ధత మీకు తెలిసి రావడమే కాకుండా, అది తీసుకువచ్చే తదుపరి ప్రమాదాలు కూడా గమనించ గలుగుతారు. అది ఎంత క్రౌర్యం, హింస, దుస్సహ స్థితి తీసుకు వస్తుందో తెలుసుకో గలుగుతారు. మీ నిబద్ధతలో వున్న యీ ప్రమాదాలనన్నిటినీ గమనించినప్పుడు, పని చేయటానికి ఎందుకు పూనుకోరు? మీరు సోమరిపోతులు గనుకనా? – సోమరితనం తగినంత శక్తి – జీవసత్వం – లేకపోవడంవల్ల కలుగుతుంది.

మీ కళ్లకు యెదురుగా యేదో పామో, మంటో, గుంటో వుంటే అస్థూల ప్రమాదం నుంచి తప్పించుకుందుకు అవసరమయ్యే శక్తి మీకు తత్క్షణమే – చూచిన వెంటనే సమకూరుతుందే! మరి నిబద్ధత, దానివల్ల వచ్చే ప్రమాదాలు గమనించినప్పుడు ఎందుకు కార్యాసక్తులు కాలేకపోతున్నారు? జాతీయత అనే నిబద్ధతవల్ల మీ వ్యక్తిగత భద్రతకే ముప్పు వస్తుందని తెలిసినప్పుడు, యేమీ చేయకుండా ముడుచుకు కూర్చుండి పోగలరా?

జవాబు యేమిటంటే – మీరు చూడడంలేదు. సిద్ధాంత పరంగా మటుకు జాతీయతవల్ల కొన్ని ప్రమాదాలు ముంపులు వున్నాయని తెలుసుకున్నారు. వినాశం తటస్థిస్తుందని గ్రహించారు. కాని, ఆ గ్రహింపులో ఉద్వేగ పూరిత అంశం లోపించింది. సరైన ఉద్వేగం సమకూడినప్పుడు, మీరు తగినంత చురుకుదనం, శక్తి సంపన్నత పొందుతారు.

కేవలం సిద్ధాంతంగా – మాటగా మటుకే నిబద్ధతను గమనించితే, మీరు దానిని గురించి యింకేమీ చేయరు. మాటమాత్రంగానే చూచినందువల్ల యీ మాటకు, ఆచరణకు వైరుధ్యం వస్తుంది. ఆ వైరుధ్యం మీ శక్తిసంపదనంతా కొల్లగొట్టుకు పోతుంది. నిబద్ధతను స్పష్టంగా చూచి దానివల్ల వచ్చే ప్రమాదాలను తక్షణమే గమనించగలిగితే – అప్పుడే మీరు కార్యాసక్తులవుతారు. కాబట్టి చూడడమే కార్యఆచరణ.

మనలో చాలమందిమి జీవితాన్ని యాధాలాపంగా తీసుకుంటాము. మనం పెరిగిన వాతావరణానికి అనుగుణంగా స్పందనలు, ప్రతిస్పందనలు చేస్తూవుంటాము. ఇవన్నీ మరింత కట్టుబాటును, బంధనాన్ని తీసుకువస్తాయి. అయితే, మీ నిబద్ధతకు పరిపూర్ణ గమనం యిచ్చినప్పుడు మీరు గతంనుండి విడివడిన వారవుతారు. గతం అంతా మీనుండి సహజంగా వడలి రాలిపోతుంది.

★ ★ ★

# 3

## ప్రజ్ఞ - జీవసంపూర్ణత - ఎఱుక.

మీ నిబద్ధత మీకు ఎఱుక అయిన వెంటనే, ప్రజ్ఞలోని నరంజామా అంతా కూడా తెలిసి వస్తుంది. ఆలోచన, సంబంధ బాంధవ్యాలస్థావరం; వర్తించే సంపూర్ణక్షేత్రం, ప్రజ్ఞ అంటే – అన్ని ఊహాలు, ఆశయాలు, కామనలు, సుఖాలు, భయాలు, స్ఫూర్తులు, కోరికలు, ఆశలు, దుఃఖాలు, సంతోషాలు – యివన్నీ ఆ క్షేత్రంలోనే వున్నాయి. అయితే, యీ ప్రజ్ఞను మనం విభజించాము – చురుకయినది, నిద్రాణమయినది అని., పైదీ, కిందదీ అని. దైనందిన భావనలు, రాగాలు, కార్యకలాపాలు పైకి చెందినవి; అలాకాకుండా అంతరంగంలో వుండి మనకు యింకా అర్థం కానివి. ఇవి అప్పుడప్పుడు లోపలనుంచి పైకి దూకి కొన్ని సూచనలు, స్ఫూర్తులు, కలలు తీసుకువస్తాయి.

మన ప్రజ్ఞా క్షేత్రంలో యేదో ఒక మారుమూల భాగాన్ని ఆక్రమించుకుని దానితోనే జీవిత కాలమంతా గడిపి వేస్తున్నాం. అంతఃచేతనం అని పిలిచే తతిమ్మా ప్రజ్ఞాక్షేత్రంలో మన విభిన్న ఉద్దేశ్యాలు, భయాలు, జాతి – వంశిక లక్షణాలు – యివన్నీ నిండి వున్నాయి. ఈ ప్రాంగణంలోనికి అడుగు వేయడం యెలానో గూడా మనకు తెలియదు. ఇప్పుడు నేను అడుగుతున్న ప్రశ్న యేమిటంటే – అసలు యిలాంటి అంతః చేతనం అనేది నిజంగా వున్నదా – అని. మనం ఆ మాటను అతి తరుచుగా వాడుతూ వుంటాము. అటువంటిది యేదో ఉన్నదని స్థిరంగా విశ్వసిస్తున్నాం. మానసిక వేత్తలు ప్రవేశ పెట్టిన పదజాలాన్ని అంగీకరిస్తూ వచ్చాం. దీనికంతటికీ యెందుకు యింత ప్రాధాన్యం యిస్తున్నాం? చేతన మనను వలెనే అదికూడ అప్రముఖమయినదీ మూర్ఖకమయినదీ అని నా ఉద్దేశ్యం. దాని వలెనే యిదీ సంకుచితము. దురభిప్రాయపూరితము, పరిమితము, అతలాకుతలము, నిస్సారము అయినదే.

అందుచేత – ప్రజ్ఞాక్షేత్రంలో యేదో ఒక మారుమూల భాగం కాకుండా, అంతటినీ సంపూర్ణంగా యెరిగి వుండడం సాధ్యమవుతుందా? సంపూర్ణత పట్ల ఎఱుక వుంటే ప్రతిక్షణమూ పరిపూర్ణ గమనంతో మెలుగుతున్నారన్నమాట: పాక్షిక గమనం కాదు. ప్రజ్ఞాక్షేత్రం అంతటినీ క్షుణ్ణంగా తెలుసుకుని వున్నప్పుడు యింక సంఘర్షణకు అవకాశం లేదు.

మనం జీవితాన్ని ముక్కలు ముక్కలు చేసుకున్నాం. ఆఫీసులో ఒక మాదిరి మనుషులం: యింటి వద్ద మరోరకం. ప్రజాస్వామ్యం గురించి ఉపన్యాసాలు యిస్తాం. హృదయంలో మటుకు నియంతృత్వ ధోరణి స్థావరించుకు పోయివున్నది. పొరుగు వారిని ప్రేమించడం గురించి మాట్లాడుతాం, అయితే, ఆచరణలో పక్కవాడి కుత్తుక కత్తిరించడానికి తయారయేంత పోటీ మనోభావం కనబరుస్తాం. మనలో ఒక భాగం రెండో భాగంతో సంబంధం లేకుండా, స్వతంత్రంగా పనిచేస్తూ వుంటుంది.

ఆచరణ, ఆలోచనలను ముక్కలుముక్కలు చేసుకున్న మేధస్సు సంపూర్ణ క్షేత్రాన్ని గురించి ఎరుగగలదా? ప్రజ్ఞ అంతటినీ ఒక్కుమ్మడిగా చూడగలిగి సంపూర్ణంగా స్పర్శించి, పరిపూర్ణ మానవుడుగా మనగలగడం సాధ్యమా?

'నేను' అనే అహంభావంను పూర్తిగా అర్థం చేసుకోవటానికి, దానిలో యిమిడి వున్న చిక్కులన్నీ సరిగా అవగాహన అవటానికి – ఒక్కొక్క అడుగు జాగ్రత్తగా వేసుకుంటూ, ఒక్కొక్క పొర తొలగించుకుంటూ, ప్రతి ఆలోచనను, భావనను, ఉద్దేశ్యాన్ని జాగ్రత్తగా పరిశీలించుకుంటూ వెళ్లడం అవసరం. ఈ పరిశీలనలో కాలాన్ని ప్రవేశపెట్టుకున్నప్పుడు కొన్ని వారాలు, నెలలు, సంవత్సరాలు యీ ప్రక్రియలో కూరుకుపోవడం కూడా సంభవిస్తుంది. అహం అనేది సంకుల వ్యవహారం గనుక యిందులో ఎన్నో వికృతులు చోటు చేసుకుంటాయి; కీచులాడుతాయి; సజీవంగా – సంఘర్షణయుతంగా – కోరికలతో వేగిపోతూ – వద్దనుకుంటూ, ఒత్తుడులకు బరువులకు లొంగుతూ – యిలా ఎన్నో ప్రభావాలకు లోనవుతూ 'అహం' అనుక్షణం పనిచేస్తూ వుంటుంది. ఈ రకమయిన పరిశీలన వల్ల ప్రయోజనం లేదనే సంగతి కూడా మీకు తెలిసి వస్తుంది. మిమ్మల్ని మీరు చూచుకోవాలంటే – తెలుసుకోవాలంటే – వున్న ఒకే ఒక మార్గం: సంపూర్ణంగా, తక్షణమే – కాలవిరామాన్ని జొనపకుండా – అవలోకించడమే! మనను ముక్కలుముక్కలు కాకుండా అఖండంగా వున్నప్పుడే మిమ్మల్ని మీరు – మీ పూర్ణ స్వభావాన్ని – చూడగలుగుతారు. ఈ పూర్ణ స్థితిలో చూచినదే 'సత్యం.'

ఈ పని మీవల్ల అవుతుందా? మనలో చాలమంది యీ పని చేయలేరు. ఎందుచేతనంటే, సమస్యలను ఎప్పుడూ యింత గంభీరంగా, తీవ్రంగా యెదుర్కోవడం మనం చేయలేదు. మనవైపుమనం నిదానంగా ఎన్నడూ చూచుకోలేదు. ఎన్నడూ చేయలేదు. ఇతరులను నిందిస్తాము. ఏదో లక్షకారణాలు, వివరణలు యిస్తాము. అంతేగాని, పరిశీలనగా చూచుకోవటానికి మనకు భయం. మీరు సంపూర్ణంగా చూచినట్లయితే, మీ పూర్తి గమనాన్ని యివ్వగలుగుతారు; మీ చెవులు – మీ కళ్లు – మీ నరాశయం అంతా పూర్తిగా దీనికోసం ఉయోగిస్తారు. మరో వ్యాపకం పెట్టుకోకుండా యీ పనికి పూనుకుంటారు. అప్పుడు భయానికి ఆస్కారం లేదు. కాదనటానికి అవకాశం లేదు. సంఘర్షణ అనేది యేమాత్రం దరికి రాదు.

సావధానత (Attention) అంటే యేకాగ్రత (Concentration) కాదు. ఏకాగ్రత అంటే ఒక విధంగా వైదొలగి వుండడం. సావధానత అంటే పూర్తిగా మెలుకువగా, జాగరూకంగా వుండి దేనినుంచి దృష్టి తప్పించుకోకుండా వుండడం. నాకు అనిపిస్తుంది చాల మందిమి యిలా సావధానంగా వుండడం అనేది యెరుగమని. కేవలం మనం మాట్లాడుతున్నదానిని గురించే కాదు, మన పరిసరాలు, చుట్టూవున్న రంగులు, జనం, చెట్ల ఆకారాలు, మేఘాలు, నీళ్ల కదలికలు – యివన్నీ గూడా. ఎందువల్లనంటే, మనమంతా కేవలం మనను గురించే ఆసక్తులమయి వున్నాముగాని యింకేమి కాదు. ఎంతసేపటికీ మన కొద్దిపాటి సమస్యలు, మన స్వంత అభిప్రాయాలు, స్వసుఖాలు, వెంపర్లాటలు, కోరికలు – మనకే పూర్తిగా తెలియని యిలాంటి వాటితో నిండిపోయి వున్నాము. అయినా, ఎఱుక, జాగరూకతల గురించి

మాట్లాడుతూ వుంటాము. ఒకమారు ఇండియాలో నేను కారు ప్రయాణం చేస్తున్నాను. కారు ఎవరో నడుపుతున్నారు. నేను అతని సరసనే కూర్చున్నాను. వెనకాల ముగ్గురు పెద్దమనుషులు కూర్చుని వున్నారు. వాళ్లు జాగరూకత గురించి చర్చించుకుంటూ వున్నారు. వాళ్ల సంభాషణ చాల తీవ్రంగా వున్నది; మధ్యమధ్య నన్ను ఎఱుక గురించి ప్రశ్నలు వేస్తూ వున్నారు. దురదృష్టవశాత్తు ఆ సమయంలో డ్రయివరు ఎటో చూస్తున్నాడు. కారు ఓ మేకమీదుగా పరుగెత్తింది. ఆ ముగ్గురు పెద్దమనుషులూ యింకా ఎఱుకను గురించే సంభాషించుకుంటూ వున్నారు. కారు ఓ మేకమీదుగా పోయి దానిని చంపివేసిందనే గమనమే వాళ్లకు లేదు. సావధానత లేకపోవడం అంటే ఇలా వుంటుందని ఎఱుకను గురించి చర్చించుకుంటున్న వాళ్లు ముగ్గురికి చెప్పినప్పుడు, వాళ్లు చాలా ఆశ్చర్యపోయారు.

మనమందరమూ యిలాగే వుంటాము. బయట యేం జరుగుతోందో లోపల మరేం జరుగుతోందో మనకు తెలియదు. ఓ పక్షి, ఓ ఈగ, ఓ ఆకు యొక్క సౌందర్యాన్ని అర్థం చేసుకోవాలంటే; మనిషి తనలోని సంకీర్ణతలు అన్నీ తెలుసుకోవాలనుకుంటే, ఆ విషయానికి మీ పరిపూర్తి సావధానతను యివ్వవలసి వుంటుంది. అదే ఎఱుక అంటే. మీకు నిజమయిన ఆసక్తి వున్నప్పుడే యిలా పూర్తి సావధానత యివ్వటానికి వీలవుతుంది. అర్థం చేసుకుందామని మనస్ఫూర్తిగా హృదయపూర్వకంగా కోరుకుంటున్నారన్నమాట.

ఆ ఎఱుక ఓ సర్పంతో ఒకే గదిలో నివసించడం వంటిది. మీరు దాని కదలికలన్నిటినీ గమనిస్తూ వుంటారు. అది చేసే చిన్న చిన్న చప్పుడులు కూడా మీ గమనంలో వుంటాయి. అలా సావధానంగా వుండడమే పూర్తి జీవసత్త్వం. అటువంటి ఎఱుకలోనే మీ సంపూర్ణత ఒక క్షణంలో తెలివిడి అవుతుంది.

మీ అంతరంగంలోనికి మీరు చూచుకున్న తరువాత, మీరు మరింతలోతులకు వెళ్లవచ్చును. 'లోతు' అనే పదం వాడినప్పుడు కేవలం తులనాత్మకంగా వాడడం లేదు. లోతు – పైపైన, సుఖము – దుఃఖము; యిలా మనం పోల్చిచూచుకుంటూ వుంటాము. మనం ఎంతసేపూ కొలతలు వేస్తూ వుంటాము, పోల్చుకుంటూ వుంటాము. ఒక మనిషిలో నిజానికి పైపైన – లోతు అనే రెండు స్వభావాలు స్థితులు వున్నాయంటారా? నేను 'నా మనసు సంకుచితమయినది, పరిమితమయినది' అన్నప్పుడు నాకు యీ విషయం ఎలా తెలిసివస్తూన్నది? నా మనసుకంటే ఎంతో విశాలము, చురుకు, సమర్థవంతము, తెలివి, జాగరూకము అయిన మీ మనసుతో నేను పోల్చి చూచుకున్నానన్నమాట. పోల్చి చూచుకోకుండా నా బేలతనం నాకు తెలిసివస్తుందా? నాకు ఆకలిగా వున్నప్పుడు, నా ఆకలిని నిన్నటి ఆకలితో పోల్చుకోను. నిన్నటి ఆకలి ఒక మాట, ఒక జ్ఞాపకం.

నేను ఎప్పటికీ మీతో పోల్చి చూచుకుంటూవుంటే, మీ మాదిరే వుండటానికి ప్రయత్నిస్తూవుంటే, నా నిజస్వరూపాన్ని నేను త్రోసిరాజు అనుకుంటున్నానన్నమాట. నాకు నేను ఓ భ్రమ కల్పించుకుంటున్నాను. పోల్చుకోవడం అనేది యే అంతస్తులో జరిగినా అది మరింత భ్రమకు, మరింత దుఃఖానికి మటుకే దారితీస్తుందని

గ్రహించినప్పుడు; నన్ను గురించి నేను ముక్కలు ముక్కలుగా తెలుసుకుంటూ దాని నంతటినీ జోడించి చూచుకుంటూ, బయటివాటితో పోల్చుకుంటూ వున్నప్పుడు; యేదో జాతీయతకు రక్షకుడికి ఆదర్శవాదానికి ముడిపెట్టుకున్నప్పుడు – యీ ప్రక్రియలన్నీ మరింతగా నన్ను స్తబ్ధుడిని చేస్తున్నాయనీ, ఎక్కువ సంక్షోభం తీసుకు వస్తున్నాయనీ గమనించినప్పుడు – యిదంతా చూచినప్పుడు దీనిని పక్కకు నెట్టివేయాలని ప్రయత్నం చేస్తాను. అప్పుడు నా మనను దేనినీ వెదుకులాడడం లేదు. ఈ విషయం అర్థం చేసుకోవడం చాల అవసరం. అప్పుడు నా మనను అక్కడ యిక్కడ తిరుగాడడం, అన్వేషించడం, ప్రశ్నించుకోవడం చేయదు. అంటే, మనను – నాచుట్టూ జరుగుతూన్న వానితో సంతృప్తిపడి వూరుకుంటుందని కాదు అర్థం. ఆ మనసుకు యింకెలాంటి భ్రమలూ లేవు, అపోహలు లేవు. ఆ మనను యిదివరకటికంటే పూర్తిగా భిన్నమయిన ప్రాంగణాలలో అంతస్తులలో తిరుగాడగలుగుతుంది. మనదైనందిన జీవితం వున్న అంతస్తు – బాధలు, సుఖాలు, భయాలు, పరిమిత మనసు, దానికి వున్న నిబద్ధత ఇవన్నీ వదిలిపోయినప్పుడు (అంటే, మీకు ఆనందం లేకుండా పోతుందని కాదు. ఆనందం వేరు, సుఖం వేరు) మనను మరో తీరంలో పనిచేయడం ప్రారంభిస్తుంది. అక్కడ సంఘర్షణ వుండదు; మరొకటి వున్నది అన్న ధ్యాసే వుండదు.

మాటలలో మనం యింత వరకే పోగలం. దీనిపైన వున్న దానిని మాటలలో వర్ణించలేం. ఎందుకంటే, మాట ఆ వస్తువు కాదు. ఇంతవరకు మనం వర్ణించ వచ్చును, వివరించ వచ్చును; కాని, యే వర్ణన, వివరణ కూడా ద్వారాలు తెరువ లేదు. నిజంగా ద్వారాలు తెరుచుకునేట్లు చేసేది – మన దైనందిన ఎఱుక, జాగరూకత, సావధానత. మనం ఎలా మాట్లాడుతున్నాం, యేం మాట్లాడుతున్నాం, ఎలా నడుస్తున్నాం, ఏం ఆలోచిస్తున్నాం – అనేది. ఇదంతా ఒక గదిని తుడిచి శుభ్రం చేసే విధం. గదిని పరిశుభ్రంగా వుండడం చాల ముఖ్యం ఒక రకంగా; కాని మరో రకంగా చూచినప్పుడు యిది అనవసరమయిన శ్రమ. గదిలో క్రమత వుండవలసిందే. కాని, ఈ క్రమత ద్వారాలను తెరిపించలేదు; కిటికీలను తెరవలేదు. ద్వారాలను తెరిపించేది మీ యిష్టము, మీ కోరిక కాదు. ఆ 'అన్యత'ను మీరు ఆహ్వానించ లేరు. మీరు చేయగలదల్లా గదిని శుభ్రంగా క్రమంగా వుంచడమే. దాని సుగుణం దానికి వున్నది; అది యేదో తీసుకు వస్తుందని కాదు. సవ్యంగా సహేతుకంగా సక్రమంగా వుండాలి. తరువాత మీరు అదృష్టవంతులైతే కిటికీ తలుపులు తెరుచుకుంటాయి. గాలి లోపలకు ప్రసరిస్తుంది. లేదా, యీ పని జరగకపోవచ్చును. అదంతా మీ మానసిక స్థితి మీద ఆధారపడి వుంటుంది. ఆ స్థితిని మీరే అర్థం చేసుకోగలరు, దాన్ని గమనించడం మటుకే చూస్తూ, రూపు కట్టటానికి ప్రయత్నించకపోవడం ద్వారా; దాని పక్షం వహించకుండా, వ్యతిరేకించకుండా, ఆమోదించకుండా, సమర్థనలు – ఖండనలు లేకుండా, తీర్మానాలకు రాకుండా – యిలా యేరకమైన భావన లేకుండా కేవలం గమనించడమే చేస్తూ వుంటే, ఎంపిక అంటూ లేని ఈ ఎఱుకవల్ల ద్వారం తెరుచుకుంటుంది, అప్పుడు ఆ అంతస్తు యేమిటో మీకు తెలిసివస్తుంది. దానిలో ఎలాంటి సంఘర్షణ, కాల ప్రమేయము లేదు.

# 4

## సుఖాల వెనుక పరుగులు - కోరిక - ఆలోచన పట్టించే పక్కదారులు - జ్ఞాపకాలు - ఆనందము.

వెనుకటి అధ్యాయంలో ఆనందం అనేది సుఖంకంటె వేరు అనే విషయం ప్రస్తావించాము. ఇప్పుడు సుఖం అంటే యేమిటి, దానిలో యేం యిమిడి వున్నది, అసలు సుఖం అనేదే యేమాత్రమూ లేనటువంటి ప్రపంచంలో నివసించడం సాధ్యమవుతుందా, సుఖం బదులు బ్రహ్మాండమయిన ఆనందం, దివ్యత్వం వున్న ప్రాంగణంలో అడుగు పెట్టగలమా అని ఆలోచిద్దాము.

మనం యేదో ఒక రకం సుఖం కోసం పాకులాడుతూ వుంటాము – మానసికము, ఇంద్రియ లోలత్వము, సాంస్కృతికము, సంస్కరణలతో కూడినది, యితరులకు యేం చేయాలో చెబుతూ వుండడము, సంఘంలో వున్న చెడు దానిని తొలగించడం ఎలా అని, మంచి చేయడం యేమిటి – మహత్తర జ్ఞానం, మరింత దేహ సుఖం, మహదనుభవం, జీవిత పరమార్థ అవగాహన, మనసు చేసే అన్ని జిత్తులు, అన్నిటినీ మించి చిట్టచివరి సుఖం భగవంతుడిని చేరుకోవడం – ఇలా ఎన్నో మనను వాటి వెనుక పరుగులు తీయిస్తాయి.

సంఘం యొక్క భూమిక సుఖం, బాల్యం నుంచి మృత్యువు మనను కబళించే దాకా మనం రహస్యంగా, మర్మంగా లేక బాహాటంగానో సుఖాపేక్షతో పనిచేస్తూ వుంటాము. ఈ సుఖానికీ యే రూపం వున్నా – అదే మన జీవితాలను నడుపుతోందనే విషయం మటుకు గమనించాలి. ఈ సుఖాపేక్షను మనలో ప్రతి ఒక్కరము జాగ్రత్తగా, దగ్గరగా, సుకుమారంగా పరిశీలించవలసిన అవసరం వున్నదని గ్రహించాలి. సుఖాలను కనుగొనడం, వాటిని పోషిస్తూ నిలుపుకోవడం మన జీవితాలలో ప్రాథమిక లక్షణం. ఇది లేకపోతే మన ఉనికి బద్ధకంగా, సోమరిగా, వంటరిగా అర్థరహితంగా తయారవుతుంది.

జీవితాన్ని సుఖం నడిపిస్తే వచ్చిన ఆటంకం యేమిటని మీరు అడగవచ్చును. సుఖం తప్పనిసరిగా బాధను, నిరాశను, దుఃఖాన్ని, భయాన్ని, భయంద్వారా దౌర్జన్యాన్ని – హింసను తీసుకు వస్తుంది. మీరు ఆ రకంగానే జీవనం గడపవలెననుకుంటే అలాగే చేయండి. ప్రపంచంలో చాలమంది యింతే. కాని, యీ దుఃఖంనుంచి పూర్తిగా బయటపడాలని అనుకునేట్లయితే మటుకు, సుఖం యొక్క రూప నిర్మాణాన్ని పరిశీలించి అర్థం చేసుకోవడం అవసరం.

సుఖాన్ని అర్థం చేసుకోవడం అంటే దాన్ని కాదనడం కాదు. మనం దానిని ఖండించడం లేదు. సరికాదు అనడంలేదు; దానినే అనుసరించినట్లయితే కళ్ళు బాగా

తెరిచివుంచుకుని, సుఖాపేక్షతో నిండిన మనసు తప్పనిసరిగా దాని నీడ అయిన దుఃఖాన్ని, బాధను తీసుకు వస్తుందని తెలుసుకుని గమనిద్దాం. ఈ రెండు విడదీయరానివి. మనం ఎంత సుఖం వెనుకనే వెళ్లి దుఃఖాలను తొలగించుకోవాలని ప్రయత్నించినా యీ రెండూ జంటగానే వుంటాయి.

మనసు ఎందుకని ఎప్పుడూ సుఖాలనే ఆపేక్షిస్తూ వుంటుంది? సుఖాపేక్షలో మునిగిపోయి మనం ఎప్పుడూ ఉదాత్తము, అనుదాత్తము అయిన పనులను చేస్తూ వుంటాము. సుఖం తాలూకు పలచటి పొరల దారాలపై ఎందుకు త్యాగాలు, బాధలు కొని తెచ్చుకుంటాము? అసలు సుఖం అంటే యేమిటి? – యిది ఎలా సంప్రాప్తం అవుతుంది? మీలో ఎవరయినా ఈ ప్రశ్నలు వేసుకుని వీటికి సమాధానాలు రాబట్టటానికి ప్రయత్నించారా?

సుఖం అన్నది నాలుగు అంతస్తులలో సంప్రాప్తం అవుతుంది – చూడడం, ఇంద్రియ సహవాసం, సంపర్కం, కోరిక. నేనో అందమైన మోటారు కారును చూస్తాను. దానిని చూచిన మీదట నా యింద్రియాలు చలిస్తాయి. స్పందిస్తాయి. తరువాత దాన్ని తాకుతాను; కనీసం తాకినానని అనుకుంటాను. ఆపైన దానిని పొందాలనే కోరిక. దానిలో తిరుగాడి దర్జా ప్రదర్శించాలని కోరిక. లేకపోతే – నేను అందమైన మేఘాన్ని చూచాననుకోండి. లేదా, ఆకాశంలోనికి చొచ్చుకు పోతున్న పర్వతాన్ని చూస్తాను. వసంతంలో యిప్పుడే బయటకు వచ్చిన లేత ఆకును చూస్తాను. లేదా, సౌందర్యం, శోభ నిండిన అందమైన లోయను చూస్తాను. లేదా, సూర్యాస్తమయ వైభవాన్ని తిలకిస్తాను. లేదా, ఓ సుందర వదనాన్ని చూస్తాను, తెలివితో – సజీవంగా వున్నదో లేక చేతనంలేక అందం కోల్పోయినదో ముఖం! ఈ దృశ్యాల వంక నేను తీక్షణంగా యేకాగ్రంగా చూస్తాను. నేను చూస్తున్నంతసేపూ వేరే చూస్తున్నవారు అంటూ యెవరూ వుండరు. ప్రేమ మాదిరి సౌందర్యం ఒక్కటే అక్కడ వెల్లివిరిసి వున్నది. ఒక్క క్షణంపాటు, నేను – నా సమస్యలు, ఆదుర్దాలు, దుఃఖాలు, మరచిపోయి – యీ వైభవ దృశ్యాన్నే చూస్తూ వుంటాను. ఆనందంగా యీ క్షణం చూడవచ్చును, మరుక్షణం దానిని గురించి మరచిపోవచ్చును. లేదా, మనసు యిందులో ప్రవేశించవచ్చును. అక్కడితో సమస్య మొదలవుతుంది. మనసు తాను చూచిన దృశ్యాన్ని గురించి తలపోసుకుంటూ దాని సౌందర్యాన్ని నెమరువేసుకుంటూ వుంటుంది. ఆ దృశ్యాన్ని మరెన్నిసార్లు చూడాలని అనుకుంటూ వుంటాను. ఆలోచన ఒకదానిని మరోదానితో పోల్చుకుంటూ వుంటుంది. తీర్పు చెబుతూ వుంటుంది. 'రేపు మళ్లీ దానిని అనుభవించాలి' అనుకుంటుంది. ఒక క్షణంపాటు పొందిన అనుభూతి, అది తీసుకువచ్చిన సంతోషము – భావన మూలంగా మరికొంతసేపు కొనసాగుతుంది.

లైంగిక సుఖంకానీ యే యితర సుఖంగానీ – యిదే పద్ధతి. కోరికలో యేమాత్రం తప్పులేదు. స్పందన మామూలు విషయమే. సహజమే కూడా. మీరు నాకు గుండు సూది గుచ్చారనుకోండి, పక్షవాతపు రోగిని కానట్లయితే నేను తప్పకుండా ప్రతిస్పందిస్తాను. అయితే, ఆలోచన మధ్యలో అడుగు పెడుతుంది. సంతోషాన్ని నమిలి మింగుతుంది. దాన్ని సుఖంగా మలుస్తుంది. ఆలోచన యీ

అనుభూతిని మళ్లీ పొందాలని చూస్తుంది. తిరిగితిరిగి అనుభవించిన కొద్దీ, అది మరింత యాంత్రికం అయిపోతుంది. దానిని గురించి ఆలోచించినకొద్దీ ఆ ఆలోచన సుఖానికి మరింత బలాన్ని తీసుకు వస్తుంది. కనుక ఆలోచన అనేది సుఖాన్ని సృష్టిస్తుంది, పోషిస్తుంది. కోరికద్వారా దానిని కొనసాగేట్లు చేస్తుంది. అందుచేత – సుందర రూపంపట్ల మనం చూసే సహజ కామన ప్రతిచర్య భావనవల్ల వక్రం అయిపోతుందన్నమాట. భావన దానిని స్మృతిగా తయారు చేస్తుంది. పదేపదే దానిని గురించి ఆలోచించుకోవడంవల్ల యీ జ్ఞాపకం మరింతగా బలపడుతుంది.

అయితే, జ్ఞాపకాలకు ఒకస్థాయిలో ఒక స్థానం వున్నది. మన దైనందిన జీవనంలో వీటి ప్రసక్తి లేకుండా వుండలేము. దాని క్షేత్రంలో అది చురుకుగా వుండవలిసిన మాట యదార్థమే. అయితే, మనసులో ఓ స్థాయి వుంది. – అక్కడ జ్ఞాపకాలకు యేమాత్రమూ తావులేదు. జ్ఞాపకాల బరువులవల్ల ముడతలు పడని మనసు నిజమయిన స్వేచ్ఛను పొంది వుంటుంది.

మీరు ఎప్పుడైనా యీ విషయం గమనించారా, ఏదయినా వస్తువు – సన్నివేశంపట్ల మీరు పరిపూర్ణంగా, హృదయపూర్వకంగా స్పందించినప్పుడు ఆ సమయంలో జ్ఞాపకం అనే ప్రసక్తి లేదు. మీరు పరిపూర్ణంగా స్పందించనప్పుడే జ్ఞాపకము, దాని తాలూకు వైరుధ్యము, సంఘర్షణ, గందరగోళము, సుఖము – దుఃఖము సంప్రాప్తం అవుతాయి. ఈ సంఘర్షణ జ్ఞాపకాన్ని తీసుకు వస్తుంది. ఈ జ్ఞాపకం యితర జ్ఞాపకాలకు జత అవుతుంది. ప్రతిసారీ జరిగే పని యిదే. స్పందన తీసుకు వచ్చేది యింతవరకూ జతకూడిన జ్ఞాపకాలు. అందుచేతనే జ్ఞాపకాల ఫలితంగా వచ్చే ప్రతి స్పందనా పాతదే. గతానికి చెందినదే; కనుకనే స్వేచ్ఛాయుతం కాదు. 'భావన తాలూకు స్వేచ్ఛ' అనేది యేమీ లేదు. అదంతా అసంబద్ధ విషయం.

భావన, ఆలోచన ఎన్నటికీ నూతనం కాదు. ఎందుకంటే, అది జ్ఞాపకానికి స్పందన. అనుభవానికీ, జ్ఞానానికి స్పందన. ఆలోచన గతానికి చెందినది గనుక మీరు సంతోషంతో చూచిన యీ వస్తువును, క్షణిక సుఖం పొందిన యీ వస్తువును గతానికి చెందినదిగా రూపొందచేస్తుంది. ఆ పాతదాని నుంచే మీరు సుఖం చేరుకుంటారు, అంతేకాని, కొత్త వస్తువు యేమీ లేదు. నూతనంలో కాలప్రమేయం లేదు.

అందుచేత మీరు అన్నిటివంక – ఒక ముఖం, పక్షి, చీరతాలూకు రంగు, సూర్యరశ్మిలో జోగాడుతున్న నీటిపొరల సౌందర్యం – – యిలా మీకు సంతోషం యిచ్చేది యేదయినా సరే – సుఖం అందులో ప్రవేశించకుండా చూడగలిగినట్లయితే, యీ అనుభవాన్ని తిరిగి పొందాలి అనే ఉత్సుకత లేకుండా చూడగలిగినట్లయితే, అప్పుడు బాధలేదు. కనుక బ్రహ్మాండమయిన ఆనందం కలుగుతుంది.

తిరిగి తిరిగి కావాలనుకోవడం, సుఖం కొనసాగాలనుకోవడం, దానిని దుఃఖంగా మార్చి వేస్తుంది. ఈ విషయం మిమ్మల్ని మీరు గమనించి తెలుసుకోవచ్చును. సుఖాన్ని తిరిగి పొందాలనుకోవడంలోనే దుఃఖం చోటుచేసుకుంటూంది. ఎందుకంటే, అది నిన్నటి మోస్తరుది కాదు. అదే సంతోషాన్ని పొందటానికి మీరు యాతన పడతారు; రూప సౌందర్యం ఒకటే కాకుండా మానసిక అంతరికత కూడా యిదే

సంతోషాన్ని గుర్తించాలని తపన పడతారు. అందువల్ల మీకు నిరాశ, నిస్పృహ కలుగుతున్నాయి. అది అలభ్యం అవుతోంది.

కొద్దిపాటి సుఖం మీకు దక్కకుండా పోయిందంటే అప్పుడు యేమవుతుందో మీరు గమనించారా? మీకు కావాలనుకున్నది దొరకక పోయినట్లయితే మీకు అదుర్దా, అసూయ, అసహ్యము యెక్కువయిపోతాయి. మీకు తాగడమో, తినడమో, లైంగికానందమో, యేదో ఒక సుఖం అందనప్పుడు మీలో యెలాంటి మార్పులు కలుగుతున్నాయో యెప్పుడయినా గమనించారా? అదంతా భయం యొక్క రూపాంతరం; కదూ? మీకు కావాలనుకున్నది దొరకదేమో, ఉన్నది కాస్తా లేకుండా పోతుందేమో అని విపరీత భయం, అనేక సంవత్సరాలపాటు మీరు ఆశ్రయించి వున్న సిద్ధాంతమో ఆదర్శమో మొదలంట కదలిపోయినప్పుడు, తర్కంవల్లనో జీవితంవల్లనో అది చిరిగిపోయినప్పుడు – మీరు వంటరిగా నిలబడడానికి భయపడిపోతారు గదూ? ఆ సిద్ధాంతం, విశ్వాసం మీకు సంవత్సరాల తరబడి తృప్తిని సుఖాన్ని యిచ్చింది. అది వైదొలగినప్పుడు మీరు వంటరివాళ్లయిపోతారు, డొల్లలవుతారు; మరో సుఖము మరో విశ్వాసము చేజిక్కేంతవరకు మీరు భయావహులయిపోయే వుంటారు.

ఇదంతా నాకు చాల సజావుగా, సరళంగా అగుపిస్తోంది. ఇంత సరళంగా వున్నది గనుకనే దాన్ని త్రోసిరాజు అంటాము. మనకు ప్రతిదానినీ చిక్కుముడులు వేసుకోవడం అలవాటు. మీ భార్య మీదగ్గర నుండి వెళ్లిపోయిందంటే, మీకు అసూయగా లేదూ? మీకు కోపం రావడం లేదూ? ఆమెను ఆకర్షించి కైవశం చేసుకున్న ఆ పురుషుడిపట్ల మీకు అసహ్యం కలగడం లేదూ? అదంతా యేమిటి, యిన్నాళ్లూ మీకు సుఖాన్ని యిచ్చిన వస్తువును యిప్పుడు పోగొట్టుకోవలసి వస్తోందే అన్న భయంకాక! ఎన్నో సంవత్సరాల సాహచర్యం, భరోసా, నాదీ అన్న తృప్తి యివన్నీ సడలిపోతున్నాయి గదూ!

సుఖంకోసం అన్వేషణ వున్నచోట తప్పనిసరిగా దుఃఖం, బాధ స్థావరించు కుంటాయని అర్థం చేసుకున్నప్పుడు, కావాలనుకుంటే అలాగే జీవించండి. కాని తెలుసుకోకుండా దానిలో జొరబడకండి. సుఖాన్ని అంతమొందించదలచుకుంటే – అదే దుఃఖాన్ని అంతమొందించడం కూడాను – మీరు సుఖ స్వరూపం అంతటినీ మెలుకువగా వుండి గ్రహించాలి. సన్యాసులు, మునులు చేసినట్లుగా దాన్ని తెంచివేసుకుంటే కుదరదు. వాళ్లు అదేదో పాపకార్యమని భయపడుతారు కనుక స్త్రీవయిపు చూడనే చూడరు. తద్వారా తమ అవగాహనలో సత్త్వం లేకుండా చేసుకుంటున్నారు. మీరు సుఖం తాలూకు పూర్తి అర్థాన్ని, ప్రత్యేకతను గమనించటానికి ప్రయత్నించండి. అప్పుడు మీకు జీవితంలో బ్రహ్మాండమైన ఆనందం లభిస్తుంది. మీరు ఆనందాన్ని గురించి ఊహించలేరు. ఆనందం తక్షణమే లభించేది. దానిని గురించి ఊహలు, ఆలోచనలు చేసుకుంటూ వుంటే, అది కాస్తా సుఖంగా మారిపోతుంది. వర్తమానంలో జీవించడం అంటే, సౌందర్య దర్శనాన్ని తత్క్షణమే పొందడమూ, దానివల్ల ఆనందపడడమూ, దాని నుంచి సుఖాన్ని ఆపేక్షించకుండా వుండడమూను.

★ ★ ★

# 5

## స్వానురక్తి - పదవులకోసం వెంపర్లాట - భయాలు, పూర్తి భయావస్థ - ఆలోచన ముక్కలు ముక్కలుగా తెగిపోవడం - భయాన్ని అంతం చేయడం.

మనం యింకా ముందుకు పోవటానికి పూర్వం, మీ జీవితంలో ప్రధానమయినది, ఎప్పటికీ కొనసాగేంత అభిరుచికరమయినది యేమిటి అని అడుగుదామనుకుంటున్నాను. అస్తవ్యస్తమయిన జవాబులు పక్కకు పెట్టి, ఈ ప్రశ్నకే ముఖాముఖి కూర్చుని, నిజాయితీగా మీరు యేం సమాధానం చెబుతారు? మీకు తెలుసునా?

మీరే కదూ? మనం నిజాయితీగా జవాబు చెప్పేట్లయితే, చాలమందిమి చెప్పేదీ యిదే. నా అభివృద్ధి, ఉద్యోగం, కుటుంబం, నేను నివసించే చిన్న గూడు, ముందు రాబోయే ఉన్నతస్థితి, మరింత గౌరవం, మరింత అధికారం, యితరులమీద ఆధిపత్యం - యిలా అనేకం – నాకు అభిరుచిదాయకమైన విషయాలు. మనలో చాలమందిమి యిటువంటి అభిరుచినే పొంది వుంటామనీ – 'నేను' అనేదే ప్రముఖమయినదనీ గమనించడం, తార్కికంగా గ్రహించడం, అర్థం చేసుకోవడం అవసరం అనుకుంటాను.

మనలో మనకు ఆసక్తి వుండడం తప్పు అని కొంతమంది చెప్పవచ్చును. అయితే, యిందులో తప్పు యేముంది – అతి అరుదుగా మనం యీ విషయాన్ని అంగీకరిస్తున్నామన్న సంగతి తప్ప! అలా అంగీకరిస్తే, మనను మనం కించపరచుకున్నట్లు బాధపడతాం గూడా. ఇంతకూ విషయం యిదీ – ప్రతి మనిషీ తనను గురించే తాను ఆసక్తుడయివుంటున్నాడు. అయితే, అనేక ఆదర్శ, సంప్రదాయ కారణాలవల్ల యిలా ఆసక్తుడయి వుండడం తప్పు అనుకుంటున్నారు. ఏమి అనుకుంటున్నదీ ప్రస్తుతాంశంకాదు. తప్పు అన్న సంగతి యిక్కడ ప్రవేశబెట్టడం దేనికి? అది ఒక భావన, ఆలోచన. యదార్థం యేమిటంటే – ప్రతి మనిషి ప్రాథమికంగాను, జీవితం పొడుగునా తనపట్ల తాను ఆసక్తుడయివున్నాడు, అనేది.

మిమ్మల్ని గురించి మీరు ఆలోచించుకుంటూ కూర్చోవడం కాకుండా, యితరులకు సహాయం చేయడం మరింత తృప్తిని యిచ్చే వ్యవహారమని మీరు చెప్పవచ్చును. రెంటికీ తేడా యేమిటి? రెండు స్వానురక్తులే. ఇతరులకు సహాయం చేయడంలో మరింత తృప్తి లభిస్తున్నదీ అంటే, మీకు మరింత తృప్తి పొందడంలో అనురక్తి వున్నదన్నమాట. దానిలోనికి యేదో సిద్ధాంతం, ఆదర్శం తీసుకురావడం యెందుకు? రెండు నాలుకల మాటలు ఎందుకు? 'నాకు కావలసింది తృప్తి – లైంగికంగా

కానీ, యితరులకు సహాయం చేయడంలో కానీ, సన్యాసి అవడంలోగానీ, శాస్త్రజ్ఞుడు రాజకీయ వేత్త అవడంలోనోగానీ' – అని ఎందుకు చెప్పకూడదు? దేనికయినా ఒకటే ప్రక్రియ గదా! సూక్ష్మము, స్పష్టము యిన పద్ధతులు అన్నిటిలోను తృప్తి పొందటమే మనకు కావలసింది. స్వేచ్ఛ కావాలి అనుకుంటున్నామంటే, ఈ స్వేచ్ఛవల్ల మనకేదో మహదానందం వస్తుందని, తృప్తి కలుగుతుందనీ భావిస్తున్నామన్నమాట. అసంతృప్తి అనేది యేమాత్రమూ తొంగిచూడని పరిపూర్ణ తృప్తి మనకు కావాలి.

సంఘంలో అనామకంగా వుండడం అంటే మనకు భయం. అందుకని యేదో ఒక పదవికోసం పాకులాడుతాం. సంఘ నిర్మాణం కూడా ఎలా తయారయిందంటే, యేదో ఒక పదవి వున్న మనిషికి ఎక్కువ మర్యాద దొరుకుతుంది; యే పదవీ లేనివాడు యెందుకూ కొరగానివాడిలా చూడబడతాడు. ప్రతివారికీ ప్రపంచంలో యేదో ఒక పదవి, అంతస్తు కావాలి. కుటుంబంలో పెద్దరికం కావాలి. భగవంతుని కుడి పక్కన కూర్చునే అధికారం కావాలి. ఈ అంతస్తును తతిమ్మా వారందరూ గుర్తించాలి, గమనించాలి. లేకపోతే, యిది అంతస్తే కాదు. మనం ఎప్పుడూ వేదిక మీదనే కూర్చోవాలి. అంతరంగంలో మనం దుఃఖము, అల్లరి, ఆగము నిండివున్న సుడిగాలులం. అందుచేత బయటకు అతి ఆడంబరంగా డాంబికంగా అగుపించడం చాల అవసరం. ఇలా పదవి, ప్రతిష్ఠ, అధికారం, సంఘంలో మన్నన కావాలనుకోవడం యితరులకంటే మనం అధికులం సుమా అని చాటుకోవడమే. ఆధిక్యం కోసం ప్రాకులాడడం ఒక రకమయిన దురాక్రమణ. ఒక మఠంలో తన ఆధిక్యాన్ని నిలుపుకోవడం కోసం తాప్రతయపడుతున్న సన్యాసి, తగిన స్థావరం కోసం కుమ్ములాడుతున్న కోడి కంటె మిన్న అయినవాడు కాదు. ఈ దౌర్జన్య – దురాక్రమణ భావనలకు కారణం యేమిటి? భయం. అంతేకదూ!

జీవితంలోని మహత్తర సమస్యలలో భయం ఒకటి. భయంలో చిక్కుకుపోయిన మనసు గందరగోళంలో, సంఘర్షణలో యిరుక్కుంటుంది. అందుచేతనే దౌర్జన్య పూరితంగా, వికృతంగా, దురాక్రమణకు పూనుకుంటుంది. తన ఆలోచన ధోరణుల నుంచి వెలికివచ్చి వర్తించటానికి పూనుకోదు. కనుకనే ద్వంద్వ ప్రవృత్తి యేర్పడుతుంది. భయంనుండి పూర్తిగా వైదొలగేంతవరకు – ఎత్తయిన పర్వతారోహణ చేసినా, అన్ని రకాల భగవంతుళ్లనూ అన్వేషించినా – మనం అంధకారంలోనే కూరుకుపోయి వుంటాము.

ఇలాంటి భ్రష్టమయిన, అవివేక సమాజంలో నివసిస్తూ, భయాన్ని ఉత్పన్నం చేసే పోటాపోటీల చదువుల వలలో యిరుక్కుపోయి, మనలో ప్రతివొక్కళ్లమూ యేదో ఒక భయంలో మునిగిపోతున్నాం. భయం యెంత విహ్వలమయినదంటే, అది మనను కుదుతుంది, మెలిపెడుతుంది, బతుకును దుర్బలం చేస్తుంది.

స్థూలమయిన భయం ఉంది. ఇది జంతు శ్రేణి నుంచి మనం తెచ్చుకున్న లక్షణం. ఇప్పుడు ప్రధానంగా ఆలోచిస్తున్నది మానసిక భయాలనుగురించి. మనసులో లోతుగా దిగిపోయిన భయాలను గురించి తెలుసుకుంటే అప్పుడు జంతు భయాలు వాటంతట అవే తొలగిపోతాయి. ముందుగానే జంతువుల నుంచి సంక్రమించిన

భయాలను గురించి ఆలోచిస్తూ వుంటే – మానసిక భయాలను ఎప్పటికీ అర్థం చేసుకోలేము; తొలగద్రోసుకోలేము.

మనకందరకు యేదో ఒక భయం. నిరాకృతమయిన భయం అంటూ యేమీ వుండదు. భయం ఎప్పుడూ దేనిని గురించో – యే వస్తువునో ఆశ్రయించుకుని వుంటుంది. మీ భయాలు మీరు యెరుగుదురా? ఉద్యోగం పోతుందేమోనని భయం, తగినంత ఆహారం – డబ్బు వుండకుండా పోతాయేమోనని భయం, మిమ్మల్ని గురించి పొరుగువారు – యితరులు యేవి. అనుకుంటారో అని భయం, గెలుపు పొందలేకపోతామేమోనన్న భయం, సంఘంలో స్థాయి చెదిరిపోతుందేమోనని భయం, ఎవరేనా అసహ్యించుకుంటారేమో – నిందిస్తారేమోనని భయం, బాధ – ఈ వ్యాధులను గురించి భయం, ఆధిపత్యాన్ని గురించి భయం, ప్రేమ అంటే ఎన్నటికీ యేమీ ఎరగక పోవడం గురించి భయం, ఎవరూ ప్రేమించడం లేదేనని భయం, భార్య పిల్లలు వదిలి వేస్తారేమోనని భయం, మృత్యువు గురించి భయం, మృత్యుగుహ్వారంలాగ విసుగెత్తుతున్న యీ ప్రపంచంలో వుండిపోవాలే అని భయం. యితరులు మిమ్మల్ని గురించి ఊహిస్తున్న స్థాయికి తగినట్లుగా జీవించలేకపోతామేమోనన్న భయం, విశ్వాసం సడలుతుందేమోనన్న భయం, – యిలా అసంఖ్యాకంగా వున్నాయి భయాలు. వాటిని గురించి మీరు యేం చేస్తారు సాధారణంగా? వాటి బారినుంచి తప్పించుకు పారిపోవాలనుకుంటారు కదూ? వాటిపై ముసుగులు వేయటానికి ఏవో కొత్త ఆలోచనలు, రూపాలు పన్నుతారు. భయంనుంచి పారిపోవడం అంటే – దానిని యితోధికం చేసుకోవడమే సుమా.

భయానికి ప్రధానమయిన కారణం యేమిటంటే – మనను మనం ముఖాముఖి కలుసుకోకపోవడమే; మనకు మనం ఎదురుపడటానికి భయపడుతూ వుండడమే. వాటినుంచి పారిపోవటానికి మనం అన్వేషించిన తెరలను వలలను పరిశీలించి చూచుకోవాలి. ముందు, మేధస్సుతో కూడిన మనసు భయాన్ని తొలగించుకో చూచినట్లయితే, నొక్కి పెట్టాలనుకునేట్లయితే, దానిని క్రమశిక్షణలోనికి తీసుకువచ్చి నిగ్రహించాలనుకున్నట్లయితే, దానికి మరేదో నామకరణం చేయాలని చూచినట్లయితే – అప్పుడు సంఘర్షణ వస్తుంది. సంఘర్షణ – మన శక్తిని వృథాపుచ్చటమే అవుతుంది.

అలాంటప్పుడు మనకు మనం వేసుకోవలసిన మొదటి ప్రశ్న యేమిటంటే – భయం అంటే ఏమిటి? అది ఎలా ఉత్పన్న మవుతోంది? అసలు భయం అనే పదానికి మనం చెప్పుకునే అర్థం యేమిటి? భయం అంటే ఏమిటి – అని ప్రశ్నవేసుకుంటున్నాను, నాకు దేనిని గురించి భయం అని ప్రశ్న వేసుకోవడం లేదు.

నేనో రకమయిన జీవితం గడుపుతున్నాను. ఒక చట్రంలో ఆలోచిస్తాను. నాకు కొన్ని నమ్మకాలు విశ్వాసాలు వున్నాయి. వాటిని చెల్లాచెదురు చేసుకోవడం నాకు యిష్టం లేదు. ఎందుకంటే, వాటిలో నేను సమూలంగా పాతుకుపోయి వున్నాను. వాటిని కదిలించడం నాకు యెందుకు యిష్టం వుండదంటే – దానివల్ల నేను మరింత గందరగోళంలో పడిపోతానేమోనని భయం. నాకు తెలిసినదీ, నేను నమ్ముతున్నదీ నాముందే చిరిగిపోతే ముందు ముందు నేను యెలాంటి స్థితిలో

వుంటానో తెలుసుకుందామని అనిపిస్తుంది. అందుచేత, మెదడు కణాలు కొన్ని క్రమచక్రాలను తయారుచేసుకున్నాయి. అనిశ్చితమయిన మరోరకం చక్రాలను తయారు చేసుకోవడం వాటికి యిష్టం వుండదు. నిశ్చితస్థితి నుండి యేదో అనిశ్చిత స్థితికి పోవడం అనేదానిని నేను భయం అని పిలుస్తున్నాను.

ఈ క్షణంలో – యిక్కడ కూర్చుని వున్న తరుణంలో నాకేమీ భయంలేదు. వర్తమానాన్ని గురించి నాకు బెంగలేదు. నాకేమీ జరగడం లేదు. ఎవరూ నన్ను బెదిరింటడం లేదు. నానుంచి దేనినీ తీసుకుపోవడం లేదు. కాని, ఈ తక్షణ మహూర్తం నుంచి – అవతల, మనసులో యేదో లోతులు వున్నాయి. ముందు యేదో ఉపద్రవం జరుగుతుందనీ, వెనుకటిది యేదో తరుముకు వస్తుందనీ అనిపిస్తోంది. అందుచేత నాకు గతాన్ని గురించి భవిష్యత్తును గురించి భయం. కాలాన్ని గతము, భవిష్యత్తు అని విభజించుకున్నాను. ఆలోచన – భావన – ముందుకు అడుగువేస్తుంది. 'మళ్లీ అలా జరగకుండా జాగ్రత్తపడు' అని హెచ్చరిస్తుంది. లేదా 'భవిష్యత్తుకోసం సంసిద్ధుడవయి వుండు. ముందు ముందు నీకు ప్రమాదాలు జరగవచ్చు. ఇప్పుడు వున్నది ఊడిపోవచ్చును; రేపు నీవు చనిపోవచ్చును, నీ భార్య లేచి పోవచ్చును, నీ ఉద్యోగం పోవచ్చును. నీకు తగినంత పేరు ప్రతిష్టలు రాకపోవచ్చును. నీవు వంటరివాడవు కావచ్చును. రేపు యేం జరుగుతుందో స్థిరం చేసుకో;' అని హెచ్చరిస్తుంది.

మీ ప్రత్యేక 'భయం' విషయమే తీసుకోండి. దాని వంక నిదానించి చూడండి. మీ ప్రతిచర్యలను గమనించండి. ఏ మాత్రం పారిపోవడం, సమర్ధన, ఖండన నొక్కి పట్టటం అనేది లేకుండా దానివంక చూడగలరా మీరు? భయాన్ని కలిగించే ఒక్కమాట ప్రసక్తి కూడా లేకుండా మీరు భయం వంక తేరిపారి చూడగలరా? మృత్యువు వంక చూడగలరా మీరు; మృత్యు భయం ప్రసక్తి లేకుండా? ఆ మాటే భయోత్పాతాన్ని కలిగిస్తుంది. ప్రేమ అనే మాట ఎంతో కంపనాన్ని, తనదే అయిన స్వరూపాన్ని తీసుకు వచ్చినట్లుగానే ఈ మాట కూడా భయ కంపనాలను తీసుకు వస్తుంది. ఇప్పుడు మీ మనసులో మృత్యురూపం గూడు కట్టుకు వుంది, ఎన్నో చావులు చూచారు; మీరు చూచిన మృత్యు సన్నివేశాలు మీ మనసులో యింకా రూపుకట్టుకునే వున్నాయి. మీకు భయాన్ని కలుగచేస్తున్నవి, ఈ రూపాలు కదూ? లేక మీకు నిజంగా అంతరించి పోవడం అంటే భయమా, అంతరించి పోతామన్న భావన తాలూకు రూపం అంటే భయమా? మృత్యువు అనే మాట భయం కలిగిస్తోందా లేక నిజంగా అంతమయిపోతామనే భావనా? ఆ మాట, దాని జ్ఞాపకము మీకు భయం కలుగచేస్తోంది. అంతేకాని, నిజంగా భయం అంటూ యేమీ లేదు.

రెండు సంవత్సరాల క్రితం మీకు సుస్తీ చేసింది. ఆ బాధ, ఆ జబ్బు యింకా మీకు జ్ఞాపకం వున్నాయి. ఆ జ్ఞాపకం మీకు తరచు హెచ్చరిక యిస్తూ వుంటుంది; 'జాగ్రత్తగా వుండు, మళ్లీ సుస్తీ పడకు', అని. ఆ బాధతో వచ్చిన జ్ఞాపకాలు మీకు భయం కలిగిస్తున్నాయి. భయం మిమ్మల్ని తాకడమే లేదు. ఎందుకంటే, యిప్పుడు మీరు చాల ఆరోగ్యంగా వున్నారు. భావన ఎప్పుడూ గతానికి సంబంధించినది.

ఎందుకంటే, భావన జ్ఞాపకాలలోంచి పుడుతుంది. భావన – కాలవిరామంలో మీరు భయపడి వున్నారు అనే తలుపును తీసుకు వస్తుంది. అది నిజమయిన భావన కాదు. నిజం యేమిటంటే – మీరు చక్కని ఆరోగ్యంతో వున్నారు. కాని, మనసులో పేరుకుపోయిన జ్ఞాపకాలు, అనుభవము తాలూకు భావనలు, ఒక ఆలోచనను ముందుకు తీసుకువస్తాయి. 'జాగ్రత్తగా వుండు సుమా, మళ్లీ సుస్తీ పడకు', అని.

కనుక, భావన ఒక రకమయిన భయాన్ని ఉత్పన్నం చేస్తున్నది అనే విషయం చూచాం. అయితే దీన్నించీ విడిగా – భయం అంటూ యేదయినా వున్నదా? భయం ఎప్పుడూ భావనకు ఫలితంగా యేర్పడేదేనా లేక యింకో రకమయిన భయము వున్నదా? మనకు మృత్యువు అంటే భయం. అంటే – సమయవిస్తారంలో రేపో యెల్లుండో ఎప్పుడో జరగుబోయే సంఘటన అంటే భయం. యదార్థస్థితికీ ముందెన్నడో జరుగబోయే దానికి చాల విరామం వున్నది. భావన యీ స్థితిని అనుభవించింది. మృత్యువును గమనిస్తూనే అది, 'నేను చనిపోబోతున్నాను', అనుకుంటుంది. భావన మృత్యుభయాన్ని కలిగిస్తుంది. అలా కాకపోతే, యింకే రకమయిన భయమయినా వున్నదా?

భయం అనేది భావన ఫలితంగానే వస్తోందా? అలా అయినట్లయితే, భావన ఎప్పుడూ గతానికి చెందినదే గనుక, భయం ఎప్పుడూ గతంలోనిదే. మనం యిదివరకే అనుకున్నట్లుగా కొత్త ఆలోచన అంటూ యేమీలేదు. మనం దానిని గుర్తించినట్లయితే, అది ఎన్నటికీ పాతదే – గతానికి చెందినదే అన్న విషయం గమనిస్తాం. గతం పునరావృతం అవుతుందేమోననే మనకు ఎప్పుడూ భయం. భావన భవిష్యత్తులోనికి చొచ్చుకుపోయి, వెనకటి అనుభవాలను ముందుకు తెస్తుందేమోనని భయం.

అందుచేత భావనే భయానికి మూలం అన్న విషయం తేలిపోయింది. మీరే యీ సంగతి క్షుణ్ణంగా గ్రహించవచ్చును. ఏదయినా ఆపద ఎట్ట ఎదుట నిలబడినప్పుడు – భయం అనేది లేదు. భావన అందులో – ఆ సన్నివేశంలో – ప్రవేశించినప్పుడే భయం యేర్పడుతోంది.

అందుచేత మన ప్రస్తుతాంశం యేమిటంటే – మనసుకు ఎప్పటికీ సంపూర్ణంగా పూర్తిగా, వర్తమానంలోనే వుండగలగడం సాధ్యమా? – అని. ఈ ప్రశ్నను అర్థం చేసుకోవటానికి, ముందుగా మనకు భావన యొక్క తీరు తెన్నులు, జ్ఞాపకాలు – సమయం గురించిన వ్యవహారము పూర్తిగా తెలిసి వుండాలి. కేవలం మాటలలో ఊహలలో అర్థం చేసుకోవడం కాకుండా, హృదయపూర్వకంగా, త్రికరణ శుద్ధిగా తెలుసుకోవాలి. అప్పుడు భయం నుంచి వైదొలగడం జరుగుతుంది. భయం ఉత్పన్నం కాకుండా భావన బయలుదేరుతుంది. మనస్సు భయాన్ని తీసుకు రాకుండా భావాలను మాత్రం ప్రసరించగలుగుతుంది.

భావన, జ్ఞాపకాల వలెనే, దైనందిన జీవనానికి చాల అవసరం అయిన వస్తువు. వ్యవహార జ్ఞానంలో యితరులతో సంభాషించడంలో మనకున్న ఏకైక ఆయుధం యిదే. భావన, జ్ఞాపకాలకు ప్రతిచర్య. అనుభవం, విషయ పరిజ్ఞానం, సంప్రదాయం, సమయం – వీటితో నిండి జ్ఞాపకాలకు ప్రతిరూపంగా భావన యేర్పడుతోంది.

ఈ వాతావరణం నుంచి మనం ప్రతిచర్యలు అవలంబిస్తున్నాం. ఈ ప్రతిచర్య – ఆలోచన. కనుక కొన్ని కొన్ని స్థాయిలలో ఆలోచన చాల అవసరం అయినదే అయినప్పటికీ ఆ ఆలోచన మానసికంగా – భూత భవిష్యత్తులలో చొచ్చుకు వస్తున్నప్పుడు, సుఖదుఃఖాలను తీసుకు వస్తున్నప్పుడు, మనసు బద్ధకంగా తయారయి, యేమీ పని చేయకుండా వుండడం జరుగుతుంది.

నేను అడిగే ప్రశ్న యేమంటే, 'నేను ఎందుకు భవిష్యత్తును గురించి పదేపదే ఆలోచిస్తున్నాను? సుఖదుఃఖాల ప్రమేయంలోనే భవిష్యత్తును ఎందువల్ల రూపొందించుకుంటున్నాను? భావన మానసికంగా ఆగిపోవటానికి సాధ్యం కాదా? సాధ్యం కాకపోతే, భయం ఎప్పటికీ అంతరించకుండా అలాగే వుండిపోతుందే!'

భావన యొక్క పరిశ్రమ యేమంటే – యెప్పుడూ యేదో ఒక విషయం పట్ల ఆసక్తమయి వుండడం. మనలో చాల మందిమి యెప్పుడూ మన మనసులో యేదో ఒక విషయంతో నిండిపోయి వుండాలనుకుంటాము. అలా కాకపోతే మనసు మనం ముఖాముఖి చూచుకోవడం అవుతుంది. మనకు ఖాళీగా, రికామీగా వుండడం అంటే భయం. మన భయాల వంక చూచుకోవడం అంటే భయపడిపోతాం.

బయటకు కనిపిస్తున్న భయాలను గురించి మీరు ఎరిగి వుండవచ్చును. కాని అంతరంగంలో గూడు కట్టుకుని వున్న భయాలను గురించి యేమయినా యెరుగుదురా మీరు? అలా రహస్యంగా లోతుపాతులలో దాగొని వున్న భయాలను యెలా కనిపెట్టగలరు? భయాన్ని గూడా బహిరంగము – అంతరంగము, గుప్తము అని విభాగం చేసుకోవాలా? ఇది చాల ముఖ్యమయిన ప్రశ్న. ప్రత్యేక నిపుణుడు, మానసికవేత్త, విశ్లేషణకారుడు భయాన్ని బహిరంగ చేతనం, అంతరంగ చేతనం అనే విభాగాలు చేసి చూపారు. మీరు మానసిక విశ్లేషకారుడినిగాని నన్ను గాని – మేం చెబుతున్నది మాత్రమే గమనించుతూ చూచినట్లయితే, మీరు మమ్మల్ని చూడడం అవుతుంది గాని మిమ్మల్ని మీరు చూచుకోవడం కుదరదు, మిమ్మల్ని గురించి మీరు అర్థం చేసుకోవడం మీ వల్లనే జరగాలి గాని, యే ఫ్రాయిడ్ ప్రకారమో, యంగ్ ప్రకారమో, నా ప్రకారమో జరగకూడదు. ఇతరుల ఆలోచనలు, సిద్ధాంతాల వల్ల ఎంత మాత్రం ప్రయోజనం లేదు. మిమ్మల్ని మీరే ప్రశ్నవేసుకోవాలి. భయం అనేదానిని, బహిరంగ చేతనం – అంతరంగ చేతనం అని విడదీయడం అవసరమా? అనేక రకాల రూపాలలోనికి అనువదించుకునే 'భయం' ఒక్కటే ఒక్కటి కదూ. ఒకే ఒక్క కోరిక. కోరిక మటుకే. మీరు 'కావాలి' అనుకోవడం. కావాలనుకుంటున్న వస్తువు మారిపోతూ వుంటుంది. 'కోరిక' – కావాలి అనుకోవడం మటుకు ఎప్పుడూ ఒక్కటే. అదేరకంగా భయం అనేది గూడా ఒక్కటే ఒక్కటి. మీకు దేనిని చూచినా భయమే, కాని, భయం మటుకు ఒక్కటే.

భయాన్ని యిలా ముక్కలు ముక్కలు చేయడం – విభజించడం – అనేది కుదరదు అని గుర్తించిన మీదట, 'అంతరంగ చేతనం' అనే ప్రక్రియను పక్కకు పెట్టి మానసిక శాస్త్రవేత్తలను, యితరులను త్రోసి రాజు అంటున్నారన్నమాట. భయం అనేది ఒకే ఒక గమనం; కదలిక. అనేక దారులలో పోతుంది. ఆ కదలిక చూస్తారు తప్ప మీరు వస్తువును పట్టించుకోరు. అప్పుడు మీకు అపురూపమయిన

ప్రశ్న ఎదురు అవుతుంది; మనసు యిన్నాళ్లు అలవాటు చేసిన - ప్రతిదానినీ ముక్కలు ముక్కలు చేసి చూడడం అనే లక్షణం అపాదించకుండా, దానివంక యేకముఖంగా చూడడం ఎలా?

'పరిపూర్ణ భయం' మటుకే వుంది. ముక్కలకు విభాగాలకు అలవాటుపడిన మనసు దాన్ని ఎలా గమనించగలదు? గమనించగలదా అసలు? మనం అతుకుల బతుకులు సాగదీస్తున్నాం. ముక్కలు ముక్కలుగా విరిగిన భావనల పరంగా ఆ సంపూర్ణ భయాన్ని చూడగలమా? భావన యంత్రాంగం యొక్క పద్ధతి యేమిటంటే, ప్రతిదానినీ ముక్కముక్కలుగా చేసి వేయడం: నాకు మీరంటే యిష్టం: మీరంటే అసహ్యం. మీరు నాకు శత్రువు. మీరు నాకు స్నేహితులు; నా ప్రత్యేక మనోభావాలు, చాదస్తాలు, వైఖరులు, నా ఉద్యోగం, నా ఉన్నతి, నా ప్రతిష్ట, నా భార్య, నా పిల్ల, నా దేశం - మీ దేశం, నా భగవంతుడు - మీ భగవంతుడు - యిదంతా భావన తీసుకువచ్చిన తునాతునకలు కదూ? ఈ భావన సంపూర్ణ భయం వంకచూచి - చూడటానికి ప్రయత్నించి - దాన్ని కూడా ముక్కలు ముక్కలుగా విరుస్తుంది. అందుచేత, భావన అనేది కదలకుండా వున్నప్పుడు, గమనం లేనిస్థితిలోనే - మనసు సంపూర్ణ భయాన్ని యథాతథంగా చూడగలుగుతుందని మనకు అర్థం అవుతుంది.

ఏమాదిరి ముగింపు, యింతవరకూ పోగుచేసుకున్న పాండిత్యం తాలూకు జోక్యం లేకుండా మీరు భయాన్ని గమనించగలరా? మీరు అలా గమనించ లేకపోయినట్లయితే, మీరు గమనిస్తున్నదంతా గతాన్నేనన్నమాట; భయాన్ని గాదు. మీరు గమనించ గలిగేట్లయితే, గతంతో ప్రమేయం లేకుండా భయాన్ని మొట్టమొదటి మారుగా యిప్పుడు చూస్తున్నారన్నమాట.

మనసు ప్రశాంతంగా వున్నప్పుడు మటుకే చూడడం సాధ్యం అవుతుంది. మీ మనసు తన ధోరణిలో తాను గొణుక్కుంటూ వున్నప్పుడు మీరు యితరులు చెప్పే సంగతులను యెలా వినలేదో, అలాగే మనసు ప్రశాంతంగా లేనప్పుడు పూర్తి గమనం యివ్వడం కుదరదు. మీ భయం వంక - దానిని విరమింపచేయాలి అనే భావం లేకుండా - చూడగలరా? భయానికి వ్యతిరేక పదజాలం, ఆ భావనలు తీసుకురావడం దానిని చూడగలరా? 'దీనిని నేను నిగ్రహించాలి, తొలగ ద్రోసుకోవాలి, అర్థం చేసుకోవాలి!' అనుకున్నప్పుడు - దానినుండి పారిపోవటానికి ప్రయత్నిస్తున్నారన్నమాట.

ఒక మేఘాన్ని - ఒక వృక్షాన్ని - ఒక నది కదలికలను ప్రశాంత మనసుతో చూడగలుగుతారు. ఎందుకంటే, అవి మీకు యేమీ కావు; ముఖ్యమయినవి కానేకావు. మిమ్మల్ని మీరు గమనించగలగడం చాల కష్టం - - ఎందుకంటే, మిమ్మల్ని గురించిన ఎన్నో కోరికలు త్వరత్వరగా మిమ్మల్ని ముసురుకుంటాయి. భయం, నిరాశ మిమ్మల్ని ఎదుర్కొన్నప్పుడు, వంటరి తనం - అసూయ - యిలాంటి వికృత మానసికస్థితి లోగొనప్పుడు, మీరు దానివంక పరిపూర్ణంగా యేమీ అరమరిక లేకుండా చూడగలరా?

మనసు భయాన్ని గమనించగలదా? భయం తాలూకు విభిన్న రూపాలను కాకుండా మీరు భయపడుతున్న స్థితిని కాకుండా - కేవలం భయాన్నే గమనించగలదా?

భయం తాలూకు వివరాల వంకనే చూస్తూ ఒకదాని తర్వాత మరొకటిగా మీ భయాలను మందలింపుతో గమనిస్తూ – మీరు ఎన్నటికీ అసలు విషయానికి రాలేరు. అసలు విషయం యేమిటంటే, భయంతో సహజీవనం చేయడం!

సజీవమయిన భయంవంటి వస్తువుతో సహజీవనం చేయవలెనంటే – మనసు, హృదయము ఎంతో సూక్ష్మంగా, లలితంగా వుండాలి. ముగింపులు, తీర్మానాలు లేకుండా ప్రతి 'భయ' కదలికను గమనిస్తూపోవాలి. అప్పుడు దాన్ని గమనిస్తూ దానితో మసలుతూ వుంటే – యిది చేయడానికి రోజంతా అవసరంలేదు – భయంయొక్క పూర్తి స్వరూపాన్ని తెలుసుకోవటానికి -ఒక్క క్షణం చాలు – మీరు దానితో పూర్తిగా సామరస్యంగా వుండగలిగితే అప్పుడు తప్పనిసరిగా యిలా అడుగుతారు: 'భయంతో జీవిస్తున్న మనిషి ఎవరు? భయాన్ని గమనిస్తున్న మనిషి ఎవరు?' – భయం తాలూకు సర్వరూపాలను సందర్శిస్తూ, మూల విషయం 'భయాన్ని' గుర్తించి – ఆ భయాన్ని గమనిస్తున్న మనిషి ఎవరు? గమనిస్తున్నప్పుడు మృతజీవుడా? కదలిక లేనివాడా? తనను గురించి ఎంతో విషయం, వివరం పోగుచేసుకున్న వాడా? ఆ మృత విషయమా భయాన్ని – సజీవ భయాన్ని – గమనిస్తూ వున్నది? గమనిస్తున్నవాడు గతానికి చెందినవాడా లేక సజీవుడేనా?' వీటికి మీ జవాబులు యేమిటి? నాకు మీ జవాబులు చెప్పనవసరంలేదు. మీకు మీరే చెప్పకోండి. పరిశీలకులుగా మీరు – సజీవ విషయాన్ని గమనిస్తున్న మృతజీవులా – లేక సజీవ విషయాన్ని అలాగే సజీవంగా గమనిస్తున్నవారా? పరిశీలకులలో యీ రెండు లక్షణాలూ స్థితులూ వుంటాయి.

పరిశీలకుడు భయాన్ని కోరుకోనివాడు. తన అనుభవమంతా పూర్తిగా రంగరించు కున్నవాడు. కనుక భయం అని అతను పిలుస్తున్నదానికంటే అతను విభిన్నుడు. ఈ రెంటికీ మధ్య విరామం వుంది. అతను ఎప్పుడూ దానిని అధిగమించాలని ప్రయత్నిస్తున్నాడు. అందుకనే అతనికి భయానికి మధ్య యీ నిరంతర సంఘర్షణ, జీవసత్త్వాన్ని అంతటినీ దుర్వ్యయం – వృథాచేస్తున్న సంఘర్షణ.

మీరు గమనిస్తూ వుండగా, పరిశీలకుడు అంటే కేవలం కొన్ని అభిప్రాయాల, ఆలోచనల పోగు మటుకే అన్న విషయం గమనిస్తారు. ఆ జ్ఞాపకాల పోగుకు యేమాత్రం విలువ, విధానంలేదు. కాని, భయం మటుకు యదార్థం. ఆ యదార్థ విషయాన్ని మీరు అర్థం చేసుకుందుకు ప్రయత్నిస్తున్నారు. అరూపంగా అది మీకు అర్థంకాదు. కాని, నిజానికి, 'నేను భయపడుతున్నాను' అని చెప్పే పరిశీలకుడు తాను పరిశీలిస్తున్న భయం అనే పదార్థంనుండి వేరు అయిన వాడా? పరిశీలకుడే భయం. ఆ విషయం చక్కగా అవగాహన అయినప్పుడు, యిక జీవసత్త్వం వృథా అయిపోవడం అంటూ యేమీలేదు. భయాన్ని వదిలించుకోవడం కోసం శక్తి సామర్థ్యాలను వ్యర్థపరచడం అనేది లేదు. పరిశీలకుడు – పరిశీలన అనే సమయ విభాగం కూడా అంతరించి పోతుంది. మీరు భయంలో ఒక భాగమేనని, దానినుంచి వేరు కాదనీ – మీరే భయమనీ – గమనించినప్పుడు, యిక మీరు దానిని గురించి యేమీ చేయలేరు. అప్పుడు భయం సంపూర్ణంగా తనంత తాను అంతరించిపోతుంది.

★ ★ ★

# 6

## దౌర్జన్యం - కోపం - సమర్థన, ఖండన - ఆదర్శము: నిజంగా వున్నదీ.

భయము, సుఖము, విచారము, భావన, దౌర్జన్యము – యివన్నీ ఒకదానితో మరొకటి సంబంధించి వున్నవే. మనలో చాల మందిమి దౌర్జన్యంపట్ల ఉత్సాహం చూపుతాము,' యితరులను అయిష్టపడటానికి జంకము. ఇతరులపట్ల వ్యతిరేక భావనలు వుండడం అతి సహజంగా భావిస్తాము. అయితే, దౌర్జన్యం సమసిపోయిన మనసులో – ఆ మానసిక స్థితిలో – దౌర్జన్యం, అది తీసుకు వచ్చే సుఖాలు, సంఘర్షణలు, అసహనతలు, భయాలు – వీటన్నిటికంటె మిన్న, విభిన్నమయిన ఆనందం వెల్లివిరుస్తుంది.

మీరు దౌర్జన్యం తుట్టతుదివరకు వెళ్లి దాని అంతు చూడగలరా? లేక పోతే మనం ఎప్పటికీ నిరంతర యుద్ధం చేసుకుంటూనే వుండిపోతాం. మీరు జీవితం గడపదలుచుకున్న మార్గం యిదే అయినట్లయితే – చాలమంది యిలాగే కొనసాగిస్తారు – అలాగే కానివ్వండి. అలా కాకుండా 'ఊహు. యిదంతా బాగాలేదు. దౌర్జన్యం ఎన్నిటికీ సమసిపోదు,' అనేట్లయితే, అప్పుడింక నేను చెప్పవలసింది యేమీలేదు. మీరు దారికి అడ్డుకట్ట వేసినట్లే. అలాకాక యింతకంటే మరొక జీవన విధానం వున్నదని మీరు భావించేట్లయితే అప్పుడు మనమధ్య సంభాషణకు ఆస్కారం వుంటుంది.

అందుచేత మనమంతా కలిసి ఆలోచిద్దాం. మనలో దౌర్జన్యం యొక్క రూపాలన్నీ అంతం చేసుకుని, యింకా యీ దారుణ ప్రపంచంలో మనగలగడానికి అవకాశం వున్నదా అని ఆలోచిద్దాం. అవకాశం వున్నదనే నా అభిప్రాయం. నాలో అసహ్యము, అసూయ, ఆదుర్దా, భయము అనేది మచ్చుకయినా వుండగూడదు. పూర్తిగా ప్రశాంతంగా బతకాలని వుంది. అంటే, చనిపోవాలని అర్థంకాదు. మహాద్భుతమైన యీ భూమిమీద, యీ సుందర ఐశ్వర్యాల నడుమ నాకు నివసించాలనే వుంది. చెట్లవంక చూడాలి. పువ్వులు, నదులు, మైదానాలు, స్త్రీలు, బాలురు, బాలికలు – – వీటన్నిటినీ గమనిస్తూ పూర్తిగా ప్రశాంతంగా ప్రపంచంలో సమరసంగా వుండాలని నా భావం. అలా చేయగలగడం ఎలా సాధ్యం?

యుద్ధాలు, తిరుగుబాట్లు, దేశీయ పోరాటాలు, వర్గపోరాటాలలో బాహాటంగా కనిపించే దౌర్జన్యం వంక తేలికగా చూడగలం. అలాగే మన అంతరంగంలో గూడు కట్టుకున్న దౌర్జన్యాన్ని గురించి గూడా చూచుకోగలగాలి. మనం యీ రెంటినీ కూడా దాటి యింకా లోతుగా వెళ్లగలగాలి.

ఇది చాల గందరగోళమయిన పరిస్థితి. శతాబ్దాల తరబడి మనిషి దౌర్జన్యపూరితుడై వున్నాడు. మతాలు అతన్ని మెత్తబరచ చూచాయి గాని, అవి యేమాత్రం విజయం సాధించలేక పోయాయి. అందుచేత మనం ఈ ప్రశ్నను అర్థం చేసుకోవాలని నిజంగా అనుకునేట్లయితే యెంతో గంభీరంగా తీవ్రంగా ముందుకు అడుగు వేయాలి. మనం వేరే ఒక ప్రాంగణానికి వెడుతున్నాం. కేవలం మానసిక ఆనందం కోసం, కుతూహలం కొద్దీ యిదంతా చర్చిద్దాం అనుకునేట్లయితే ఎక్కువ దూరం పోనవసరం లేదు.

ఈ విషయమై నేను తీవ్రంగానే ఆలోచిస్తున్నాను. కాని ప్రపంచంలోని యితర మనుష్యులకు యింతటి తీవ్రత లేదు – అందుచేత నేను యేం చేయగలను, అని మీరు అనుకోవచ్చును. ఇతరులు గంభీరంగా తీవ్రంగా వున్నారా లేదా అనే విషయం నేను పట్టించుకోను. నేను తీవ్రంగా వున్నాను, అదే చాలును. నేను యితరుల తరఫున పనిచేయడం లేదు. ఒక మానవుడుగా, దౌర్జన్యాన్ని గురించి సమాలోచన చేస్తున్నాను. నా మటుకు నేను దౌర్జన్య పూరితంగా వుండకుండా జాగ్రత్త పడతాను. మీకుగాని యితరులకుగాని 'మీరు దౌర్జన్యపరులు కాకండి' అని చెప్పలేను. ఆ మాటకు అర్థంలేదు. అందుచేత మీరు నిజంగా దౌర్జన్యం తాలూకు సమస్యను అర్థం చేసుకోదలుచుకుంటే మన ఆలోచన గమనాన్ని కొనసాగిద్దాం.

దౌర్జన్య సమస్యలు అక్కడ వున్నాయా – యిక్కడ వున్నాయా? బయటి ప్రపంచంలో యీ సమస్యలను పరిష్కరించాలనుకుంటున్నారా లేక మీలో మూర్తీభవించి వున్న దౌర్జన్యాన్ని యథాతథంగా చూడాలనుకుంటున్నారా? మీలో దౌర్జన్యం అంతా అంతరించి పోయినట్లయితే అప్పుడు ఒక ప్రశ్న ఉదయిస్తుంది: 'దౌర్జన్యంతో, దురాక్రమణతో, అసూయా, దురాశ, క్రౌర్యంలతో నిండిన యీ ప్రపంచంలో నేను ఎట్లా మనగలను? నేను నాశనం అయిపోనూ?' అని. ఇదే అందరూ తప్పని సరిగా అడిగే ప్రశ్న. ఈ ప్రశ్న అడుగుతున్నారూ అంటే మీరు ప్రశాంతంగా జీవితం గడపడం లేదనే నా ఉద్దేశ్యం. మీరు హాయిగా వున్నట్లయితే అప్పుడు యింక సమస్య అంటూ యేమీలేదు. సైన్యంలో చేరనందుకుగాను మిమ్మల్ని జైలులో పడవేయవచ్చును. యుద్ధం చేయనందుకుగాను కాల్చివేయవచ్చును. కాని అదో సమస్యకాదు. ఆ విషయాన్ని అర్థం చేసుకోవడం అత్యవసరం.

దౌర్జన్యం అనేదానిని ఉన్నది ఉన్నట్లుగా అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాం. అంతేకాని ఒక అభిప్రాయంగా ఆలోచనగా కాదు. మనుషుల్లో వున్న దౌర్జన్యం. నేనే మనిషిని. ఈ సమస్యను అవగాహన చేసుకోవటానికి నాలోనికి నేను పోగలగాలి. పూర్తిగా చొరబడ గలగాలి. నన్ను నేను తెలివిడి చేసుకోవాలి. మీముందు, మీకు అంత ఆసక్తి లేదు గనుక, యీ విషయాలన్నీ తెలివిడి చేయడం అనవసరం. దీన్నంతటినీ చివరికంటా చూడటానికి అవసరమయిన మనస్థితి నాకు వుండాలి. మధ్యలో ఆగిపోయి, యికముందుకు అడుగువేయలేను – అనగూడదు.

నేను దౌర్జన్య పూరితుడిని; యీ విషయం నాకు ముందుగా స్పష్టం అవాలి. కోపంలో, లైంగిక సంబంధాలలో, అసహనంలో, శత్రుత్వంలో అసూయలో – – యిలా ఎన్నింటిలోనో నేను దౌర్జన్యాన్ని అనుభవించాను. ఎక్కడో యుద్ధంలో ప్రదర్శితమయే

దౌర్జన్యం కాకుండా, మనిషిలో వుండే యీ దురాక్రమణ భావం, జంతువుల్లో వుండేది – – యిదంతా నాలో భాగం – – తెలుసుకోవాలనుకుంటున్నాను.

మరొకళ్ళను చంపడమే దౌర్జన్యం కాదు. పదునయిన మాట వాడడం కూడా దౌర్జన్యమే. ఎవరేనా మనిషిని వెళ్లిపొమ్మని చేయి విసిరినప్పుడు, భయంచేత యితరుల మాటలను అంగీకరించినప్పుడు – అదీ దౌర్జన్యమే. భగవంతుని పేర పశుసంపదను నరికి వేయడం ఒక్కటే దౌర్జన్యం కాదు. సంఘంకోసం, దేశంకోసం హింసకు తలబడడం మటుకే దౌర్జన్యం కాదు. దౌర్జన్యం యింతకంటే సూక్ష్మమయినది, లోతయినది; మనం దౌర్జన్యపు లోతులకు దిగి దీనిని అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నాం.

మిమ్మల్ని మీరు భారతీయుడనో క్రిస్టియన్ అనో యూరోపియన్ అనో యింకేదయినా పేరుతో పిలుచుకోవడం కూడా దౌర్జన్య రూపమే. ఎందుకనో మీకు అర్థం అవుతోందా? మిమ్మల్ని మీరు యితర మానవాళినుంచి వేరు చేసుకుంటున్నారు కనుక. ఏదో విశ్వాసం వల్ల, జాతీయత పేరున, సంప్రదాయం చొప్పున – – మీరు మిమ్మల్ని వేరు చేసున్నప్పుడు; అది దౌర్జన్య ప్రసారమే చేస్తుంది. అందుచేత దౌర్జన్యాన్ని అర్థం చేసుకునేందుకంటూ కూర్చున్న మనిషి యే దేశానికీ యే మతానికీ యే రాజకీయ ముఠాకు యే పాక్షిక సంస్థకు సంబంధించినవాడు కాడు. అతడు మానవాళిని సంపూర్ణంగా అవగాహన చేసుకుందుకు ప్రయత్నిస్తున్నాడు; ఆసక్తుడయి వున్నాడు.

దౌర్జన్యాన్ని గురించి రెండు రకాల ఆలోచన ధోరణులు వున్నాయి: దౌర్జన్యం మనిషిలో విడదీయరాని భాగం – అనేది ఒకటి. మనిషి నివసించే సాంఘిక సాంస్కృతిక వాతావరణ ఫలితమే దౌర్జన్యం – అనేది మరొకటి. మనం యీ రెండు ఆలోచన ధోరణులకు చెందము. అదంత ముఖ్య విషయం కాదు, కారణం కాదు, మనం దౌర్జన్యపూరితులం అని తెలుసుకోవడమే ముఖ్యం.

దౌర్జన్యం యొక్క సాధారణమయిన బహిఃరూపం కోపం. నా భార్య, లేక నా సోదరి పైని యేదో అత్యాచారం జరిగినప్పుడు నాకు 'నిజంగా కోపం' వచ్చిందంటాను. నా దేశం మీద అత్యాచారం జరిగినప్పుడు, నా అభిప్రాయాలు – సిద్ధాంతాలు – జీవన విధానం – యివి దెబ్బకు గురి అయినప్పుడు నాకు ధార్మికంగా కోపం వస్తుంది. నా అలవాట్లు, నా చిన్న చిన్న అభిప్రాయాలు ఎవరయినా తూలనాడితే నాకు కోపం వస్తుంది. మీరు నా కాళ్లు తొక్కినప్పుడు, నన్ను నిందించినప్పుడు నాకు కోపం వస్తుంది. మీరు నా భార్యను లేవదీసుకుపోతే అప్పుడు నాకు క్రోధం కలుగుతుంది. ఆ క్రోధం ధార్మికమయినదే అంటాను కూడా. ఎందుకంటే, నా భార్య నా ఆస్తి. అందుచేత యీ కోపం అంతా నైతికంగా సమర్ధనీయమే. దేశంకోసం హత్యలు చేయడం సమర్ధనీయమే. కోపాన్ని గురించి మాట్లాడుతున్నప్పుడు – కోపం కూడా దౌర్జన్యంలో భాగమే – మనం ధార్మికము, అధార్మికము అయిన కోపం వంక చూస్తూ వుంటామా లేక కోపం వంక యథాతథంగా చూస్తామా? అసలు ధార్మికమయిన కోపం అంటూ

యేమయినా వున్నదా? లేక కోపం అనేది మటుకే వుందా? మంచి ప్రభావం - చెడ్డ ప్రభావం అంటూ యేమీలేవు, ప్రభావం మటుకే వుంది. మీరు యేదో ప్రభావానికి లోనయి, ఆ ప్రభావం నాకు యిష్టం లేకపోయినట్లయితే దాన్ని చెడ్డ ప్రభావం అని పిలుస్తాను.

మీ కుటుంబం, మీ దేశం; జండా అని పిలుబడే రంగు గుడ్డ, ఒక నమ్మకం, ఒక అభిప్రాయం, ఒక అభిప్రాయం, ఒక విశ్వాసం, - మీరు కోరుకునే వస్తువు, మీరు అంటిపెట్టుకు వున్నది - - వీటన్నిటినీ రక్షించుకుంటూ వుండడంలోనే, కోపం తాలూకు చిహ్నాలు వున్నాయి. కోపం వంక మరే యితర వివరణలు సమర్థింపులు లేకుండా చూడగలరా? 'నా వస్తువులను నేను కాపాడుకుంటున్నాను', అనే అభిప్రాయం లేకుండా, 'నాకు కోపం రావడం మంచిదే అయింది' అని, 'నాకు కోపం రావడం ఎంత తెలివి తక్కువతనం' - అనే మాట లేకుండా కోపంవంక యధాతథంగా చూడగలరా? కేవలం ఓ వస్తువును చూచినట్లుగా దానిని నేరుగా గమనించగలరా?

మీరంటే నాకు యిష్టం లేకపోతేనూ, లేక మీరంటే గొప్ప అభిప్రాయం వుంటేనూ నేను మీవంక చూడగలనా? ఇలాంటి కవచాలు యేమీ లేకుండా వుంటేనే నేను మిమ్మల్ని సూటిగా చూడగలను. కోపంవంక కూడా యిలాగే చూడగలనా? అంటే యీ సమస్యకు తగివుంటాను; కాదనను; ఏ ప్రక్రియ లేకుండా దానిని గమనిస్తున్నాను.

అది నాలో ఒక భాగం గనుక, కోపంవంక నిష్పక్షపాతంగా చూడగలగడం కష్టం. కాని నేను ఆ పని చేయడానికే ప్రయత్నిస్తున్నాను. నేను దౌర్జన్య పూరితుడయిన మనిషిని. నల్లవాడినయినా తెల్లవాడినయినా నా స్వరూపం యిది. ఈ దౌర్జన్యం నాకు వారసత్వంగా వచ్చిందా లేక సంఘం యిచ్చిందా అన్నది నాకు ముఖ్యంకాదు. నా ఆసక్తి అంతా దీన్నించి నేను బయటపడడం ఎలా? దౌర్జన్యం నుంచి విడివడి - బయటపడడమే నా పూర్తి ప్రయత్నం. లైంగిక వ్యవహారం, భోజనం, అంతస్తు - వీటన్నిటి కంటే యిదే నాకు ఎక్కువ ముఖ్యం; దౌర్జన్యం నన్ను భ్రష్టు పట్టిస్తోంది. కనుక. నన్ను, ప్రపంచాన్ని గూడా నాశనం చేస్తోంది. అందుచేత దానిని అవగాహన చేసుకోవాలనుకుంటున్నాను. దాన్ని అధిగమించి ముందుకు పోవాలనుకుంటున్నాను. ప్రపంచంలోవున్న యీ కోపానికి, యీ దౌర్జన్యానికి పూర్తిగా నేనే బాధ్యుడిని. ఊరికే మాట మాత్రంగా అనడం కాదు, 'నేను కోపాన్ని, దౌర్జన్యాన్ని దాటి ఆవలకు వెళ్లిగలిగితేనే యేమయినా చేయగలను. ఈ జాతీయతను అధిగమిస్తేనే యేమయినా చేయగలను' అనుకుంటాను. నాలోని దౌర్జన్యాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలి అనే భావన నాకు ఎంతో జీవసత్వాన్ని, అన్వేషించాలనే కాంక్షను తీసుకువస్తుంది.

దౌర్జన్యాన్ని అధిగమించాలంటే, దాన్ని అణచి పెట్టడం మార్గంకాదు. దాన్ని కాదనడం దారికాదు. 'అది నాలో భాగం, అందుచేత యేమీ చేయనక్కర్లేదు', అనుకోను. దానివంక తీక్షణంగా చూడాలి. దానిని జాగ్రత్తగా పరిశీలించాలి. దానితో ఆత్మీయత సంపాదించాలి. దానిని త్రోసిరాజు అనడమో సమర్థించడమో చేసినప్పుడు - దానితో ఆత్మీయత పొందలేను. అయినా దానిని కూడదనడం,

సమర్థించడం చేస్తూనే వుంటాయి. అందుకనే చెబుతున్నాను: ప్రస్తుతానికి దానిని ఖండించడం, సమర్థించడం అనే పనులు చేయకండి – అని.

మీరు దౌర్జన్యాన్ని ఆపుచేయదలుచుకుంటే, యుద్ధాలను నిలిపి వేయాలనుకుంటే – ఆ ప్రయత్నాలకు ఎంత జీవసత్వాన్ని యివ్వగలరు? మీలో ఎంత ఎక్కువ భాగం యివ్వగలరు? మీ పిల్లలు యుద్ధాలకు వెళ్ళడం, అక్కడ చనిపోవడం జరుగుతోంది గదా? వీటిని ఆపడం అవసరం అని మీకు అనిపించడం లేదా? మీకు యిప్పటికీ దీనిపట్ల ఆసక్తి అనిపించకపోతే, మరింకేమిటి మీ అభిరుచులు? డబ్బు పోగుచేసుకోవడం – రక్షించుకోవడం: కాలం విలాసంగా గడిపివేయడం; మాదక ద్రవ్యాలు తీసుకోవడం; – యిదేనా? చూచారా, మీలోవున్న దౌర్జన్యం ఎలా మీ పిల్లలను నాశనం చేసి వేస్తోందో! కేవలం మాటలుగానే, దూరంగావున్న అభిప్రాయంగానే గమనిస్తున్నారా దీనినంతటినీ?

సరే, అలాగయితే. మీకు నిజంగా ఆసక్తి వుంటే – నిజంగా దీనిని పరిశీలించాలని హృదయ పూర్వకంగా అనుకుంటూ వుంటే, అలా కులాసాగా కుర్చీలలో కూర్చుండిపోయి 'దీన్ని గురించి యింకా చెప్పండి' అనరు. సమర్థన, ఖండనలతో కూడి దౌర్జన్యం వంక మనం చూడలేమనీ; దౌర్జన్యం మనకో మండుతున్న సమస్యలాగ అగుపించకపోతే – యీ రెండు విషయాల నుంచి దూరం కాలేరన్నదీ స్పష్టం. కనుక ముందుగా మీరు తెలుసుకోవలసింది – కోపం వంక ఎలా చూడాలి అనే విషయం. మీ భార్య, భర్త, పిల్లలవంక ఎలా చూడాలి; రాజకీయవేత్త చెప్పేమాటలు ఎలా వినాలి – ఎందుకు మనకు సూటితనం కొరవడింది – అని ఆలోచించాలి. కేవలం మీ సాంఘిక వ్యవస్థలో భాగంగానే మీరు ప్రతిదానినీ ఖండించడమో, సమర్థించడమో చేస్తున్నారని తెలుసుకుంటే – మీ జాతీయ ప్రాతిపదికమీద ఆధారపడి ప్రవర్తిస్తున్నారని యెరిగితే – అందువల్లనే యీ స్తబ్దత, నిబద్ధత యేర్పడుతున్నాయని తెలుస్తుంది. తెలుసుకోవటానికి, అన్వేషించటానికి – మూల విషయాల అవగాహనకు రావటానికి మీకు లోతుకు పోగల సామర్థ్యం వుండాలి. మొద్దుబారిన, పదునులేని పనిముట్టుతో మీరు ప్రగాఢమయిన లోతులకు పోలేరు. కనుక మనం చేస్తున్నదేమంటే – పనిముట్లను పదును పెట్టుకోవడం. మన పనిముట్టు మనసు; ఈ మనసును ఖండన, సమర్థనలతో మొద్దుబారేట్లు చేసుకుంటున్నాం. మనసు చురకయిన చాకులా సూదిలా పదునుగా వుంటే, వజ్రంలా బలంగా దానితో ఎంతలోతుకయినా పోవచ్చును.

కులాసాగా కూర్చుని 'అటువంటి మనసు ఎలా వస్తుంది?' అని ప్రశ్న వేసుకున్నందువల్ల ప్రయోజనం లేదు. తరువాతి భోజనం ఎక్కడ దొరుకుతుందో అన్నంత ఆసక్తిగా మీరు అటువంటి మనసును వాంఛించాలి. అసలు మనసు ఎందుకు మొద్దుబారిపోతోందో తెలుసుకోవాలి. మనసుకు యీ నిబద్ధత, బద్ధకం వదిలిపోతే – సమస్య అంతటినీ చక్కగా పూర్తి గమనంతో చూడగల స్థితికి వస్తుంది.

సరే, అసలు విషయానికి వద్దాం. మనలో దౌర్జన్యాన్ని తుడిచి పెట్టుకోవటానికి వీలున్నదా? 'మీరు యేమీ మారలేదు, ఎందుకని?' అని అడగడం ఒక రకమయిన దౌర్జన్యం. నేనాపని చేయడం లేదు. మిమ్మల్ని యే విషయంలో అయినా

అంగీకరించేట్లు చేయడం నాకు సమ్మతం కాదు. ఇది మీ జీవితం, నాది కాదు గదా! మీరు ఎలా జీవిస్తారు? అనేది పూర్తిగా మీకు సంబంధించిన విషయం. నేను అడుగుతున్న ప్రశ్న అల్లా - యే సంఘం లోనయినా మానసికస్థాయిలో నివసిస్తూ మనిషి తన అంతరంగం నుంచి దౌర్జన్యాన్ని పరిపూర్ణంగా తుడిచివేయడం సాధ్యమవుతుందా - అని. సాధ్యం అవుతుంది అంటే - ఈ ప్రపంచంలో యింకొక రకంగా జీవించటానికి తగిన ప్రక్రియ ఉత్పన్నం అవుతుంది.

మనలో చాలమందిమి దౌర్జన్యాన్ని జీవితంలో ఒక భాగంగా అంగీకరించాము. రెండు మహా ప్రపంచ యుద్ధాలు గడిచాయి. కాని యివి మనకు మన మధ్య - మనుషుల మధ్య, మీకు నాకు మధ్య - బలమయిన హద్దులు నిర్మించుకోవడం తప్ప యింకేమీ నేర్పలేదు. దౌర్జన్యాన్ని సమూలంగా తుడిచివేసుకోవాలనుకుంటున్న మనకు అది ఎలా సాధ్యమో తెలియాలి. వివరణలద్వారా - మనమో లేక యింకా విజ్ఞులయిన పండితులో చేసే వ్యాఖ్యానాల ద్వారా అది సాధ్యం అనిపించదు. మనను మనం కొంతలోకొంత మార్చుకుందుకు ప్రయత్నించాలి. కాస్తంత ప్రశాంతంగా, మరికాస్త అప్యాయతతో బతకడం నేర్చుకోవాలి. అంతమాత్రంచేత పూర్తి అవగాహన యేర్పడుతుందనికాదు, దర్శనం కలుగుతుందని కాదు. పరిశీలన, వివరణ చేయడం ఎలానో నాకు తెలియాలి. ఈ వివరణ క్రమంలోనే నా మనసు మరింత పదునుగా చురుకుగా తయారవుతుంది. ఆ పదునుతనంలో - జాగరూకత, గాంభీర్యం వచ్చి పూర్తి దర్శనం దొరుకుతుంది. అంతటినీ ఒక్క క్షణంలోనే చూడగల సామర్థ్యం వున్న కళ్లు మనకు లేవు. వివరాలన్నిటినీ చక్కగా చూడగలిగి తదుపరి దుముక గలిగితే - అప్పుడు చూడడంలో మరింత స్పష్టత యేర్పడుతుంది.

దౌర్జన్యాన్ని తొలగద్రోసుకుందుకుగాను, మనలో చాలమందిమి, ఒక సిద్ధాంతాన్ని, ఆదర్శాన్ని - అహింస అనే దానిని వాడుతున్నాం. దౌర్జన్యానికి వ్యతిరేక లక్షణమయిన ఆదర్శం వున్నప్పుడు - ఆ దౌర్జన్యం సమసి పోతుందనుకుంటున్నాం. కాని అది జరగడం లేదు. మనకు అసంఖ్యాక ఆదర్శాలు వున్నాయి, మన పవిత్ర గ్రంథాలన్నీ వాటితో నిండివున్నాయి, అయినా మనం యింకా దౌర్జన్యపూరితులం అయ్యే వున్నాం. అందుచేత నేరుగా దౌర్జన్యంతోనే వ్యవహరించి - ఆ మాటను మరిచి పోయేందుకు యెందుకు తలపడగూడదు?

యదార్థాన్ని అర్థం చేసుకోవాలంటే, మనం పూర్తి గమనాన్ని యివ్వవలసి వుంటుంది. దానికి మీ శక్తి అంతటినీ ధారపోయవలసి వుంటుంది. ఊహా మాత్రమయిన, ఆదర్శాలతో నిండిన ప్రపంచాన్ని రూపుకట్టుకున్నప్పుడు ఆ గమనము, శక్తి. అంతరించిపోతాయి. కనుక మీరు పూర్తిగా ఆదర్శాన్ని త్రోసిరాజు అనగలరా? నిజంగా తీవ్రమయిన ఆసక్తి వున్న మనిషి, సత్యం యేమిటో తెలుసుకోవాలన్న తపన వున్న మనిషి, ప్రేమ యేమిటో అవగతం చేసుకోవాలన్నుకున్నవాడు - అభిప్రాయాలు, సిద్ధాంతాల జోలికి పోడు. ఉన్నదానిలోనే జీవిస్తాడు.

మీ కోపం యొక్క యదార్థతను పరిశీలించి తెలుసుకోవటానికి, దానిమీద తీర్మానాలు చేయగూడదు. దానికి వ్యతిరేకంగా ఒక అభిప్రాయం పొడసూపిందంటే తత్క్షణమే యథార్థత లోపిస్తుంది. మీకు ఎవరేనా అంటే అయిష్టమని అసహ్యమనీ

అంటే – ఆ మాట కటువుగా వున్నా – దాని యథార్థం అంతేగదా! దానివంక చూచి – దానిలోనికి వెడితే, అది కరిగి మాయమైపోతుంది. అలా కాకుండా 'నేను ఎవరినీ అసహ్యించుకోగూడదు, నా హృదయం నిండా ప్రేమ నిండి వుండాలి' అనుకుంటే – అప్పుడు మీరు ఒక కృతక ప్రపంచంలో నివసిస్తున్నారన్నమాట, మీలో ద్వంద్వప్రవృత్తి వున్నది. పరిపూర్ణంగా బతకటానికి – ఉన్నదానితో పూర్తిగా సమాధానపడి బతకటానికి – యే సమర్థన – ఖండన లేకుండా; యథార్థాన్ని గమనించగలగడానికి మీరు చివరికంటా ప్రయత్నిస్తారు. అప్పుడు సమస్య పరిష్కారం అయిపోతుంది.

మీరు దౌర్జన్య ముఖాన్ని – యథాతథంగా చూడగలుగుతున్నారా? బయటకు కనిపించే రూపమే కాక మీ అంతరంగంవంక చూచుకోగలుగుతున్నారా? అంటే, మీరు దౌర్జన్యం నుండి పూర్తిగా బయటపడినారన్నమాట!

ఎందుకంటే, యీ పరిశ్రమలో యేవో ఆదర్శవాదాలను ప్రవేశపెట్టటం లేదు. దీనికి ప్రగాఢమయిన ధ్యానం అవసరం. మాటలలో అంగీకారం, అనంగీకారం మట్టుకే చాలవు.

ఎన్నో విషయ పరంపరలు చదివారు. ఇవన్నీ మీకు అవగాహన అయినాయా? మీ నిబద్ధ మనసు, మీ జీవన విధానం, మీరు నివసించే సంఘ వ్యవస్థ, – – యివన్నీ మిమ్ము యదార్థాన్ని చూడనీయకుండా చేస్తున్నాయి. మిమ్మల్ని దీనిలోనుంచి తక్షణమే బయటపడనీకుండా చేస్తున్నాయి. మీరు అంటున్నారు: 'నేనిదంతా ఆలోచిస్తాను: దౌర్జన్యం నుండి బయటపడడం సాధ్యమా కాదా అని యోచిస్తాను. స్వేచ్ఛ పొందటానికి ప్రయత్నిస్తాను.' మీరు చేయగల భయావహమయిన ప్రకటన: 'ప్రయత్నిస్తాను' అనేది. ప్రయత్నించడం అంటూ లేదు, నా శక్తివంచన లేకుండా పని చేయడం అంటూ లేదు. పని – చేయడం, చేయకపోవడం – అంతే వున్నది. ఇల్లు తగులబడిపోతుంది; మీరు సమయ విరామం కోసం వెదుకుతున్నారు. ప్రపంచ వ్యాప్తకంగా వున్న దౌర్జన్యం వల్ల యిల్లు తగులబడిపోతుంది. కాని మీలో మీరు 'దీన్ని గురించి ఆలోచిస్తాను. అగ్నిని ఆర్పడానికి యే ఆదర్శవాదం ఫలదాయకం?' అని సమాలోచించుకుంటున్నారు. ఇల్లు కాలిపోతున్నప్పుడు – దానిని ఆర్పటానికి నీళ్లు తీసుకువస్తున్న మనిషి జుట్టు ఏ రంగులో వున్నది – అని వాదనలు చేసుకుంటూ కూర్చుంటారా?

★ ★ ★

# 7

## పరస్పర సంబంధాలు - సంఘర్షణ - సంఘం - బీదరికం - మందులు - పరాశ్రయం - పోల్చి చూచుకోవడం - ఆదర్శాలు - దాంభికత.

మనం యిప్పుడు ప్రస్తావిస్తూవున్న 'దౌర్జన్యం అంతరించిపోవడం' అనే దాని అర్థం మనసు తనతో తాను ప్రశాంతంగా వున్నదనీ, తన సంబంధ బాంధవ్యాలు అన్నిటిలోనూ యీ ప్రశాంతత ప్రసరిస్తున్నదనీ కాదు.

రూపు కట్టుకోవడం, తనను తాను సంరక్షించుకునే ప్రయత్నం మీదనే మానవ సంబంధాలన్నీ ఆధారపడి వున్నాయి. మన పరస్పర సంబంధాలలో, యితరులను గురించి ఒక రూపు కట్టుకుంటాం. ఆ పని యిద్దరమూ చేస్తాము, ఈ రెండు రూపులూ పరస్పర సంబంధాలను పొంది వుంటాయి. అంతేగాని అసలయిన మనుషుల మధ్య యీ సంబంధం నెలకొనడం అనేదే జరగదు. భార్యకు భర్తను గురించి ఒక రూపం, – అలా కల్పన చేసుకుంటున్నానని ఆమెకు తెలియకపోవచ్చును; అయినా యిదంతా జరుగుతోంది – అలాగే భర్తకు భార్యను గురించి ఒక రూపకల్పన. అలాగే తన దేశాన్ని గురించి ప్రతి మనిషికీ ఒక రూపకల్పన. ఈ రూపాలను మన ఆలోచనలు, భావనలవల్ల మరింత పటిష్టం చేస్తూ వుంటాము ఎప్పుడూ. ఇటువంటి కల్పిత రూపాలకే సంబంధాలు యేర్పడుతున్నాయి. అసలు మనుషుల మధ్య సంబంధం అనేది, యిలాంటి రూపకల్పన యేర్పడటంవల్ల అంతరించిపోతోంది.

రూపకల్పనల మధ్య యేర్పడిన సంబంధాలు ఎన్నటికీ శాంతిని తీసుకురాలేవు. ఎందుకంటే, రూపాలు కేవలం కల్పితాలే. మనం అరూపస్థితిలో బతకలేం. అయినా, మన మందరం చేస్తున్న పని మటుకు యిదే: ఆలోచనలలో బతకడం, సిద్ధాంతాలలో మనుగడ సాగించడం, చిహ్నాలలో – రూపాలలో – మనను గురించి యితరులను గురించి యేర్పరచుకున్న మూర్తులలో నడయాడడం, అసలు రూపానికి యేమాత్రం దగ్గర కాకపోవడం. మన సంబంధాలన్నీ – ఆస్తులు, ఆలోచనలు జనం – యిలా యే బాపతుకు చెందినది అయినా ఈ రూపకల్పన మీదనే ఆధారపడి వుంటున్నాయి. అందుకనే అవి ఎప్పుడూ సంఘర్షణకు ఆలవాలం అవుతున్నాయి.

అటువంటప్పుడు, మనతో మనం – మన చుట్టూ వున్న యితరులతోను శాంతంగా సమస్థాయిలో వుండడం ఎలా? జీవితం అంటే సంబంధ బాంధవ్యాలతో ముందుకు అడుగులు వేయడం. లేకపోతే జీవితం అంటూ యేమీ లేదు. ఆ జీవితం అరూప వస్తువులపైని ఆధారపడి వుండేట్లయితే కేవలం అభిప్రాయాలు, ఊహాకల్పనల

మీద పొదిగినదే అయితే, అటువంటి జీవితం – యుద్ధక్షేత్రం వంటి వాతావరణాన్ని మటుకే తీసుకు రాగలుగుతుంది. కనుక, ఎలాంటి పత్తుడులు, అనుకరణలు, త్రోసిరాజులు, మార్పుకోవడాలు లేకుండా మనిషి ఒక సక్రమ జీవనాన్ని ఆంతరికంగా పరిపూర్ణంగా గడపటానికి అవకాశం వున్నదా? తనలో తాను యిటువంటి మార్పును తీసుకురాగలడా? అంతరంగ ప్రశాంతత – ఏ సమయంలోనూ యెలాంటి కలత, గందరగోళము లేనిది – అవలంబించగలడా? ఏదో పురాణ కథలలో మాదిరి కాకుండా, యింటిలోను ఆఫీసులోను ప్రతి దినము గడిపే జీవితంలో యిటువంటి ప్రశాంతత తీసుకు రాగల అవకాశం వున్నదా?

ఈ ప్రశ్నను మనం ఎంతో జాగ్రత్తగా పరిశీలించాలని నా అభిప్రాయం. ఎందుకంటే, మన ప్రజ్ఞాక్షేత్రంలో సంఘర్షణ గుర్తు పడనటువంటి జాగా 'చుక్క' మాత్రంగానయినా లేదు. మన సంబంధ బాంధవ్యాలు అన్నింటిలో – ఆత్మీయుడయిన మనిషితోగాని, పొరుగువానితోగాని, సంఘంతో అయినా – ఈ సంఘర్షణ వున్నది. సంఘర్షణ అంటే వైరుధ్యం, విభాగం, వేర్పాటు, ద్వంద్వప్రకృతి. మనను మనం పరిశీలించుకుంటూ సంఘంపట్ల మన సంబంధాలను గమనించుకుంటూ వుంటే – ప్రతి అంతస్తులోను, అన్ని స్థాయిలలోను ఈ సంఘర్షణ వున్న విషయం స్పష్టమవుతుంది. పెద్దదో చిన్నదో యీ సంఘర్షణ తప్పదు. దీనికి మనం ప్రతిస్పందన పొందక తప్పదు, దారుణ ఫలితాలూ తప్పవు.

తన దైనందిన జీవనంలో ఒక అంతర్భాగంగా సంఘర్షణను మానవుడు అంగీకరించాడు. ఎందుకంటే, అతడు పోటీ మనోభావాన్ని, అసూయను, దురాశను, ఆక్రమణ శీలతను, ప్రవృత్తినీ – జీవితంలో సహజమయిన విషయాలుగా ఆమోదిస్తున్నాడు. అటువంటి జీవన విధానాన్ని అంగీకరిస్తున్నాం అంటే – సంఘాన్ని ఉన్నది ఉన్నట్టుగా ఆమోదిస్తున్నామన్నమాట; మర్యాద ముసుగులలో దోబూచులాడుతున్నామన్నమాట. మనలో చాలమందిమి మర్యాదస్తులుగా వ్యవహరించాలని తపన పడుతున్నాం గనుక, మనం చేసే పని యిదే. మన మనుష్యులను, హృదయాలను వెదికి చూచుకున్నప్పుడు, మన ఆలోచన సరణిని పరిశీలించినప్పుడు, దైనందిన జీవనంలో మన వర్తనం సమీక్షించుకున్నప్పుడు మనకు ఒక విషయం స్పష్టంగా తెలిసి వస్తుంది: సంఘం అనే చట్రానికి ఒదిగిపోయి వున్నంతవరకూ జీవితం రణక్షేత్రంగా రూపొందవలసిందే – అని. దానికి ఒదిగి వుండకుండా, ఆమోదించకుండా వైదొలగినప్పుడు – యే మతానుయాయీ అటువంటి సంఘాన్ని ఆమోదించలేదు – మనం పూర్తిగా స్వేచ్ఛా జీవులం అవుతాము; సంఘం యొక్క మానసిక చట్రంనుంచి బయటపడుతాము.

సంఘంలోని అనేక వస్తువులతో మనం నిండిపోయి వున్నాం. సంఘం మనలో సృష్టించినదీ, మనం మనలో సృష్టించుకున్నదీ యేమిటంటే: దురాశ, అసూయ, కోపము, అసహ్యం, ఈర్ష్య, ఆదుర్దా – వీటి అన్నిటితోనూ మనం మనల్ని నింపుకున్నాం. ప్రపంచంలోని అనేక మతాలు 'బీదరికం' అనేదానిని బోధించినాయి. సన్యాసి యేదో రంగువస్త్రం ధరిస్తాడు. పేరు మార్చుకుంటాడు, తలగొరిగించుకుంటాడు, ఓ

గుహలో ప్రవేశిస్తాడు, బీదరికం – పవిత్రతలకు సంబంధించిన వాగ్దానాలు చేస్తాడు. తూర్పుదేశాలలో అయితే అతను ఒకే బట్ట, ఒకే అంగవస్త్రం, ఒంటిపూట భోజనంతో వుంటాడు. మనం అటువంటి బీదరికాన్ని ఆదరిస్తాం. కాని, యీ బీదరికాన్ని ఆశ్రయించిన మనుష్యులు తమ అంతరంగంలో యింకా సంఘం తాలూకు వస్తువులపట్ల మక్కువతోనే వున్నారు; పరువు ప్రతిష్టలకోసం పాకులాడుతూనే వున్నారు. ఈ సంస్థకో ఆ సంస్థకో చెంది వున్నారు. ఈ మతాన్నో ఆ మతాన్నో సమాశ్రయించుకు వున్నారు. సంస్కృతి సంప్రదాయాలలో యింకా శాఖోపశాఖలుగా చీలిపోయే వున్నారు. ఇది బీదరికం కాదు. బీదరికం అంటే – ప్రపంచంనుంచి, సంఘంనుంచి పూర్తిగా స్వేచ్ఛగా వుండడం; మరిన్ని ఉడుపులు వున్నా, మరింత భోజన వసతి వున్నా – మరేం ప్రమాదం లేదు. దురదృష్టవశాత్తు ఎక్కువమంది మనుష్యులలో తమ ఐశ్వర్యాన్ని ప్రదర్శించాలనే తహతహ విపరీతంగా వున్నది.

మనసు సంఘ వ్యవస్థనుంచి స్వేచ్ఛ పొందినప్పుడు, బీదరికం అతి సుందరమయి రూపొందుతుంది. ఆంతరికంగా రావాలి యీ బీదరికం. అప్పుడు వెంపర్లాట, అడగడం, కామనలు – యిటువంటివి యేమీ వుండవు. ఇలాంటి ఆంతరిక బీదతనమే ఎలాంటి సంఘర్షణ లేని జీవిత సత్యాన్ని ఆకళింపు చేసుకోగలుగుతుంది. అటువంటి జీవితం – ఏ గుడులలోను, గోపురాలలోను దొరకనటువంటి ఆశీర్వాదం.

సంఘర్షణ యొక్క మూలస్థానం నుంచి, సంఘం యొక్క మానసిక వ్యవస్థ నుంచి బయటపడడం ఎలా సాధ్యం? సంఘర్షణ తాలూకు కొన్ని శాఖలను కొట్టివేసి, చిగుళ్లు కత్తిరించివేయడం అంతకష్టమైన పని కాదు. కాని, మనం ఆలోచిస్తున్నది పూర్తిగా అంతరంగ, బహిరంగ ప్రశాంతత తీసుకు రాగల స్థాయి ఎలా లభిస్తుందని. చిగురిస్తామనిగానీ, ముగిగిపోతామనిగానీ కాదు; అందుకు వ్యతిరేకంగా – మనం బహుముఖంగా, జీవనసత్త్వంతో కూడి పరిపూర్ణ శక్తివంతులం అవుతాము.

ఏదయినా సమస్యను అర్థం చేసుకోవాలన్నా, పరిష్కరించుకు అవతలపడాలన్నా మనకు యెంతో శక్తి అవసరం. కేవలం స్థూలము, మానసికము అయిన శక్తి చాలదు. ఏ ఉద్దేశ్యాలు, మానసిక ఉద్రేకాలు, మందుమాకులమీద ఆధారపడని శక్తి కావాలి. ఇలా మనం దేనిపైనైనా ఆధారపడ్డాము అంటే – అదే మన మనసును మొద్దుబారేట్లు చేస్తుంది; లాలిత్యం కోల్పోయేట్లు చేస్తుంది. ఏదయినా మందు, మాకు తీసుకున్నందువల్ల తాత్కాలికంగా కొంత ఉత్తేజం, శక్తి సమకూడినట్లు అనిపిస్తుంది తప్ప – తరువాత మటుకు మళ్లీ యథాస్థితికి దిగజారి పోతాము. అందుచేత యీ మందు మాకుల పైని పదే పదే ఆధారపడడం కూడా జరుగుతుంది. దేవాలయంద్వారా, సారాయంద్వారా, మందుమాకుల ద్వారా, పుస్తకాల ద్వారా, ఉపన్యాసాల ద్వారా మనకు కలిగే ఉత్తేజం అంతా పరాధీనతనే తీసుకువస్తుంది. పరాధీనతవల్ల దేనినీ స్పష్టంగా చూడగల చాకచక్యం కోల్పోతాము. అందువల్ల సరైన జీవనసత్త్వం లేకుండా పోతుంది.

దురదృష్టవశాత్తు, మనమంతా మానసికంగా దేనిమీదనో ఒకదానిపై ఆధారడి వున్నాము. మనం ఎందుకు యిలా ఆధారపడివున్నాం? ఆధారపడి వుండాలనే తపన ఎందుకు కలుగుతోంది? మనమంతా యిప్పుడు కలిసి ప్రయాణం చేస్తున్నాం,

సహా పథికులం. మీరు నాకోసం వేచివుండడం లేదు – మీ పరాధీనత గురించి నేనేదో చెబుతానని. మనమందరము కలిసి పరిశీలించినట్లయితే యేదో తెలుసుకో గలుగుతాము. ఆ తెలుసుకున్నది మీదే అవుతుంది. మీదే గనుక, అది ఎంతో శక్తిని జీవసత్వాన్ని తీసుకునివస్తుంది.

నేను దేనిపైననో ఆధారపడి వున్నానని గమనించాననుకోండి. ఉదాహరణకు – నా శ్రోతలపైని వారు నాకు ప్రోత్సాహం, ఉత్సుకత కలిగిస్తారు. ఆ శ్రోతలనుంచి ఎక్కువమందిని ఉద్దేశించి మాట్లాడటం ద్వారా, నాకోరకం సత్త్వం యేర్పడుతుంది, శక్తి వస్తుంది. అందుచేత నేను నా శ్రోతలపై ఆధారపడతాను; నన్ను విని – అంగీకరించో అంగీకరించకుండానో – నా చుట్టూ చేరే వారిపైని. వాళ్ళు అనంగీకారం తెలిపిన కొద్దీ నా శక్తిసంపద పెరుగుతుంది. వాళ్ళు అంగీకరించినట్లయితే అది మామూలు విషయం అయిపోతుంది. కనుక – నేను తెలుసుకునే సంగతి యేమిటంటే, నాకు శ్రోతలు కావాలి; వాళ్ళతో సంభాషించడం ద్వారా నాకు కొత్త శక్తి యేర్పడుతోంది. ఎందుకని? ఎందుకు నేను యితరులపై ఆధారపడుతున్నాను? నా అంతట నేను డొల్లను, శూన్యుడను, నిరర్థకుడను. నాలో పరిపూర్ణము, సంపన్నము, సత్త్వయుతము, కదిలించేది, సజీవమయినది యేమీలేదు. అందుకని నేను ఆధారపడి వుంటున్నాను. కారణం వెదికి తెలుసుకున్నానన్నమాట.

అయితే, యింతమాత్రం వెదికి తెలుసుకున్నందువల్ల నాకు యీ దుస్థితినుంచి స్వేచ్ఛ వచ్చేసినట్లేనా? కారణం తెలుసుకోవడం మానసిక పరిశ్రమ. అంతమాత్రం చేత అది మనసును ఆధారపడడం నుంచి విముక్తం చేయలేదు. ఒక అభిప్రాయాన్ని మాటవరుసగా అంగీకరించినంత మాత్రాన, ఒక ఆదర్శవాదం మనకు అవసర ఉత్తేజాన్ని కలిగిస్తున్నదని తెలుసుకున్నంత మాత్రాన – మనసు మొద్దుబారిన స్థితి నుంచి బయటపడదు; తనకు ఉత్తేజం కలిగిస్తున్న వస్తువునుంచి విడివడదు. మనసుకు యీ అధీనతను తప్పించేది యేమంటే – ఉత్తేజం యొక్క పూర్తి స్వరూపాన్ని చూడడము, అధీనం యొక్క పూర్వాపరాలన్నీ తెలుసుకోవడము; యిది మనసును యెలా మొద్దుబారేట్లు చేస్తోందో గ్రహించడమూను. మొద్దుబారటం, స్తబ్ధమవడం, పనిపట్ల నిరాసక్తం అవడం – యివన్నీ పూర్తిగా చూడగలిగితే తప్ప మనసు వీటిబారినుంచి బయటపడలేదు.

అందుచేత పూర్తిగా – సంపూర్ణంగా – చూడడం అంటే యేమిటి అనేది ముందు నేను తెలుసుకోవాలి. జీవితాన్ని ఒక ప్రత్యేక కోణం నుంచి చూచినప్పుడు నాకు యిష్టమయిన ఒక అనుభవం దృష్ట్యా గమనించినప్పుడు, ప్రత్యేకంగా నేను సేకరించిన కొన్ని విషయాల పరికించినప్పుడు – యిదే నా భూమిక, యిదే నేను – నేను పూర్తిగా చూడలేను. మాటలుగా, అభిప్రాయంగా, వివరణలద్వారా, మానసికంగా గ్రహించాను: అంతే. నేను ఎందుకు పరాధీనతలో చిక్కుకున్నానో గ్రహించాను. అయితే, భావన అన్వేషించి తెలుసుకున్నదంతా పాక్షికమే. అందుచేత భావన జోక్యం కలుగచేసుకోకుండా వున్నప్పుడే నేను పూర్తిగా – పరిపూర్ణంగా – చూడగలుగుతాను.

అప్పుడు నా పరాధీనత నాకు తెలిసివస్తుంది; యదార్థం యేమిటో చూస్తాను. ఇష్టము, అయిష్టము జోడించకుండా ఉన్నదానిని ఉన్నట్లుగా చూస్తాను. ఆ పరాధీనతనుంచి వైదొలగాలనిగానీ, ఆ కారణాలనుంచి బయట పడాలనిగానీ ఆలోచన లేదు. ఊరికే గమనిస్తున్నాను. ఈ రకమయిన గమనం, పరిశీలన వున్నప్పుడు నాకు పూర్తి చిత్రం అగుపిస్తుంది; పాక్షికమయిన రూపం కాదు. మనసు పూర్తి చిత్రాన్ని చూచినప్పుడు – అప్పుడే అక్కడే స్వేచ్ఛ ఉన్నది. పాక్షికత – ముక్కలు ముక్కలు అవడం వున్నప్పుడు శక్తి దుర్వినియోగం అవుతోన్నదని తెలుసుకున్నాను. ఈ శక్తి దుర్వినియోగం అవడానికి వున్న మూలకారణం తెలుసుకున్నాను.

అనుకరణ చేసినట్లయితే అప్పుడు శక్తి దుర్వినియోగం అవదని మీరు అనుకోవచ్చును. అధికారాన్ని అధిపత్యాన్ని అంగీకరిస్తే, యే పురోహితుడినో ఆశ్రయిస్తే, క్రతువునో, సిద్ధాంతాన్నో, పక్షాన్నో, యేదో ఆదర్శాన్నో నమ్ముకుంటే అంతా సరిపోతుందనుకోవచ్చును. కాని, యేదో ఆదర్శాన్ని అనుసరించడం, – అది మంచిదయినా, చెడ్డదయినా – పవిత్రమయినా – అపవిత్రమయినా కేవలం పాక్షిక చర్యే కనుక అది సంఘర్షణ తీసుకువస్తుంది. ఉండవలసినది, ఉన్నది – అన్న విభాగాలు రూపుకట్టుకోవడంలో సంఘర్షణ చోటు చేసుకుంటుంది. సంఘర్షణ అన్నది శక్తిని దుర్వినియోగం చేస్తుంది.

'సంఘర్షణ నుంచి నేను స్వేచ్ఛ పొందడం ఎలా?' అని ప్రశ్న వేసుకుంటే అప్పుడు మరో సమస్యను సృష్టించుకున్నవారు అవుతారు. సంఘర్షణ మరింత జటిలం అయిపోతుంది. అలా కాకుండా, విషయాన్ని ఉన్నది ఉన్నట్లుగా చూడగలిగితే – యేదో రాయిని రప్పను చూచినట్లుగా చూడగలిగితే – స్పష్టంగా, ప్రత్యక్షంగా – అప్పుడు మీకు జీవిత సత్యం అవగాహన అవుతుంది. దానిలో యెలాంటి సంఘర్షణలు వుండవు.

దీనినే మరో రకంగా చెప్పుకుందాం. మనం ఎప్పుడూ మనం ఉన్న స్థితినీ, ఉండవలసిన స్థితినీ పోల్చి చూచుకుంటున్నాం. ఉండవలసిన స్థితి అనేది మన మనసు రూపకల్పన చేసినదే. సరిపోల్చి చూచుకోవడం వున్నప్పుడు వైరుధ్యం వస్తుంది. ఏదో పరాయివస్తువుతో కాదు; నిన్నటి మీతో. కనుక ఉండినది, ఉన్నదీ యెప్పుడూ సంఘర్షణ తీసుకువస్తాయి. పోల్చి చూచుకోవడం అనేది లేనప్పుడు ఉన్నది ఒక్కటే వుంటుంది. ఉన్నదానితో జీవించడమే ప్రశాంతంగా వుండడం. అప్పుడు మీరు మీ అంతరంగ స్థితికి గూడా పరిపూర్ణగమనం యివ్వగలరు. అది నిరాశ అయినా, వికారమయినా, క్రౌర్యం అయినా, భయం అయినా, ఆదుర్దా అయినా, ఒంటరి తనం అయినా – దానితోనే పూర్తిగా సహజీవనం చేస్తారు. అప్పుడు వైరుధ్యం లేదు. కనుక సంఘర్షణ కూడా లేదు.

కాని, ఎంతసేపు మనం యితరులతో మనను పోల్చి చూచుకుంటున్నాం. మనకంటే శ్రీమంతులు, తెలివి అయినవారు, మరింత అనురాగపరులు, ప్రసిద్ధులు, యిలా ఎన్నో రకాలుగా మిన్న అయిన వారితో. 'మిన్న' అవడం మనల్ని నడుపుతుంది, మన జీవితాలలో. ఏదో వస్తువుతోనో, మనుష్యులతోనూ పోల్చి చూచుకోవడం అనేది మనకు సంఘర్షణను సంప్రాప్తం చేస్తున్న ప్రథమ కారణం.

అసలు పోల్చి చూచుకోవడం అనేది ఎందుకు జరుగుతోంది? మరొకళ్ళతో మిమ్మల్ని ఎందుకు పోల్చుకుంటారు? ఈ పని చిన్నతనంనుంచి నేర్చుకుంటున్నారు మీరు. ప్రతి పాఠశాలలోను యిద్దరు పిల్లలకు పోలిక. రెండోవానిలాగ వుండటానికి మొదటివాడు తన స్వరూపాన్ని నాశనం చేసుకుంటాడు. అసలు సరిపోల్చి చూచుకోవడం అనేది లేనప్పుడు, ఆదర్శం అంటూ లేనప్పుడు, అవతలి పక్షం అనేది లేనప్పుడు, ద్వంద్వప్రవృత్తి లేనప్పుడు, మీకంటె విభిన్నమయిన వారుగా మీరు కనిపించాలని ప్రయత్నం చేయనప్పుడు – మీ మనసు యేమవుతుంది? మీ మనసు మరో వస్తువును నిర్మించడం, ఎదురుగా పెట్టడం మానివేసింది. అప్పుడది చాల తెలివిగా, పదునుగా, లలితంగా, అమితశక్తివంతంగా తయారవుతుంది. జీవసత్త్వమే శక్తివంతమయిన లక్షణం. ఈ సత్త్వం లేకుండా మీరు యే పని చేయలేరు.

మీరు యితరులతో పోల్చి చూచుకోవడం అన్నపని లేనప్పుడు, మీరు మీరుగా వుండిపోతారు. పోలికలవల్ల, మీరు పరిణమించాలనుకుంటున్నారు: ఎదగాలనుకుంటున్నారు, మరింత తెలివి కలవారు, సుందరులు అవాలనుకుంటున్నారు. కాని నిజంగా అలా కాగలరా? యదార్థం యేమిటంటే – మీరు వున్న స్థితి. పోల్చి చూచుకోవడం వల్ల మీరు ముక్కలు ముక్కలుగా నరుక్కుంటున్నారు. అది శక్తిని దుర్వినియోగం చేసుకోవడం. ఎటువంటి పోలికలు లేకుండా, మీ నిజస్థితిని మీరు చూచుకున్నందువల్ల మీకు ఎంతో శక్తి సంపద ఒనగూడుతుంది. పోలికలు లేకుండా మీవంక మీరు చూచుకున్నప్పుడు – మనసు తృప్తితో స్తబ్ధమయిపోయిందని కాదు అర్థం – మీరు పోలికలకు అతీతులు అయిపోతారు. జీవితాన్ని పరిపూర్ణంగా అర్థం చేసుకోవడానికి అవసరమయిన శక్తి – జీవసత్త్వం – ఎలా వృధా అయిపోతోందో మనకు తెలిసివస్తోంది.

నేను ఎవరితో సంఘర్షణ పడుతున్నాను? అన్న విషయం తెలుసుకోవాలని లేదు నాకు. పైపైన వున్న సంఘర్షణలను తెలుసుకోవడం కాదు ముఖ్యం. అసలు సంఘర్షణ అనేది ఎందుకు ఉన్నది – అన్న సంగతి నాకు అర్థంకావాలి. ఈ ప్రశ్న నాకు నేను వేసుకున్నప్పుడు, పరిసరాలలో వచ్చే సంఘర్షణలు, సమాధానాలకు అతీతమైన ఒక ప్రాథమిక వ్యవహారం నా గమనానికి వస్తుంది. నాకు ఈ ప్రాథమిక – కేంద్ర – విషయం ముఖ్యం. అప్పుడు నేను చూస్తాను. మీరు కూడా చూస్తారనుకుంటాను, కోరిక స్వరూప స్వభావాలు – సరీగా అర్థం కాకపోయినట్లయితే, సంఘర్షణకు దారి తీస్తాయని.

కోరిక ఎప్పుడూ వైరుధ్యంలోనే వుంటుంది. నాకు విరుద్ధ విషయాలు, వస్తువులు కావాలి. అంటే, నేను కోరికను నాశనం చేసుకుంటున్నానని కాదు. అణగదొక్కుకుంటున్నానని కాదు; నిగ్రహించుకోవడమో, రూపాంతరం పొందించడమో చేస్తున్నానని కాదు. కోరిక అనే విరుద్ధ విషయం గమనిస్తున్నాను. కోరుకుంటున్న వస్తువులు, విషయాలు కాదు – అసలు కోరికే విరుద్ధము. సంఘర్షణను అర్థం చేసుకోవటానికి ముందు, కోరిక యొక్క స్వభావం అర్థం చేసుకోవాలి. మనం యేదో ఒక విరుద్ధ స్థితిలో చిక్కుకుపోయి వున్నాం. ఈ స్థితి కోరికవల్ల

సంక్రమిస్తుంది. కోరిక సుఖాపేక్షవల్ల యేర్పడుతోంది; బాధను పక్కకు నెట్టే ప్రయత్నంలో కలుగుతోంది. ఇదంతా మనం లోగడనే పరిశీలించాం.

అన్ని వైరుధ్యాలకు మూలం కోరిక; ఏదో కావాలనుకోవడం, మరేదో అక్కర లేదనుకోవడం – యిది మొద్దుబారినతనం. సుఖాన్ని కలిగించే పని యేదయినా చేసినప్పుడు శ్రమ అనిపించదు; కదూ? కాని, సుఖం దుఃఖాన్ని తీసుకు వస్తుంది. దుఃఖాన్ని తొలగించుకుందుకు కొంత పోరాటం జరుగుతుంది. అదంతా శక్తి దుర్వినియోగమే. మనలో ద్వంద్వ ప్రవృత్తి ఎందుకు వున్నది అసలు? ప్రకృతిలో ద్వంద్వత వున్నది నిజమే. మగ – ఆడ; వెలుగు – చీకటి; రాత్రి – పగలు యిలా. కాని, అంతరంగికంగా మనలో – లోపం – ద్వంద్వ ప్రకృతి ఎందుకు వున్నట్లు? నాతో పాటు యీ ప్రశ్నను గురించి ఆలోచించండి. నేను జవాబు చెబుతానని ఎదురు చూడకండి. జవాబుకోసం మీరు మీ మనసులను పదును పెట్టి ఆలోచించుకోవాలి. నా మాటలు కేవలం అద్దంలా ఉపకరించాలి మీకు, మిమ్మల్ని మీరు చూచుకుందుకు. మానసికంగా ఎందుకు ద్వంద్వ ప్రకృతి వున్నది మనలో? ఉన్నది – ఉండవలసినది – ఈ రెంటికీ పోలిక చెప్పకోవడంలోనే మనం యిన్నాళ్లు పాఠాలు చెప్పకున్నామా? మంచి యేది, చెడ్డ యేది; సరయినదేది, సరికానిది యేది; నైతికం యేది, నైతికం కానిది యేది – అనే మీమాంసలలోనే మనం నిబద్ధులమై వున్నామా? దౌర్జన్యం, ఈర్ష, అసూయ, నైచ్యం – యిలాంటివన్నీ తొలగదోసుకోవాలంటే వీటికి వ్యతిరేక భావాలయిన సద్గుణాలను ఉపాసించాలని అనుకోవడం వల్లనే మనకు యీ ద్వంద్వ ప్రకృతి వచ్చేసిందా? ఒకదానిని పోగొట్టుకోవటానికి, దాని వ్యతిరేక పదాన్ని – భావాన్ని యంత్రంగా ఉపయోగించ జూస్తున్నామా? అసలు, ఉన్నదానినుంచి పారిపోయేందుకు ప్రయత్నిస్తున్నామా?

యదార్థాన్ని ఎలా అవగాహన చేసుకోవాలో, దానితో యేం చేయాలో తెలియక దానినుంచి పారిపోవడం కోసం మనం వ్యతిరేక పదజాలాన్ని సృష్టించుకుంటున్నామా? లేక వేల సంవత్సరాల తరుబడి మనకు యేదయినా ఆదర్శం వుండాలి అని చెప్పకుంటూ వచ్చినందువల్లనా? వర్తమానంతో పోటీగా యేదో ఆదర్శం, ఆదర్శం అంటూ వున్నప్పుడు ప్రస్తుతంలో వున్న అసందిగ్ధతలు తొలగి పోతా యనుకుంటున్నామా? కాని, అలా ఎన్నటికీ జరగదు. మీరు మీ జీవిత శేషమంతా దౌర్జన్య రాహిత్యాన్ని గురించి – అహింస గురించి ప్రబోధిస్తూ గడపవచ్చును. కాని, ప్రతిక్షణము దౌర్జన్యానికి, హింసకు బీజాలు వేస్తూ వుండవచ్చును.

మీరు ఎలా వుండాలి, ఎలా ప్రవర్తించాలి – అనేది ఒక నిర్ధారణ వున్నది మీకు. కాని, నిజానికి ప్రతిక్షణము యిందుకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నారు. కనుక చూచారా, సిద్ధాంతాలు – విశ్వాసాలు – ఆదర్శాలు ఎలా కృతక జీవనానికి దారి తీస్తున్నాయో, మీచేత నిజాయితీ లేని జీవితం వెళ్లదీస్తున్నాయో! ఆదర్శమే ఉన్నదానికి వ్యతిరేక భావన తీసుకువస్తుంది. ఉన్నదానితో సమరసంగా వుండడం ఎలాగో తెలిస్తే, అప్పుడు తత్ విరుద్ధమయిన దాని అవసరం వుండదు.

ఇతరుల మాదిరి వుండడము ఆదర్శానికి తగినట్లుగా కల్పన చేసుకోవడము, –

యిదే వైరుధ్యాన్ని, గందరగోళాన్ని, సంఘర్షణను తీసుకువచ్చే ప్రధాన కారణాలలో ఒకటి. ఏం చేస్తున్నా, యే స్థాయిలో వున్నా - మనసు గందరగోళంలో మునిగి వుంటే అది అలాగే గందరగోళంగా వుంటుంది. దాన్లోంచి వెలువడే ప్రతిపనీ, ఆలోచనా - మరింత గందరగోళాన్ని సృష్టిస్తుంది. నాకు ఈ విషయం అతిస్పష్టంగా అగుపిస్తోంది. ఎదురుగా వున్న స్థూలప్రమాదంలా స్పష్టంగా అగుపిస్తోంది. కనుక యేం జరుగుతోంది? - నేనిక గందరగోళ స్థితిలో వ్యవహరించడం అనేది మానివేస్తాను. కనుకనే ఈ మానివేయడం, పరిపూర్ణ చర్య అవుతుంది.

★ ★ ★

# 8

## స్వేచ్ఛ - తిరుగుబాటు - ఒంటరితనం - అమాయకత - మనం ఉన్న వాళ్ళం వున్నట్లుగా జీవించడం.

అణిచివేత వల్ల పొందిన బాధలు, ఒక నియమాన్ని అంటి పెట్టుకున్నందు వల్ల యేర్పడిన క్రమశిక్షణ – యివేవీ సత్యానికి దారి యేర్పాటు చేయలేవు. సత్యసందర్శనానికి దారి యేర్పడ వలెనంటే, మనసు పూర్తిగా స్వేచ్ఛగా వుండాలి, ఏమాత్రం వికృతము విరూపము వుండగూడదు.

ముందు మనం ఒక విషయం స్పష్టపరుచుకోవాలి – మనం నిజంగా స్వేచ్ఛ కావాలని అనుకుంటున్నామా? పూర్తిస్వేచ్ఛ కావాలనుకుంటున్నామా లేక యేదో అనానుకూలం నుంచి, తాత్కాలిక అసౌకర్యం నుంచి బయటపడాలని అనుకుంటున్నామా? మనకు యిష్టంలేని అనాహ్లాదకర, అవాంఛనీయ పరిస్థితులనుంచి విడుదల కావాలని మాత్రం కోరుకుంటున్నామా? బాధ కలిగించే, జుగుప్సలో ముంచే అనుభవాలనుంచి, అసౌఖ్యదాయక అనుభవాల నుండి బయటపడాలని అనుకుంటాము. అవాంఛనీయ మయిన జ్ఞాపకాలనుంచి దూరంగా వుండాలనుకుంటాము. మన మనసుకు ఆహ్లాదం చేకూర్చే, సంతృప్తిపరచే ఆదర్శాలు, సూత్రాలు, సంబంధాలు కావాలనుకుంటాము. ఒకదానినుంచి మరొకదానిని వేరు చేయడం చాల కష్టం. ఎందుకంటే – సుఖం అనేది దుఃఖంనుంచి విడదీయరానిది అని ముందే గమనించాలి గదా మనం!

అందుచేత ముందుగా మనం తేల్చుకోవలసిన అంశం యేమిటంటే – మనం పరిపూర్ణమయిన స్వేచ్ఛ కావాలనుకుంటున్నామా లేదా అని! అలా కావాలనుకుంటున్నాం అనుకునేట్లయితే, అప్పుడు స్వేచ్ఛ అంటే యేమిటి – దాని స్వభావం, నిర్మాణ రూపం ఎలా వుంటుంది అన్న విషయాలు తెలుసుకోవాలి.

దేన్నించో వైదొలగి వుండడమే స్వేచ్ఛా? బాధనుండి స్వేచ్ఛ, ఏదో రకమయిన అదుర్దానుంచి స్వేచ్ఛ. ఇంతేనా – లేక మరేదో పరిపూర్ణ స్వేచ్ఛ వున్నదా? అసూయ నుంచి స్వేచ్ఛ పొందవచ్చును. కాని, అది కేవలం ప్రతిక్రియ మాత్రమే అయిపోయి, నిజమయిన స్వేచ్ఛ కాకుండా వుండవచ్చును కదా? సంప్రదాయం నుంచి స్వేచ్ఛ సంపాదించ వచ్చును. దానిని వివరించి చూడడం ద్వారా – త్రోసిరాజు అనడం ద్వారా. కాని, అటువంటి స్వేచ్ఛ వుద్దేశ్యం యేమిటి? ఆ సిద్ధాంతం యీ కాలానికి తగినది కాదు గనుక, ప్రస్తుతానికి అనుకూలమయినది కాదు గనుక

దాని కోసం ప్రయత్నం చేస్తున్నామా? అంతర్జాతీయత పట్ల మక్కువ వల్ల జాతీయ భావాలు సరయినవి కావనీ వాటినుంచి స్వేచ్ఛ కావాలనీ అనుకుంటున్నామా? లేక ప్రస్తుత ఆర్థిక అనుకూలతల దృష్ట్యా సంకుచితమయిన జాతీయ భావనలు సరి అయినవి కావని అనుకుంటున్నామా? ఇదంతా తేలికగా అర్థం చేసుకోవచ్చును. లేదా ఎవరో ఆధ్యాత్మిక రాజకీయనాయకుని పట్ల విరోధంతో – క్రమశిక్షణ, విప్లవం పట్ల తిరుగుబాటు ధోరణితో మనం యిటువంటి ఆలోచనలకు రావచ్చును. ఆ రకమయిన జాతీయభావం, న్యాయసమ్మత తీర్మానం – నిజస్వేచ్ఛతో యేమాత్రమయినా పొందిక పొంది వున్నదా?

దేనినుంచయినా మీరు స్వేచ్ఛగా వున్నాము అనుకుంటే, అది గూడా ఒక ప్రతిచర్యే అవుతుంది. అది మరో రకమయిన కట్టుబాటును, ఆధిపత్యాన్ని తీసుకు వస్తుంది. ఈ విధంగా మనం ప్రతిచర్యల పరంపరలను ఎదుర్కొనవచ్చును. 'ప్రతి చర్య'ను స్వేచ్ఛగా రూపొందించుకోవచ్చును. కాని, అది నిజానికి స్వేచ్ఛకాదు. వెనకటి కట్టుబాటు తాలూకు కొనసాగింపే అవుతుంది. మనసు యిరుక్కుపోయిన గతానికి సంబంధించినదే అవుతుంది.

ఈనాటి యువతరం – ప్రతి యువతరం మాదిరిగానే – సంఘానికి వ్యతిరేకంగా వున్నారు. దానంతట అది మంచిదే. కాని, తిరుగుబాటు అనేది స్వేచ్ఛ కాదు. తిరుగుబాటు కేవలం ప్రతిచర్య మటుకే. ప్రతిచర్యకు దాని కట్టుబాట్లు వుంటాయి, మీరు వాటిలో యిరుక్కుపోతారు. అదేదో కొత్తదని మీరు అనుకోవచ్చును. కాని కాదు. కొత్త మూసలో పోసిన పాత వస్తువే అది. సాంఘిక, రాజకీయ తిరుగుబాటు ప్రతిదీ, తప్పనిసరిగా పాత ధోరణికే దిగజారిపోతుంది.

స్వేచ్ఛ అనేది మీకు చక్కగా చూచి ప్రవర్తించినందువల్లనే వస్తుంది. తిరుగుబాటు వల్ల ఎన్నటికీ రాదు. చూడడమే ప్రవర్తన. ఏదో ప్రమాదాన్ని చూచినట్లుగా, యీ చూడడం అనేది తక్షణ వర్తనాన్ని తీసుకు వస్తుంది. అప్పుడు దానిని తర్కం, చర్చ, అనుమానించడం అనేది వుండదు. ప్రమాదమే మనను కార్యాచరణకు ముందుకు తోస్తుంది. అందుచేత చూడడమే సరయిన ప్రవర్తన, పరిపూర్ణ స్వేచ్ఛ.

స్వేచ్ఛ అనేది ఒక మానసిక స్థితి. ఫలానా దానినుంచి స్వేచ్ఛ అని కాదు. కాని, స్వేచ్ఛ అనే భావం అనుమానించడానికి, ప్రశ్నించటానికి తగినంత స్వేచ్ఛ. అందుచేతనే అది తీవ్రము, చురుకు, త్వరితమయినదీని. అన్నిరకాల పరాధీనతను, బానిసత్వాలను, కట్టుబాట్లను, ఆమోదాలను పక్కకు నెట్టివేస్తుంది. అటువంటి స్వేచ్ఛ, పూర్తిగా ఏకాంతంగా వుండటాన్ని సూచిస్తుంది. పరిస్థితులపైని, వాతావరణం పైని, వైఖరుల మీద ఆధారపడి తయారయిన మనసు యిటువంటి స్వేచ్ఛను – పరిపూర్ణ యేకాంత స్థితికి చెందినది, నాయకత్వానికి లోబడినది, సంప్రదాయం, ఆధిపత్యం ఎరగనిది అయిన స్వేచ్ఛను కనుగొనగలరా?

ఈ ఒంటరితనం మానసిక స్థితి. ఎటువంటి ఉత్తేజాలపైన, పాండిత్యంపైన ఆధారపడదు. అనుభవాలకు తీర్పులకు ఫలితంగా యేర్పడినది కాదు. మనలో చాల మందిమి అంతరికంగా, వంటరివాళ్లం కానేకాదు. వేర్పాటుతనం, ఒంటరితనం,

ఏకాకితనం, వేరు వేరు అయినవి. వేర్పాటుతనం అంటే యేమిటో మనకు తెలుసు. మనచుట్టూ గోడలు నిర్మించుకుని, యితరులతో ప్రమేయం లేకుండా, యే రకమయిన బాధకు లోనుకాకుండా మన ఆదర్శ గోపురంలో మనం నివసించడం. ఏకాకితనం యిందుకు పూర్తిగా భిన్నమయినది.

జ్ఞాపకాలు, నిబద్ధతలు, నిన్నటి గురించి గుసగుసలు మనను ఎన్నటికీ ఒంటరిగా ఉండనీయవు. తాను పోగుచేసుకున్న చెత్తా చెదారంనుంచి మనసు ఎన్నటికి విడిగా వుండలేదు. ఒంటరితనం అంటే నిన్నటి సమాచారం అంతటికీ అంతరించి పోవడమే. మీరు పూర్తిగా వున్నప్పుడు, ఒంటరిగా వున్నప్పుడు – యే కుటుంబానికీ చెందరు; ఏ దేశానికీ, ఏ సంస్కృతికీ, ఏ ప్రత్యేక ఖండానికీ చెందరు. పూర్తిగా అన్నింటికీ బయటివారు అయిపోతారు. ఈ రకంగా ఒంటరివాడయిన ప్రతిమనిషీ అమాయకుడు. ఈ అమాయకత్వమే మనసును దుఃఖం నుంచి దూరం చేస్తుంది.

వేయిమంది చెప్పిన సమాచారాన్ని మనతో మోసుకు తిరుగుతూ వుంటాం. సంప్రాప్తమయిన దుర్ఘటనలన్నిటినీ జ్ఞాపకాలుగా వెనక వేసుకుంటాం. వీటన్నిటినీ తొలగ ద్రోసుకోవడమే పూర్తిగా వంటరితనం పొందడం అంటే. వంటరిదయిన మనసు అమాయకమే కాక యవ్వనం కలది కూడా. వయసు సమయం దృష్ట్యా కాదు యవ్వన ప్రమాణం. ఏ వయసు అయినా యువతతో, అమాయకతతో సజీవంగా తొణికిసలాడుతూ వుంటుంది. అటువంటి మనసు మట్టుకే సత్యాన్ని చూడగలుగుతుంది. దానిని మాటలతో కొలవడం అనేది జరగని పని.

ఈ ఒంటరితనంలో – మీలో మీరు యేకాంతంగా బతకడం అంటే యేమిటో అర్థం చేసుకుంటారు – మీరు వుండవలసిన తీరును గురించి, వుండిన పద్ధతిని గురించి కాదు. ఏమాత్రం తడబాటు, కృత్రిమ మర్యాద, భయము, సమర్థన లేక ఖండన లేకుండా మిమ్మల్ని మీరు చూచుకోగలరేమో చూడండి. ఉన్నవారు ఉన్నట్లుగా మీలోమీరు మనగలరా అని గమనించండి.

దేనితోనయినా ఆత్మీయంగా మెలిగినప్పుడే దానిని అర్థం చేసుకోవటానికి అవకాశం యేర్పడుతుంది. దానికి అలవాటు పడిపోయినప్పుడు – మీ ఆదుర్దాలకు, అసూయలకు, యింకా యిలాంటి లక్షణాలకు అలవాటు పడిపోయినప్పుడు – మీరు వాటితో సహజీవనం చేస్తున్నట్లు లెక్క కాదు. ఒక నదీతీరంలో నివసిస్తూ వుంటే, కొన్నాళ్ల తరువాత ఆ నది – నీళ్లు చేసే చప్పుళ్లు గమనించడం, వినడం జరగకుండా పోతుంది. మీ గదిలో గోడకు ఒక బొమ్మ వేలాడుతూ వున్నదనుకోండి. ఒక వారంరోజుల తరువాత దానిని గమనించడమే మరచిపోతారు. పర్వతాలు, లోయలు, వృక్షాల విషయంలో గూడా జరిగేది యిదే. అలాగే మీ కుటుంబం, మీ భార్య, మీ భర్త – విషయంలోనూ. కాని, అసూయ, ఈర్ష్య, ఆదుర్దావంటి లక్షణాలతో నివసించడం అంటే మీరు యెన్నటికీ దానితో అలవాటు పడిపోరు. ఎన్నటికీ వాటిని ఆమోదించరు. కొత్తగా నాటిన మొక్కను జాగ్రత్తగా గమనిస్తూ పెంచినట్లుగా వాటినీ పెంచాలి; రక్షించాలి. సూర్యతాపం నుండి, తుఫాను గాలుల నుంచి కాపాడాలి. సమర్థించడమో ఖండించడమో కాకుండా దానిని బహుజాగ్రత్తగా

గమనించాలి. అప్పుడు దానిని ప్రేమించడం ప్రారంభమవుతుంది. దానిని జాగ్రత్తగా గమనించినప్పుడు, ప్రేమించడం గూడా మొదలవుతుంది. ఈర్ష్యగా వుండడం, ఆదుర్దా కనబరచడం – వీటిని ప్రేమిస్తారని కాదు; చాలామంది ఈ పనే చేస్తారు – కాని మీరు వాటిని గమనించడం బహు మెలకువగా చేస్తారు.

కనుక మీరు – మీరూ, నేనూను – ఉన్నదానితో ఉన్నట్లుగా నివసించగలమా? మనం సోమరిపోతులమనీ, ఈర్ష్యాళువులమనీ, భయస్థులమనీ, అనురాగం లేకపోయినా ఉన్నట్లుగా భ్రమిస్తున్నామనీ, త్వరగా వేదనకు గురి అవుతున్నామనీ; పొగడ్తలకు, విసుగుదలకు ఆలవాలం అవుతున్నామనీ – దీనంతటితోనూ సహజీవనం చేయగలమా? ఈ స్థితిని సమర్థించకుండా, ఖండించకుండా కేవలం గమనిస్తూ – దానివల్ల ప్రభావితులం కాకుండా – దూరంగా వుండిపోగలమా?

ఇప్పుడు తరువాతి ప్రశ్న వేసుకుందాము. ఈ స్వేచ్ఛ, ఈ ఒంటరితనం, మన అంతరంగంతో ముఖాముఖి కలిసి కూర్చోగలగడం – యిదంతా సమయ గమనం వల్ల, కాలానుగుణంగా, జరిగే పనా? అంటే, స్వేచ్ఛ అనేది కొంత కాలవ్యవధిలో క్రమానుగతంగా లభించే వస్తువా? కాదని స్పష్టంగా చెప్పవచ్చును. ఎందుచేతనంటే, కాలం అనేదానిని ప్రవేశపెట్టటంతోటే మీరు మరింత బానిసతత్వానికి లోనయిపోతున్నారు. ఇది కాలక్రమేణ వచ్చే స్థితి ఎంతమాత్రమూ కాదు.

తరువాతి ప్రశ్న యేమంటే – ఈ స్వేచ్ఛను మీరు గమనించి గుర్తించగలరా? 'నేను స్వేచ్ఛగా వున్నాను' అని మీరు అన్నారంటే మీరు స్వేచ్ఛగా లేరని అర్థం. 'నేను సుఖంగా వున్నాను' అనడం వంటిదే ఈ మాట కూడా. సుఖంగా వున్నాను అనడంతోటే సుఖాన్ని గురించిన జ్ఞాపకాలు అతన్ని ముంచెత్తుతున్నాయన్నమాట. స్వేచ్ఛ అనేది సహజంగా వస్తుంది. దానిని కోరుకోవడంవల్ల, వాంఛించడంవల్ల దానికోసం అర్రులు చాచి కూర్చున్నందువల్ల రాదు. దాని స్వరూపం యేమిటో మీరు కల్పన చేసుకుని కూర్చున్నందువల్లకూడా రాదు. స్వేచ్ఛ దానంతట అది అవతరించాలంటే, మనసు జీవితాన్ని చూడడం ఎలానో నేర్చుకోవాలి. అదో విస్తృతమయిన గమనం. కాలబద్ధతకు లోనుకానిది. స్వేచ్ఛ అనేది ప్రజ్ఞాక్షేత్రానికి ఆవల వుంటుంది.

★ ★ ★

# 9

## కాలం - దుఃఖం - మృత్యువు.

ఓ గొప్ప శిష్యుడు భగవంతుని దగ్గరకు వెళ్లి తనకు సత్యబోధ చేయమని కోరిన కథను చెప్పవలె ననిపిస్తుంది. పాపం! ఆ భగవంతుడు అన్నాడు: 'నాయనా, చాల ఎండగా వుంది; ఓ గ్లాసెడు మంచినీళ్లు తెచ్చి పెట్టు.' శిష్యుడు ఓ యింటి ముందుకు వెళ్లి తలుపు తట్టాడు. ఓ సుందరాంగి తలుపు తెరిచింది. శిష్యుడు ఆమెను ప్రేమించడం జరిగింది; వారికి వివాహం అయింది; అనేక మంది పిల్లలు కూడా కలిగారు. ఒకరోజు విపరీతంగా వర్షం కురవసాగింది. రోడ్లన్నీ వరదలమయం అయినాయి. ఇళ్లన్నీ కొట్టుకుపోతున్నాయి. శిష్యుడు భార్యను భుజాల మీద ఎత్తుకుని, పిల్లలను చంకన వేసుకుని ఆ వరదలో పడి కొట్టుకుపోతూనే 'ఓ భగవంతుడా! నన్ను కాపాడు' అని ఎలుగెత్తి కేక వేశాడు. భగవంతుడు 'నేను అడిగిన మంచినీళ్లు యేవయ్యా?' అని అడిగాడు.

ఇది మంచి కథ. ఎందుకంటే, మనం చాలమందిమి ప్రతిదానినీ కాలక్రమేణ, కాలప్రమేయంతో తూచుకుంటాము. మనిషి కాలానుగుణంగానే జీవిస్తాడు. అతని పలాయన వాదంలో భవిష్యత్తును రూపొందించుకోవడం ఓ మంచి ఎత్తు.

మనలో మార్పులన్నీ కాలానుగుణంగా కాలక్రమేణ వస్తాయని అనుకుంటాము. క్రమతను మనలో క్రమక్రమంగా రూపొందించుకోవచ్చు ననుకుంటాము. కాని కాలం క్రమతనుగానీ శాంతిని గానీ తీసుకురాదు. అందుచేత ఏదో కాలక్రమేణ జరుగుతుంది సుమా – అన్న విషయం మనం మరచిపోవాలి. అంటే, రేపు అనే రోజు ఒకటి వున్నదనీ అప్పుడు ప్రశాంతంగా వుంటామనీ అనుకోగూడదు. మనం ఈ క్షణంలోనే, యిప్పుడే క్రమతలో వుండిపోవాలి.

నిజంగా ప్రమాదం ముంచుకు వచ్చినప్పుడు కాలం అంతర్ధానమై పోతుంది. కదూ? అప్పుడు తక్షణ చర్య ఉంటుంది. అయితే, మనకున్న అనేక సమస్యల తాలూకు ప్రమాదాన్ని మనం పసికట్టం; అందుచేత వాటినుంచి పారిపోవటానికి సమయం, కాలం అనే సాధనాన్ని కల్పించుకుంటాం; అన్వేషిస్తాం. సమయం మనకేమి సహాయం చేయదు. పైగా దగా చేస్తుంది. మనలో మార్పు తీసుకురాదు. సమయం అనేదానిని గతం, వర్తమానం, భవితవ్యం అని భాగాలు చేసుకున్నాడు మనిషి. ఈ విభాగాలు చేసుకున్నందువల్ల సంఘర్షణ తప్ప యింకేమీ సంప్రాప్తం కావడం లేదు.

నేర్చుకోవడం అనేది కూడా కాలక్రమేణ జరిగే పనేనా? వేల సంవత్సరాల తరువాత కూడా మనం ఒకళ్ల నొకళ్లం చంపుకోవడం, అసహ్యించుకోవడం కంటె

వేరయిన సక్రమ జీవన విధానం వున్నదని నేర్చుకోలేకపోయినాము. కాలానికి సంబంధించిన సమస్య చాల ముఖ్యము. జీవితాన్ని రాక్షస మయము, అర్థ విహీనము చేసుకున్న మనం యే సమస్యనయినా పరిష్కరించుకోవాలనుకుంటే; ముఖ్యంగా ముందుగా కాలాన్ని గురించిన విషయమే ప్రస్తావించుకోవాలి.

మనం లోగడ ప్రస్తావించుకుని, గమనానికి తెచ్చుకున్న తాజాతనం, అమాయకత్వంతో కూడిన మనసుతో మటుకే చూచి, కాలాన్ని అర్థం చేసుకోగలమనే సంగతి ముందు గ్రహించగలగాలి. అనేక సమస్యలు మనను గందరగోళపరుస్తున్నాయి; మనం యీ గందరగోళంలో చిక్కుకుపోయాము. ఒక అడవిలో దారి కానక చిక్కుకు పోయామనుకోండి, అప్పుడే యేం చేస్తాం? ఉన్నచోట ఆగిపోతాం. ముందుగా మనం చేసే పని యిదీ. ఆగిపోయి, చుట్టూ పరికించి చూస్తాం. అయితే, మనం గందరగోళంలో మిక్కుటంగా చిక్కుకుపోయాం గనుక, జీవితంలో దారి కానక యిరుక్కుపోయాం గనుక – యేం చేస్తున్నామంటే: అటుయిటు పరుగులు తీస్తున్నాం; వెదుకులాడుతున్నాం; అడుగుతున్నాం; దబాయించుతున్నాం; ప్రాధేయపడుతున్నాం. అందుచేత మొదటి విషయం యేమిటంటే – మనం చేయవలసిన మొదటి పని యేమిటని నాకు అనిపిస్తోందంటే – ఆంతరికంగా మనం ఆగిపోవాలి ముందు. ఆంతరికంగా ఆగిపోయినప్పుడు, మానసికంగా అచలంగా వున్నప్పుడు – మనసు ప్రశాంతంగా తయారవుతుంది; స్పష్టత యేర్పడుతుంది. అప్పుడు ఈ కాల స్వరూపాన్ని గురించి జాగ్రత్తగా గమనించవచ్చును.

సమస్యలన్నీ సమయంలోనే చిక్కుకు వున్నాయి. ఏ విషయాన్నయినా మనం సంపూర్ణంగా చూడనప్పుడు జరిగే పని అదే. ఏ సవాలునయినా, పాక్షికంగానే పరిష్కరించుకున్నప్పుడు, సగం సగంగానే వ్యవహరించినప్పుడు దానినుంచి తప్పించుకు పోదామని చూచినప్పుడు – పరిపూర్ణ గమనంతో దానిని గమనించనప్పుడు – మనం సమస్యను ఉత్పన్నం చేస్తున్నాం. మనం యిలా పాక్షిక గమనాన్ని మటుకే యిస్తున్నంత సేపూ, యీ సమస్య యిలా కొనసాగుతూనే వుంటుంది. ఎప్పుడో ఒకప్పుడు పరిష్కరిద్దాంలే అనుకున్నంతసేపూ యీ స్థితే ఎదురవుతుంది.

సమయం అంటే ఏమిటో తెలుసా మీకు? గడియారం చూపే సమయం కాదు; కాలండరు టైం కాదు. మానసికమయిన కాలప్రమాణం. ఆలోచనకు, ఆచరణకు మధ్యనున్న విరామమే కాలం. ఆలోచన అనేది స్వరక్షణార్థం. అంతేకదూ? భద్రత కోసం చేసుకునే ఆలోచన. ఆచరణ అనేది ఎప్పుడూ తక్షణ మయినది. అది గతానికి భవిష్యత్తుకు సంబంధించినది కాదు. ఆచరణ ఎప్పుడూ వర్తమానంలోనే జరుగుతుంది. కాని, ఆచరణ ప్రమాదభూయిష్ఠమయినది, అనిశ్చితమయినదీని. అందుకని మనం ఆలోచనకు కట్టుబడివుండి, దానిద్వారా యేదో నిశ్చిత భద్రత యేర్పడుతుందని అనుకుంటున్నాము.

దీనిని గురించి మీలో మీరు చూచుకోండి. మంచి – చెడు అంటే యేమిటి అనే దానిని గురించి మీకో అభిప్రాయం ఉన్నది. మీరు, సంఘము – గురించి ఓ ఆదర్శవాద సిద్ధాంతం మీరు ఎరుగుదురు. ఆ సిద్ధాంత ప్రాతిపదికలోనే ఆచరణ

చేయబోతున్నారు. ఆచరణ ఆలోచనను అనుసరించే వున్నది. అందుచేత సంఘర్షణ తటస్థిస్తోంది. ఆలోచన, సమయవిరామం, ఆచరణ – వున్నాయి. ఆ సమయ విరామంలో కాలప్రమాణం అంతా యిమిడి వున్నది. ఆ విరామం అంతా ఆలోచనే, భావనే. రేపు నేను కులాసాగా వుంటాను అనుకున్నప్పుడు సమయ విరామంలో మీరు యేదో సాధించబోతున్నారన్న భరోసా యిమిడి వున్నది. పరిశీలన, కోరికల ద్వారా భావన; దాని నుంచి ఉత్పన్నమయ్యే మరో భావన కొనసాగి యేం చెబుతుందంటే, 'రేపు నేను కులాసాగా వుంటాను. రేపు నేను సాధిస్తాను. రేపు ప్రపంచం అంతా సుందర దృశ్యంగా తయారయిపోతుంది' అని. కాలం అనే ఆ విరామాన్ని భావన సృష్టిస్తోంది.

ఇప్పుడు మనం అడుగుతున్న ప్రశ్న యేమంటే – ఈ సమయం, కాలం అనేదాన్ని మనం ఆటంక పరచగలమా? ఆపుచేయగలమా? భావన అనేది రేపటి గురించి ఆలోచించకుండా వుండేట్లుగా మనం పరిపూర్ణంగా జీవించగలమా? సమయమే దుఃఖం. అంటే నిన్ననో, వేయిసంవత్సరాల క్రిందటనో మీరు ప్రేమించారు; లేక మీకో ప్రియులున్నారు, అదృశ్యమయిపోయారు; ఆ జ్ఞాపకాలు మిమ్మల్ని అంటిపెట్టుకు వుండి మీరు ఆ సుఖదుఃఖాలను గురించి ఆలోచించేట్లు చేస్తున్నాయి. మీరు గతంలోకి చూస్తున్నారు: ఆశలు, కోరికలు, పశ్చాత్తాపాలు, వాటిని గురించి పదేపదే వచ్చే ఆలోచనలు – యివన్నీ దుఃఖాన్ని తీసుకు వస్తున్నాయి. కాలానికి కొనసాగింపు ధోరణే తీసుకువస్తున్నాయి.

సమయ విరామం వున్నంతసేపు – యిది భావన వల్ల తయారవుతోంది గనుక భయం కొనసాగుతూనే వుంటుంది. ఈ విరామం తగ్గించటానికి, అంతమొందించటానికి వీలు వున్నదా? 'ఇది అంతమయిపోతుందా' అని ప్రశ్న వేసుకున్నారంటే, అదో భావనగానే వుండిపోతుంది; మీరు సాధించదలుచుకున్న అంశంగా రూపొందుతుంది: అందుచేత మరో సమయవిరామం యేర్పడుతుంది; దానిలో మీరు మళ్లీ చిక్కుకుపోతారు.

చాలమందికి ఉపద్రవంగా కనిపించే మృత్యు సమస్య తీసుకోండి. మీకు మృత్యువంటే యేమో తెలుసు; అది ప్రతిరోజూ మీ సరసనే నడుస్తూ వున్నది. దాన్నో సమస్యగా రూపొందించుకోకుండా దానిని గురించి సహజంగా పరిపూర్ణంగా వ్యవహరించగలమా? అలా జరగాలంటే, దానిని గురించి మనకున్న విశ్వాసాలు, ఆశలు, భయాలు అన్నీ అంతరించి పోవాలి. లేకపోతే దీనిని యేదో తీర్మానంతో, ప్రతీకతో, ముందే నిర్ణయించుకున్న ఆదుర్దాలతో – అంటే, సమయం ద్వారానే గమనిస్తున్నామన్నమాట.

పరిశీలకుడికీ, పరిశీలన వస్తువుకూ మధ్య వున్న అంతరం కాలం. అంటే, పరిశీలకులయిన మీరు మృత్యువును కలుసుకోవటానికి భయపడుతున్నారన్నమాట! అదంటే మీకు యేమిటో తెలియదు; దానిని గురించి యేవో ఆశలు, సిద్ధాంతాలు మటుకు వున్నాయి. మీకు పునర్జన్మలోను, పునరవతరణంలోను నమ్మకం వుంది. ఆత్మ అనే ఆధ్యాత్మ వస్తువు – కాలానికి అతీతమయింది, యిలా అనేక పేర్లు

పెట్టుకున్నదీ వున్నదని మీ విశ్వాసం. అసలు ఆత్మ అనేది వున్నదా అనే సంగతి మీరు పరిశోధించి చూచుకున్నారా? పరపంపరాగతంగా మీకు సంప్రాప్తించిన అభిప్రాయమేనా అది? ఏదో శాశ్వతమయినదీ, కొనసాగేది, ఆలోచనకు భావనకు అతీతమయినదీ – యేదయినా వున్నదా? భావన దానిని గురించి ఆలోచించ గలిగేట్లయితే, అది భావనక్షేత్రంలోనే వుండిపోయే – యిమిడిపోయే – వస్తువు అయిపోతుంది గదూ? అందుచేత అది శాశ్వతమయినది కాదు – ఎందుకంటే, భావన క్షేత్రంలో యేదీ శాశ్వతం కాదు. ఏదీ శాశ్వతం కాదు సుమా అని గమనించడమే, చాల ముఖ్య విషయం. అప్పుడే మనసు స్వేచ్ఛగా చూడగలుగుతుంది. అందులోనే గొప్ప ఆనందం ఉంది.

తెలియని దానిని గురించి మీకు భయం లేదు. ఎందుకంటే, అది యేమిటో మీకు తెలియనే తెలియదు గనుక. దానిని గురించి భయపడవలసిన పనిలేదు. మృత్యువు అనేది ఒక మాట మాత్రమే. అది మాట, ఒక ప్రతీక – అదే భయాన్ని కలుగజేస్తోంది. మృత్యురూపకల్పన లేకుండా మృత్యువు వంక చూడగలరా? రూపకల్పన వున్నంత వరకూ – దాని నుంచి భావన ఉబుకుతుంది; భావన భయాన్ని సృష్టిస్తుంది. అప్పుడు మృత్యు భయాన్ని తార్కికంగా రూపొందించుకుంటారు, దానిని ఎదుర్కోవటానికి పన్నాగాలు చేస్తారు. మృత్యుభయం నుంచి బయట పడటానికి ఏవో సిద్ధాంతాలు, విశ్వాసాలు తయారు చేసుకుంటారు. అప్పుడు మీకు, మీరు భయపడుతున్న వస్తువుకు మధ్య కొంత విరామం, వ్యవధి యేర్పడుతోంది. ఈ సమయ విరామంలో, భయము ఆదుర్దా అనుకంపల సముదాయ సంఘర్షణ ఉండక తప్పదు. మృత్యుభయాన్ని తీసుకు వచ్చే భావన అంటోంది: 'దానిని వాయిదా వేద్దాం; వదిలించుకుందాం; సాధ్యమయినంత దూరంగా నెట్టి వేద్దాం. దానిని గురించి ఆలోచనే చేయవద్దు,' అని. కాని, మీరు దానిని గురించే ఆలోచిస్తున్నారు. నేను దానిని గురించి ఆలోచించను అన్నప్పుడు, దాన్ని వదిలించుకోవడం ఎలానో అప్పుడే ఆలోచన చేసుకున్నారన్నమాట! దానిని వాయిదా వేశారు గనుక మీకు భయం మృత్యువు అంటే.

బతకడాన్ని మృత్యువునుంచి వేరుచేశాం. బతకడానికీ చనిపోవటానికీ నడుమ వున్నది భయం. ఈ విరామం సమయం, భయం వల్ల యేర్పడుతోంది. దైనందిన బాధలలో, నిందలలో, దుఃఖాలలో, గందరగోళాలలో బతుకుతూ మధ్యమధ్యలో కిటికీ తలుపులు తెరుచుకుని అద్భుతమైన సముద్ర దర్శనం చేసుకుంటున్నారు. దానినే జీవితం అని పిలుచుకుంటున్నాం. మనకు చనిపోవడం అంటే భయం. ఈ దుఃఖాన్ని అంతమొందించడం అంటే భయం. తెలియని దానిని తెలుసుకోవడం కంటే, తెలిసిన దానిని అంటిపెట్టుకు వుండడమే మనకు సమ్మతం. తెలిసినవి యేమిటి? – మన యిల్లు, యింట్లో సరంజామా, కుటుంబం, శీల సంపద, మన పని, మన విషయ పరిజ్ఞానం, మన కీర్తి, మన వంటరితనం, మన భగవంతుళ్లూ – వీటి చుట్టూనే మనం ఎన్నటికీ గుడుగుడు గుంజం ఆడుతూ వుంటాము.

జీవనం ఎప్పుడూ వర్తమానంలోనే వుంటుందనుకుంటాం. మృత్యువు ఎక్కడో

దూరంగా వుంటుందని మన ఉద్దేశ్యం. అయితే, యీ దైనందిన సంఘర్షణే నిజంగా బతకడమా అనే విషయం మనం ఎప్పుడూ ప్రశ్న వేసుకోలేదు. పునర్జన్మను గురించి యదార్థం యేమిటో తెలుసుకోవాలనుకుంటున్నాం; ఆత్మ చావకుండా వుంటుందని మనకు నిర్ధారణలు కావాలి; దివ్యదృష్టి వున్నవారు చెప్పే మాటలు వింటాం, మానసిక శాస్త్ర పరిశోధనల పరిశీలనాంశాలు గమనిస్తాం ఉత్సాహంగా. కాని, ఎన్నటికీ ప్రశ్నవేయం – జీవించడం ఎలా? అని. సంతోషంగా, ఆహ్లాదంగా, సుందరంగా – ప్రతిరోజు ఎలా జీవించాలి అన్న ప్రశ్నే వేసుకోం. జీవితాన్ని దుఃఖాల బాధల సముదాయంగా అంగీకరిస్తున్నాం; దానికే అలవాటు పడిపోతున్నాం. మృత్యువును బహు జాగ్రత్తగా దూరంగా తరిమి వేయాలి సుమా అని ఆలోచనలు చేస్తున్నాం. కాని, మృత్యువు గూడా జీవనం వలెనే ఎంతో మనోహర మయినది; జీవనం ఎలా కొనసాగాలో తెలిసినప్పుడు మృత్యువు విలువ మనకు తెలుస్తుంది. ప్రతిక్షణమూ మానసికంగా చనిపోక పోయినట్లయితే, మీకు జీవించడం ఎలాగో తెలియదు. ఇది తెలివయిన చిక్కుప్రశ్న అనుకోకండి. పరిపూర్ణంగా సమగ్రంగా జీవించడానికి, ప్రతిరోజూ అదే నూతనము, ప్రేమయుతమూ అన్నట్లుగా వుండటానికి, నిన్నటికి – నిన్నటి వస్తు సముదాయానికి పూర్తిగా చనిపోవడం తప్పనిసరి, లేకపోతే జీవనం యాంత్రికంగా తయారయిపోతుంది; యాంత్రిక మనసు ప్రేమంటే యేమిటో, స్వేచ్ఛ అంటే యేమిటో తెలుసుకోలేదు.

బతకడం అంటే యేమిటో మనకు సరీగా తెలియదు. కనుకనే మనలో చాలమందికి చనిపోవడం అంటే భయం. బతకడం ఎలానో మనకు తెలియదు. అందుచేత చనిపోవడం ఎలానో గూడా యెరుగము. బతుకు అంటే భయం వున్నంత వరకు, మృత్యుభయం వుండనే వుంటుంది. జీవితం అంటే భయంలేని మనిషి, పూర్తి అభద్రత అంటేనూ భయపడడు. ఎందుకంటే, అతనికి అంతరికంగా – మనసులో – తెలుసును, భద్రత అనేది లేనేలేదని. భద్రత అన్నది లేనప్పుడు అంతులేని గమనం వుంటుంది. అప్పుడు బతకడము, చనిపోవడమూ – రెండూ ఒక్కటే అవుతాయి. సంఘర్షణ లేకుండా బతికే మనిషి, సుందరతతోను ప్రేమతోను విలసిల్లే మనిషి, మృత్యువంటే భయపడడు. ఎందుకంటే, ప్రేమించడం అంటే మరణించడమే.

మీకు తెలిసినదానికంతటినీ మీరు తుడిచిపెట్టుకు పోయినట్లయితే – మీ కుటుంబానికి, జ్ఞాపకాలకు, మీ భావనలకు ఉద్రేకాలకు – అంతరించినట్లయితే, అప్పుడు మృత్యువు ఓ పవిత్రకార్యం అవుతుంది; పునరుజ్జీవన ప్రక్రియగా తయారవుతుంది. అప్పుడు మరణం అమాయకతను తీసుకువస్తుంది; అమాయకులే ఆత్మీయులు కాగలుగుతారు; విశ్వాసాలలో మునిగినవాళ్లు, మృత్యువు తదనంతరం ఏమవుతుందో కనుక్కుందా మనుకుంటున్నవాళ్లు, యిలా ఆత్మీయత పెంచుకోలేరు.

మరణించిన తర్వాత యేమవుతుంది అన్న విషయం తెలుసుకోవటానికి మరణించడం ఒక్కటే మార్గం. ఇది వేళాకోళంగా తీసుకోకండి. మీరు మరణించాలి – భౌతికంగా కాదు – మానసికంగా, అంతరికంగా. మీరు ప్రీతిపడ్డవస్తువులన్నిటికీ

మరణించాలి; మీరు వద్దనుకున్న అసహ్యించుకున్న వాటికి మరణించాలి. చిన్నదో పెద్దదో మీకు సుఖదాయకం అయినదానికి మీరు మరణిస్తే సహజంగా – యే వాదాలు, బలవంతాలు అవసరం లేకుండానే – చనిపోవడం అంటే యేమిటో మీకు తెలిసి వస్తుంది. చనిపోవడం అంటే – తనను తాను దులిపివేసుకున్న, ఖాళీ చేసుకున్న మనసును పొందడం అన్నమాట! దైనందిన కోరికలు, సుఖాలు, యాతనలు యేమీ లేవు మనసులో, మృత్యువు నూతనావతరణ. తక్షణ మార్పు. దీనిలో భవ సంపర్కం లేదు. భావన పాతదయిపోయింది. కనుక దీనిని తాకలేదు. మరణం సంభవించినప్పుడు, మరేదో కొత్తది – పూర్తిగా కొత్తది – వస్తుంది. తెలిసినదానినుండి స్వేచ్ఛయే మరణం. ఆ తరువాతనే మీరు జీవిస్తారు.

★ ★ ★

# 10

# ప్రేమ

సంబంధబాంధవ్యాలలో క్షేమంగా, భద్రంగా వుండాలనుకోవడం వల్లనే దుఃఖము, భయము యేర్పడుతున్నాయి. భద్రత కోసం ప్రాకులాడడం అంటే అభద్రతను ఆహ్వానించడం అన్నమాట. మీ సంబంధాలలో యెన్నడయినా భద్రతను కనుగొన్నారా? మనలో చాల మందిమి ప్రేమలో భద్రత కోరుకుంటాము; ప్రేమించాలి – ప్రేమించబడాలి. కాని, ఎవరికి వారు భద్రతకోసం పాకులాడుతున్నప్పుడు, తమ ప్రత్యేక మార్గంలోనే పయనిస్తున్నప్పుడు, ప్రేమ అనేదానికి ఆస్కారం వున్నదా అసలు? మనకు ప్రేమించడం ఎలానో తెలియదు కనుకనే ప్రేమించబడడం అనేది కూడా దూరమయిపోతోంది.

ప్రేమ అంటే యేమిటి? ఈ మాటకు ఎన్నో విపరీత అర్థాలు వున్నాయి; భ్రష్టమయిపోయింది యీ మాట. నాకు దీనిని ఉపయోగించడమే యిష్టం లేదు నిజానికి. అందరూ ప్రేమను గురించే మాట్లాడుతారు – పత్రికలు, వార్తాపత్రికలు, మత ప్రవర్తకులు అంతులేని ప్రేమను గురించే భాషిస్తారు. నా దేశాన్ని నేను ప్రేమిస్తాను, నా రాజును ప్రేమిస్తాను, ఏదో పుస్తకాన్ని ప్రేమిస్తాను. పర్వతాన్ని ప్రేమిస్తాను, సుఖాన్ని ప్రేమిస్తాను. నా భార్యను ప్రేమిస్తాను, భగవంతుడిని ప్రేమిస్తాను! ప్రేమ అనేది ఒక అభిప్రాయమా, ఆలోచనా? అలా అయినట్లయితే, దానిని నేర్చుకోవచ్చును, అలవరచుకోవచ్చును. భగవంతుడిని ప్రేమిస్తున్నాను అంటే యేమిటి అర్థం? మీ ఆలోచన, ఊహాశక్తి యొక్క సుదీర్ఘరూపాన్ని మీరు ప్రేమిస్తున్నారన్న మాట. మీరే నిర్మాణం చేసుకున్న ఓ మర్యాద రూపాన్ని, ఉదాత్తము – పవిత్రము అనుకుంటున్నదాన్ని ప్రేమిస్తున్నారు. అందుచేత 'భగవంతుడిని ప్రేమిస్తున్నాను' అనడం అర్థరహితమయిన మాట. మీరు భగవంతుడిని పూజించినప్పుడు, మిమ్మల్ని మీరే పూజించుకుంటున్నారన్నమాట – అది ప్రేమకాదుగదా!

మానవతకు సంబంధించిన ఈ ప్రేమను మనం పరిష్కారంగా తెలుసుకోలేం గనుక యేదో అరూపమయిన వివరణల వయిపు వెడతాము. మనిషి సమస్యలన్నిటికీ ప్రేమ అనేదే అంతిమ పరిష్కారం అంటాము. సమస్యను, బాధలను అంతు చేసేది అదే అంటాము. ఇంతకూ ప్రేమ అంటే యేమిటో ఎలా కనుక్కోగలుగుతాము? దానిని నిర్వచించినంత మాత్రాన చాలదు గదా! మతం దానికో నిర్వచనం యిచ్చింది, సంఘం మరో రకంగా చెప్పింది. ఎన్నో వైరుధ్యాలు, డొంక తిరుగుళ్లు వున్నాయి. ఎవరినో కీర్తించడం, ఎవరితోనో పడుకోవడం, అనురాగాలు పంచుకోవడం, సహచర్యం – యిదేనా ప్రేమ అంటే మనం చెప్పుకునే అర్థం? మామూలు వాడుక

యిదే; యీ చట్రంలోనే ఒదిగి వుంటున్నాం. ఇదంతా ఆత్మీయము, ఇంద్రియ సంబంధము, పరిమితము అయిపోయింది గనుక - మతాలు యిందుకు వేరుగా ఉదాత్తమయిన నిర్వచనాలు చెప్పాయి. మానవ ప్రేమ అని వాళ్లు చెప్పేదానిలో - సుఖం, పోటీ, అసూయ, పొందాలనే కాంక్ష, నిగ్రహం, ఇతరుల ఆలోచనతో జోక్యం - వున్నాయి. దీనిలో వున్న గందరగోళం అంతా చూచిన మీదట యింతకంటే ఉదాత్తమయినది, దైవికమయినది, సుందరమయినది, అలౌకికమయినది, భ్రష్టుపట్టనిదీ యేదో వుండి వుండాలి అనిపిస్తుంది.

ప్రపంచం అంతటా, పవిత్రులమని చెప్పుకునేవారు - స్త్రీని ముఖాముఖి చూడడమే తప్పు అన్నారు. లైంగిక వ్యవహారాలలో చిక్కుకుంటే భగవంతుని పొందలేవు అన్నారు; వాళ్లు నిలువెల్లా కోరికలతో వేగిపోతున్నా - యీ రకమయిన మాటలు కొనసాగించారు. లైంగికతను పక్కకునెట్టేసి, కళ్లు మూసుకుని నాలుక బిగించుకుని, ప్రపంచంలోని సౌందర్యాన్నే తిరస్కరించినవాళ్లు అయ్యారు. వాళ్ల హృదయాలు, మనసులు ఎండి వడిలిపోయాయి. ఆర్చుకుపోయిన మనుషులుగా తయారయ్యారు. స్త్రీలకు సంబంధించినది గనుక సౌందర్యాన్ని గూడా వాళ్లు బహిష్కరించారు.

ప్రేమను పవిత్రము - పామరము; మానవీయము - దైవికము అని విభజించడానికి వీలున్నదా; లేక ప్రేమ అనేది ఒక్కటేనా? ప్రేమ ఒక్కటేనా లేక అన్నిటికీ సంబంధించినదా? 'నిన్ను ప్రేమిస్తున్నాను' అంటే యితరులను ప్రేమించడం లేదని అర్థమా? ప్రేమ వ్యక్తిగతమయినదా - అవ్యక్తమయినదా? నైతికమా అనైతికమా? కుటుంబ వ్యవహారమా - కాదా? మానవాళిని అంతటినీ ప్రేమించేట్లయితే ప్రత్యేకంగా ఎవరినయినా ప్రేమించగలరా? ప్రేమ అనేది అనుభూతా? ఉద్వేగమా? సుఖమా, కామనా? - ఈ ప్రశ్నలన్నీ యేం తెలియచెప్తున్నాయంటే, మనకు ప్రేమను గురించి ఎన్నో అభిప్రాయాలు వున్నాయని, దీనికో బిగించిన చట్రం వున్నదనీ, మనం నివసించే సంస్కృతి దీనిని నియామకం చేస్తున్నదనీని!

అందుచేత ప్రేమంటే యేమిటో తెలుసుకోవటానికి ముందు - శతాబ్దాల తరబడి దానికి యిచ్చిన అర్థాలనుండి దానిని విడదీయగలగాలి. అన్ని ఆదర్శాలు, వాదాలు వైదొలగించుకొని చూడగలగాలి. ఇది యేమయివుంటుంది, యేమయివుండాలి - అని విభజించుకోవడం అంటే - జీవితాన్ని మోసగించుకోవడంలో యింతకంటే దారుణమయిన ప్రక్రియ మరేమీలేదు!

సరే, యిప్పుడు - మహోజ్జ్వలంగా వెలిగిపోయే యీ ప్రేమను కనుక్కోవడం ఎలా? దాన్ని ఎలా వ్యక్తపరచడం అనికాదు, అసలు అదంటే యేమిటి అన్నది ప్రశ్న. మతము, సంఘము, తల్లిదండ్రులు, స్నేహితులు ఎందరో వ్యక్తులు, ఎన్నో పుస్తకాలు చెప్పిన విషయాలను త్రోసిరాజు అంటున్నాను ముందు; ఎందుకంటే, ప్రేమ అంటే యేమిటో నా అంతట నేను తెలుసుకోవాలని ప్రయత్నం. మానవాళి అంతటినీ సమాశ్రయించుకుని వున్న సమస్య యిది. దానికి అనేక వేల నిర్వచనాలు వున్నాయి. నేనూ ఒకదానిలో చిక్కుకుపోయి, నాకు యిష్టమయినది అనుకూలమయినదానితో ముడుచుకు కూర్చుంటే - దానిని చక్కగా అర్థం చేసుకోలేను. ముందు నేను నా

ఊహలు, అపోహల నుండి విడివడాలి. నాకు గందరగోళంగా వుంది; నా కోరికలు నన్ను ముక్కలు చెక్కలు చేస్తున్నాయి. అందుచేత నేను యేమంటున్నానంటే – 'ముందు ఈ గందరగోళాన్ని తొలగించుకో. ప్రేమంటే యేది కాదో తెలుసుకోవడం ద్వారా, ప్రేమంటే యేమిటో తెలుసుకునే ఉపాయం వున్నదేమో!'

ప్రభుత్వం అంటూంది: 'వెళ్లు, నీ దేశంకోసం ముందడుగు వేసి వాళ్లను చంపి రా.' అదేనా ప్రేమ అంటే? మతం యేమంటూంది: 'భగంతునిపైని ప్రేమ వుంటే లైంగిక వ్యవహారాలు మానివేయి.' అదేనా ప్రేమ? ప్రేమ అంటే కామనా? కాదని జవాబు చెప్పకండి. మనలో చాలామందికి యిది యింతే. సుఖంకోసం లాలస, ఇంద్రియాలద్వారా సాధించే సుఖ సంపద; లైంగిక ప్రవృత్తిద్వారా పొందే సుఖం. నాకు లైంగిక వృత్తులంటే వ్యతిరేకత లేదు. కాని, దానిలో యిమిడివున్నదంతా గమనించండి అంటాను. క్షణికంగా లైంగిక ప్రవృత్తి మీకు యేం యిస్తున్నది? – మిమ్మల్ని మీరు ఆ క్షణంలో మరిచిపోగలుగుతున్నారు. తరువాత మళ్ళీ యధా ప్రకారమే. మీ కష్టాలు, బాధలు వుండనే వున్నాయి. అందుచేత లైంగికానుభవం పదేపదే పొందాలనుకుంటారు. అప్పుడు యే బెంగ, యే సమస్య, యే స్వయం రూపం లేదు. మీకు భార్యంటే ప్రేమ అని చెబుతారు. ఆ ప్రేమలో లైంగిక సుఖం యిమిడిపోయి వున్నది. ఇల్లు చూచుకోవటానికి, యింట్లో పిల్లల పెంపకానికి, వంట చేయడానికి ఓ మనిషి కావాలి. ఆమె మీద మీరు ఆధారపడతారు. మీకు ఆమె శరీరాన్ని అప్పజెప్పుతుంది. ఆమె రాగభావాలను, ప్రోత్సాహాలను, భద్రతను, సంక్షేమాన్ని మీకు సమర్పణ చేస్తుంది. తరువాత యిదంతా విసుగు అనిపించి మీనుంచి దూరంగా వెళ్లిపోతుంది. మరెవరితోనో వెళ్లిపోతుంది. మీ భావరాగ ప్రపంచమంతా అతలాకుతలం అయిపోతుంది. ఈ గందరగోళంలో – దీనిపట్ల మీకు తీవ్ర అయిష్టత వున్నది – ఈర్ష్య పుట్టుకువస్తుంది. దీనిలో బాధ వుంది, ఆదుర్దా, అసహ్యం, దౌర్జన్యం వున్నాయి. ఇప్పుడు మీరు చెబుతూ వున్నది యేమిటంటే, 'నీవు నా దానివి అయినంతవరకు నిన్ను ప్రేమిస్తాను. నానుండి వైదొలగిన క్షణం నుంచి నిన్ను అసహ్యించుకోవడం ఆరంభిస్తాను. నా కామనలకు తృప్తులకు నీవు సమాధానం చెబుతూన్నంతవరకు సరే. నీవు నాకు తగిన రాగభావాలు అందించనప్పుడు, నీకూ నాకూ సంబంధం లేదు.' ఇప్పుడు మీ మధ్య ద్వేషం వచ్చింది. వేర్పాటు. ఇతరులనుంచి మీరు వేరయిపోయినప్పుడు – ప్రేమకు ఆస్కారంలేదు. భావ సంచలనం యిటువంటి మార్పులను తీసుకురావలసిన అవసరం లేకుండా మీరు మీ భార్యతో సజావుగా వుండగలిగినప్పుడు – పోరాటాలు, విరుద్ధ భావ ప్రకటనలు అంతరించినప్పుడు – అప్పుడు బహుశ ప్రేమ అంటే యేమిటో మీకు తెలిసివస్తుంది. అప్పుడు మీరు పూర్తిగా స్వేచ్ఛ కలవారు. ఆమే అంతే. అలా కాకుండా మీ సుఖాల కోసం ఆమెపైన ఆధారపడివుంటే ఆమెకు బానిస అయిపోయినారన్నమాట!

ప్రేమ వున్నచోట స్వేచ్ఛ వుండాలి. అవతలి మనిషి నుంచి స్వేచ్ఛ కాదు; తననుంచే తనకు స్వేచ్ఛ అవసరం.

ఇలా యితరులకు చెందడం, యితరులు మన మానసిక పరిస్థితులను చక్కదిద్దడం,

వారిపై నిరంతరం ఆధారపడి వుండడం – వీటన్నిటిలోనూ ఎంతో ఆదుర్దా, భయం, అసూయ, పాపచింతన – వున్నాయి. భయం వున్నచోట ప్రేమ వుండదు. లాంఛన ప్రవృత్తి, రాగయుక్తత – వీటికి ప్రేమతో యేమీ ప్రమేయం లేదు.

కనుక ప్రేమకు సుఖానికి – కోరికకు యెలాంటి సంబంధమూ లేదు.

ప్రేమ అనేది గతానికి సంబంధించిన భావనలోంచి పుట్టుకు వచ్చేది కాదు. భావన ప్రేమను తయారు చేయలేదు. ప్రేమ ఈర్ష్యాసూయలలో నెగ్గుకు రాలేదు. అవి గతానికి చెందినవి. ప్రేమ ఎప్పుడూ వర్తమానంలోనిదే; ప్రస్తుతంలోనే చురుకుగా వుండేది. 'నేను ప్రేమిస్తాను', లేక 'యిదివరకు ప్రేమించాను' అనేది కాదు ప్రస్తావన. ప్రేమ అంటే యేమో తెలిస్తే మనం యితరులను అనుసరించము. ప్రేమ విధేయత కనబరచదు. ప్రేమించినప్పుడు గౌరవ మర్యాదలు, అగౌరవ అమర్యాదలూ వుండవు.

ఎవరినయినా ప్రేమించడం అంటే ఏమిటో మీకు తెలుసునా? అసహ్యం లేకుండా, అసూయ లేకుండా, కోపం లేకుండా, కోరికలు – జోక్యం లేకుండా, అవతలి మనిషి యేం చేస్తున్నాడు అన్న ప్రసక్తే లేకుండా – ప్రేమించడం అంటే యేమో మీరు యెరుగుదురా? ప్రేమ వున్నచోట పోల్చి చూచుకోవడం వుంటుందా? మీ హృదయమంతటితోనూ మీరు యెవరినయినా ప్రేమించినప్పుడు, త్రికరణశుద్ధిగా సంపూర్ణంగా ప్రేమించినప్పుడు – సరిపోల్చి చూచుకోవడం అనే ప్రసక్తి వుంటుందా? మీరు ఆ ప్రేమకు అంకితం అయిపోయినప్పుడు, మరో ప్రసక్తి వుండదు.

ప్రేమకు బాధ్యత, కర్తవ్యము వుంటాయా? అది ఈ మాటలను ఉపయోగిస్తుందా? ఏదో కర్తవ్య పాలనగా చేసే పనులలో ప్రేమ అనేది వుంటుందా? ఉండదు. మనిషి యిరుక్కుపోయిన కర్తవ్యపాలన అనే చట్రంలో అతను నాశనమయిపోతున్నాడు. మీ విధి, మీకు విధాయకం కనుక ఒక పని చేస్తున్నారూ అంటే – ఆ చేస్తున్న పనిపట్ల మీకు ప్రేమ లేదన్నమాట. ప్రేమ వున్నచోట – విధి, కర్తవ్యం, నిర్వహణ, బాధ్యత అనేవి వుండవు.

చాలమంది తల్లిదండ్రులు తాము తమ పిల్లలకు బాధ్యులం అనుకుంటారు. ఈ బాధ్యత ఎంతవరకు వెడుతుందంటే, పిల్లలు యేం చేయాలో యేం చేయకూడదో యేమిగా రూపొందాలో యేమి అవగూడదో గూడా వాళ్లే నిర్ణయిస్తారు. పిల్లలకు సంఘంలో సుస్థిరమైన స్థానం యేర్పడాలని తల్లిదండ్రుల ఆపేక్ష, బాధ్యత అంటే వాళ్ల దృష్టిలో, యీ లాంఛన మర్యాదలలో యిమిడిపోయిన విషయమే. లాంఛన పూర్వక గౌరవ మర్యాదలు వున్న చోట ప్రేమకు స్థానం లేదని నా భావం. అక్కడ క్రమత లేదు. ఏదో మూసలో పోసినట్లు తయారవాలనే అవసరమే అక్కడ పనిచేస్తోంది. తల్లిదండ్రులు తమ పిల్లలను సంఘంలో యిముడ్చుకుందుకు ప్రయత్నిస్తున్నారూ అంటే – యుద్ధానికి తలపడుతున్నారనీ, సంఘర్షణ, క్రౌర్యమూ అక్కడ చోటు చేసుకుంటాయని అనిపిస్తుంది.

నిజంగా పోషణ భారం వహించడం అంటే యేదో చెట్టును సాకినట్లు; దానికి అవసరం అయిన నీళ్లు పోస్తూ – దాని అవసరాలు గమనిస్తూ – ఎరువులు

వేస్తూ – మర్యాదగా లలితంగా దానిని ఎదగనివ్వడం. అయితే, మీరు మీ పిల్లలను సంఘంలో తగిన స్థానాలలో కూర్చటానికి ప్రయత్నిస్తున్నారు – అంటే వాళ్లను హతమార్చటానికి చూస్తున్నారన్నమాట! మీకు నిజంగా పిల్లలపట్ల ప్రేమ వున్నట్లయితే, యుద్ధాలు అనేవే వుండవు.

మీకు ప్రియులయిన వారు యెవరయినా పోయినప్పుడు మీరు కన్నీళ్లు పెట్టుకుంటారు. ఆ కన్నీళ్లు మీ కోసమా లేక చనిపోయినవారి కోసమా? మీ కోసమే మీరు యేడుస్తున్నారా? – యితరుల కోసమా? ఇతరుల కోసం యెప్పుడయినా యేడ్చారా? యుద్ధక్షేత్రంలో చనిపోయిన మీ కుమారుని కోసం యేడ్చారా? ఈ యేడుపు అంతా మీరు యేదో కోల్పోయారన్న భావంతోనో లేక ఒక మనిషి చనిపోయినాడే అనే చింతవల్లనా? మీ కోసం మీరు యేడ్చినట్లయితే దానిలో అర్థం లేదు. మీరు ఆప్యాయత కురిపిస్తున్న ఒక మనిషి పోయినాడు గనుక మీరు యేడుస్తున్నారూ అంటే – నిజంగా అలాంటి ఆప్యాయత లేనేలేదు అన్నమాట! చనిపోయిన మీ తమ్మునికోసం – అతని కోసమే – యేడవండి. అతను పోయాడు గనుక మీ కోసం మీరు యేడవడం చాల తేలిక. మీ హృదయం స్పందించింది గనుక మీరు యేడుస్తున్నారు. కాని, అతని కోసం కాదు యీ స్పందన. మీమీద మీకు జాలి, అనుకంప. దీనితో మీరు కరుడు కట్టుకుపోతున్నారు, తలముక్కలు అవుతున్నారు, దీనివల్లనే మొద్దుబారి బద్ధకస్తులయిపోతున్నారు.

మీకోసం మీరు విలపిస్తూ వున్నట్లయితే అది ప్రేమ అవుతుందా? మీరు వంటరివారయినారు గనుక, అశక్తులయిపోయారు. కనుక, మీ పరిస్థితి విచారకరం అయిపోయింది గనుక – యీ విలాపం కొనసాగుతూ వున్నదా? మీకు యీ విషయం అర్థం అయితే – ఒక చెట్టునో స్తంభాన్నో ప్రత్యక్షంగా తట్టిచూచినంత స్ఫుటంగా తెలిసివస్తే – అప్పుడు యీ విచారమంతా స్వయంకృతమయినదేననిపిస్తుంది. భావనవల్లనే విచారం యేర్పడుతోంది. కాల ప్రవాహంలో విచారం జనిస్తోంది. నాకు మూడేళ్లక్రితం ఒక తమ్ముడు వుండేవాడు, యిప్పుడు అతను చనిపోయాడు, యిప్పుడు నేను వంటివాడినయిపోయాను; ఊరటకోసం, స్నేహం కోసం ఎవరివయిపు ఒరగలేను. అందుచేత నాకు దుఃఖం ముంచుకువస్తోంది.

మీరు గమనించగలిగితే, యిదంతా మీ అంతరంగంలో కదలాడడం చూడగలుగు తారు. పూర్తిగా సంపూర్ణంగా చూడగలరు. ఒక్క వీక్షణంలోనే. దానికోసం సమయం వెచ్చించకండి. 'నేను, నా కన్నీళ్లు, నా కుటుంబం , నా జాతి, నా నమ్మకాలు, నా మతం' – – యిలాంటి అస్తవ్యస్తమయిన సమాచారం అంతా దాని స్వరూప స్వభావాలు – – అన్నీ ఒక్క క్షణంలో, మీ అంతరంగంలో దర్శించుకో గలుగుతారు. మీ మనసుతో కాక, హృదయంతో దానిని చూడగలిగినప్పుడు – హృదయపు లోతులలో నుంచి చూడగలిగితే – అప్పుడు మీకు దుఃఖాన్ని, విచారాన్ని అంతమొందించగల తాళపుచెవి దొరుకుతుంది.

దుఃఖము, ప్రేమ ఒక వరలో యిమడవు. కొన్ని మత సంప్రదాయాలలో బాధలు పడటాన్ని ఆదర్శవంతంగా రూపించి చూపారు. దానిని ఆరాధించారు. అంటే, యీ

బాధలనుంచి మీరు ఎన్నటికీ తప్పించుకుపోలేరని, అలా తప్పించుకుందుకు సంఘం పరిస్థితులను యెలా దుర్వినియోగపరుస్తోందో తెలుస్తోంది. ఎలా దోచుకుంటూందో అవగతం అవుతుంది.

ప్రేమంటే యేమిటి అని అడిగినప్పుడు, జవాబు కనుగొనడానికి మీకు భయం అనిపించవచ్చును. అది పూర్తిగా మిమ్మల్ని మీరు తలక్రిందులు చేసుకోవడం కావచ్చును. కుటుంబాన్ని అది ముక్కలు చేయవచ్చును. మీ భార్యనో, భర్తనో కుటుంబాన్నో మీరు ప్రేమించడం లేదని గమనానికి రావచ్చును. అవునా? – మీరు నిర్మించుకున్న యింటిని మీరే బద్దలు కొట్టుకోవలసి రావచ్చును. తిరిగి దేవాలయానికి మళ్లీ వెళ్లవలసి రాకపోవచ్చును.

ఇంకా మీరు పరిశీలించి చూడదలుచుకుంటే, భయం ప్రేమకాదని తెలుస్తుంది. పరాధీనత ప్రేమకాదు. అసూయ ప్రేమ కాదు. ఆధిపత్యం, ప్రవృత్తులు ప్రేమకాదు. బాధ్యత, బరువు, విధి, ప్రేమకాదు. అనుకంప ప్రేమకాదు. ప్రేమింపబడకపోవడంలోని బాధ ప్రేమకాదు. అసహ్యానికి వ్యతిరేక భావంకాదు. ప్రేమ అంటే; వినయం – అత్యాశ ఒకదానికి ఒకటి వ్యతిరేక పదాలు కానట్లుగానే. కనుక, వీటన్నిటినీ త్రోసిరాజు అనగలిగితే, బలవంతాన నెట్టివేయడం కాకుండా జాగ్రత్తగా కడిగివేయడం చేయగలిగితే, – ఒక ఆకుపైన అనేక సంవత్సరాలుగా పడిన ధూళిని తుడిచి శుభ్రం చేసినట్లు – అప్పుడు మానవుడు అనేక యేళ్లుగా ఆత్రంగా ఎదురు చూస్తున్న యీ పుష్పం మీకు దర్శనమిస్తుంది.

మీకు ప్రేమ అనేది లేకపోతే యేదో ఒకటి రెండు చుక్కలు కాదు, పుష్కలంగా – మీరు దానిలో తడిసి ముద్ద అయిపోకపోతే – ప్రపంచం విలయంతో కొట్టుకుపోతుంది. మానవాళి అంతా ఒక్కటిగా వుండడం అత్యవసరం అనీ, దానికి ప్రేమ ఒక్కటే మార్గమనీ మీకందరికీ మాటమాత్రంగా తెలుసును. కాని ప్రేమించడం ఎలానో మీకు ఎవరు నేర్పుతారు? ఆధిపత్యం, పద్ధతి, ప్రక్రియ – యివన్నీ ప్రేమను నేర్పుతాయా? ఎవరయినా నేర్పేట్లయితే అది ప్రేమకాదు. 'నేను ప్రేమను అభ్యసిస్తాను. రోజుల తరబడి తీరికూర్చుని దానిని గురించి ఆలోచిస్తాను. దయగా ఉదారంగా వుండడం సాధన చేస్తాను. ఇతరులను గమనించడం బలవంతంగా అలవరచుకుంటాను,' అంటారా? ప్రేమ అనేదానిని సాధనద్వారా, అభ్యాసాల వల్ల నేర్చుకోగలరా? క్రమశిక్షణకు లోను చేశారంటే ప్రేమకాస్తా కిటికీలోనుంచి తుర్రుమని పారిపోతుంది. ఏదో ఒక పద్ధతిని విధానాన్ని అవలంబించడం వల్ల మీరు మరింత తెలివిగలవారు కావచ్చును, దయాగుణం పెరగవచ్చును, హింసా ప్రవృత్తి నశించవచ్చును, – – కాని, యివన్నీ ప్రేమను మటుకు పెంచలేవు.

ఎడారివంటి ఈ ప్రపంచంలో సుఖము, కోరిక జీవితాలలో ఎక్కువ పాత్రవహిస్తున్నాయి గనుక ప్రేమ లుప్తమయిపోతోంది. అయితే, ప్రేమలేకుండా నిత్యజీవితం అర్థరహితమయి పోతుంది. సౌందర్యం లేకపోతే ప్రేమ మనజాలదు. సౌందర్యం అంటే మన కళ్లతో చూచేది కాదు – ఓ సుందరమయిన వృక్షం, సుందర చిత్రం, కట్టడం – లేక అందమయిన ఆడమనిషి కాదు. మీ హృదయానికీ, మనసుకూ ప్రేమ అంటే యేమిటో తెలిసినప్పుడే సుందరత స్థావరించుకుంటుంది.

ప్రేమ, ఆ రకమయిన సౌందర్య భావన లేకుండా సుగుణమనేదే లేదు. మీరు ఎన్ని పనులయినా చేయండి – సంఘాన్ని ఉద్ధరించడం, బీదలకు అన్నదానం చేయడం – జీవితంలో అల్లరిని పెంపొందించినవారు అవుతారే తప్ప మరేమీకాదు. ప్రేమలేకపోతే మీ హృదయాలలో వికారము, మీ మనసులలో బీదరికము తప్ప యింకేమీ వుండదు. ప్రేమ, సౌందర్యం వున్నప్పుడు మీరు యేం చేసినా అదంతా సక్రమంగానే వుంటుంది. అంతా సజావుగానే వుంటుంది. ప్రేమించడం ఎలానో తెలిస్తే, మీరు యేం చేయదలుచుకున్నా నిరాక్షేపణగా చేయవచ్చును. ఎందుకంటే, అది అన్ని సమస్యలను తీర్మానం చేసివేస్తుంది.

ఒక అంగీకారానికి వచ్చాం: క్రమశిక్షణ, భావన, బలవంతం, పుస్తకాపేక్ష, గురువో నాయకుడో లేకుండా మనసు ప్రేమను సాక్షాత్కరింపచేసుకోగలదా? అందమయిన సూర్యాస్తమయాన్ని చూచినట్లుగా దానినీ దర్శించగలదా?

ఒక విషయం అత్యంత ముఖ్యమయినదిగా అగుపిస్తోంది నాకు. ఎలాంటి ఉద్దేశ్యాలు, ముందు తూచిపెట్టుకున్న ఆలోచనలు లేకుండా ఉద్వేగం అవసరం. ఏదో నిబద్ధతకు – బంధానికి ఫలితంగా యేర్పడే ఉద్వేగం కాదు. కామపూరితం, మోహయుతం అయిన ఉద్వేగం కాదు. ఇలాంటి ఉద్వేగాన్ని ఎరగనివాడు ప్రేమస్వరూపాన్ని గ్రహించలేడు – తనను తాను సంపూర్ణంగా పరిత్యజించడం జరిగితేతప్ప ప్రేమ అవతరించదు.

ఏదో అన్వేషిస్తూ వున్న మనసు ఉద్వేగయుతమయినది కాదు. వెదకకుండా ప్రేమను అవతరింపచేసుకోవడమే దానిని కనుగొనేందుకు మార్గం. తెలుసుకోకుండా – అప్రయత్నంగా – అనుభవరహితంగా ప్రేమను ముందుకు తెచ్చుకోగలగాలి. ఈ ప్రేమ కాలానికి లోబడినదికాదు. అలాంటి ప్రేమ వ్యక్తిగతమైనది అవును, కాదు కూడా. అది యేకము, అనేకము కూడా. సుగంధాలను వెదజల్లే పుష్పం మాదిరి – మీరు దానిని ఆఘ్రాణించవచ్చును. లేదా, గమనించకుండా పక్కనే పోవచ్చును. ఆ పుష్పం అందరి కోసమూ, ప్రగాఢంగా సువాసన పీల్చి, దానివంక సంతోషంగా చూడగల వారికోసమే అది. ఉద్యానవనంలోనే ఉన్నా, దూరంగా వున్నా ఆ పువ్వుకు ఒక్కటే. ఎందుకంటే, దానినిండా సౌరభం గుబాళించి వుంది. దాన్ని అందరితోనూ పంచుకుంటూంది.

ప్రేమ నూతనం, తాజా, సజీవమూను. దానికి నిన్న, రేపు లేవు. భావన గుంజాటనలకు అతీతం అది. అమాయక మనసు మటుకే ప్రేమ అంటే యేమో తెలుసుకొంటుంది. అమాయక మనసు అమాయక ప్రపంచంలోనే మనగలుగుతుంది. ఈ అసాధారణమైన దానిని కనుగొనేందుకు మనిషి ఎన్నో త్యాగాలు, పూజలు, సంబంధాలు, లైంగిక వృత్తులు, రకరకాల సుఖ దుఃఖాలు అనుభవించాడు, గడిచాడు. భావన తనను తాను అర్థం చేసుకుని సహజంగా అంతమయిపోయినప్పుడే యిది సాధ్యం. అప్పుడు ప్రేమకు వ్యతిరేకత వుండదు; ప్రేమకు సంఘర్షణ వుండదు.

మీరు అడగవచ్చును: 'నాకు అటువంటి ప్రేమ లభ్యం అయితే – అప్పుడు నా భార్య పిల్లలు కుటుంబమూ అంతా యేమయిపోతారు? వాళ్లకేదో భద్రత యేర్పాటుచేయాలి గదా!' మీరు అలాంటి ప్రశ్న వేశారంటే భావన ప్రపంచంనుండి

దూరంగా పోనే పోలేదన్నమాట. ప్రజ్ఞాక్షేత్రంనుండి అధిగమించలేదన్నమాట. ఒక్కమారు ఆ క్షేత్రానికి ఆవలగా వెళ్లితే, తిరిగి అటువంటి ప్రశ్న వేయరు. ఎందుకంటే ప్రేమంటే యేమిటో – దానిలో భావనకు సమయానికి అతీతంగా పోవటానికి – దుఃఖానికి ఆవలి తీరానికి చేరటానికి – ప్రేమ అనే మరో అంతస్తువున్న ప్రాంగణం గురించి తెలుసుకుని వుండడం అవసరం.

అయినా, ఈ అసాధారణ ప్రాంగణానికి చేరుకోవడం ఎలానో మీకు తెలియదు. అందుచేత ఏం చేస్తారు? ఏం చేయాలో తెలియనప్పుడు యేమీ చేయకుండా వుండిపోతారు, కదూ? ఏమీ చేయరు. అప్పుడు ఆంతరంగికంగా మీరు పూర్తిగా మౌనంగా వున్నారు. దాని అర్థం యేమిటో తెలుసునా? దాని అర్థం మీరు యేమీ అన్వేషించడం లేదనీ, కోరుకోవడం లేదనీ, ఆపేక్షించడం లేదనీ; మీలో కేంద్రం అంటూ లేదనీ. అప్పుడే అక్కడ ప్రేమ ఉంటుంది.

★ ★ ★

# 11

## అవలోకనం, మెలుకువగా వినడం - కళ - అందం - క్లుప్తత - ప్రతీకలు - సమస్యలు - నిరాకరణ.

ప్రేమ యొక్క స్వభావాన్ని పరిశీలిస్తూ ఒక ప్రధాన ఘట్టానికి చేరుకున్నాము. ఇప్పుడు యింకా లోనికి చొచ్చుకుపోవడం అవసరం. మరింత ఎఱుకతో ముందుకుపోవాలి. చాలమందికి ప్రేమ అంటే సౌకర్యం మాత్రమేనని కనిపెట్టాం. భద్రత, జీవితాంతం ఒకరకమయిన భావోద్వేగ పరిరక్షణ – తృప్తి అనుకున్నాం. అటువంటి స్థితిలో నాబోటి వాడు ఎవడో వచ్చి 'యిది నిజంగా ప్రేమేనా?' అని అడుగుతాడు. మీలోకి మీరు చూచుకోండి అంటాడు. మీరు అలా చూడటానికి ప్రయత్నించరు. ఎందుకంటే, ఆ ప్రయత్నం యెంతో గందరగోళాన్ని తీసుకు వస్తుంది. ఆత్మను గురించి రాజకీయ ఆర్థిక పరిణామాలను గురించి చర్చించుకుంటూ వుండడం చాల క్షేమకరమయిన పనిగా తోస్తుంది. కాని, అలా చూడడం తప్పనిసరి అయినప్పుడు మీకు స్పష్టంగా తెలిసివచ్చేది యేమంటే, యిన్నాళ్లు ప్రేమ అనుకుంటున్నది, ప్రేమ కాదని, అది కేవలం పరస్పర అంగీకారం – అనురక్తి – దోపిడి అని తెలిసివస్తుంది.

'ప్రేమకు నిన్న, రేపు అనేవి లేవు' అనీ 'కేంద్రం వున్నచోట ప్రేమ వుండద'నీ నేను అన్నప్పుడు ఆ మాటలు నాకు యదార్థం; కాని మీకు కావు. మీరు యీ మాటలను ఉటంకించవచ్చును. దీన్నో సూత్రం చేయవచ్చును – దానివల్ల యేమాత్రం ప్రయోజనం లేదు. దీన్ని మీ అంతట మీరు చూడాలి. అలా చూడటానికి స్వేచ్ఛ అంటూ వుండాలి. అన్ని ఖండనలు, సమర్థనలు, తీర్పుల అంగీకార అనంగీకారాల నుంచి స్వేచ్ఛ వుండాలి.

జీవితంలో అమిత కష్టమయిన పని చూడడము, వినడమూను. నిజానికి యీ రెండూ – చూడడము, వినడము – ఒక్కటే. వేదనలతో మీ కళ్లు మూసుకుపోతే మీకు సూర్యాస్తమయ సౌందర్యం కనిపించదు. మనలో చాల మందికి ప్రకృతితో సంపర్కం అంతరించింది. నాగరకత మనను మహానగరాలకు తరలిపోయేట్లు చేస్తోంది. అంతకంతకూ నగరవాసులం అయిపోతున్నాం. జనసందోహం నిండిపోయిన తావులలో వుండిపోతాం. సూర్యాస్తమయం కాని, ప్రాతఃసమయం గానీ ఆకాశం వంక చూడగల అవకాశం లేదు. అందువల్ల జీవితంలో సౌందర్య దర్శనం అనేది మనకు లోపిస్తుంది. మీలో ఎంతమంది గమనించారో నాకయితే తెలియదుగాని చాలమందికి సూర్యోదయం, సూర్యాస్తమయం, చంద్రకాంతి, నదీజలాలపై కాంతి ప్రసరించడం అనేవే తెలియవు.

ప్రకృతితో సంపర్కం అంతరించిపోయిన మీదట, మానసిక అభివృద్ధి కోసం వెంపర్లాడుతాం. ఎన్నో పుస్తకాలు చదువుతాం; మ్యూజియంలకు, సభాసమావేశాలకు వెడతాం; టెలివిజన్ చూస్తాం; యింకా యిలాంటి వినోద కార్యక్రమాలలో మునిగి పోతాం. ఇతరుల అభిప్రాయాల పరంపరలనుంచి విరివిగా ఉటంకిస్తాం; కళను గురించి అదేపనిగా ఆలోచిస్తాం, చర్చిస్తాం. మనం ఎందుకు అంతగా కళపైన ఆధారపడి వుంటున్నాం? అదో రకమయిన పలాయనమా లేక ఉత్తేజ స్ఫోరకమా? ప్రకృతితో ప్రత్యక్ష సంబంధం వుంటే, రెక్కలతో పరుగెత్తుతున్న పక్షులను గమనిస్తూ వుంటే, ఆకాశంలోని రకరకాల రంగులను చూస్తూ వుంటే, పర్వతాలమీది నీడలు పరీక్షిస్తూంటే, యింకెవరి ముఖంలోనో వున్న అందాన్ని చూస్తుంటే – అప్పుడు కూడా యేదో మ్యూజియంకు, వెళ్లాలని బొమ్మలు చూడాలని అనిపిస్తుందా? మనచుట్టూవున్న యీ అనేక వస్తు సంచయాన్ని చూడడం ఎలానో తెలియదు గనుక దానిస్థానే యే మందో మాకో తీసుకోవాలని మరింత తీవ్రంగా చూడగలగాలని అనుకుంటున్నాం.

ఓ మతగురువు వుండేవాడు. ప్రతిరోజూ శిష్యులకు ప్రవచనం చేసేవాడు. ఒక రోజు వేదిక మీదకు ఎక్కి యేదో చెప్పబోయాడు. ఇంతలో ఓ చిన్న పిట్ట వచ్చి కిటికీ రెక్కమీద కూర్చుని పాడసాగింది. హృదయం పూర్తిగా రంగరించి పాడింది. అది ఆపి ఎగిరిపోయినప్పుడు గురువు అన్నాడు: 'ఈ రోజుకు ప్రవచనం అయిపోయింది,' అని.

మనకు వున్న గొప్ప కష్టం యేమిటంటే, మనను మనం స్పష్టంగా చూచుకోగలగడం; పైపై సంగతులనుకాక అంతరంగికంగా స్పష్టంగా చూచుకోవడం. ఏ చెట్టునో, పూవునో, మనిషినో చూచాం అంటాము – కాని, దానిని నిజంగా చూచామని చెప్పగలమా? లేక, మాట సృష్టించిన రూపాన్ని మటుకే చూస్తున్నామా? అంటే ఒక మేఘం వంక చూస్తున్నప్పుడు, చెట్టును తిలకిస్తున్నప్పుడు సాయంసంధ్య సరాగాలను సందర్శిస్తున్నప్పుడు – దానిని యధాతధంగా చూస్తున్నామా లేక కేవలం కళ్లతోనే మానసికంగానే కాకుండా పూర్తిగా, సంపూర్ణంగా చూస్తున్నామా? చెట్టువంటి ఒక వస్తువును చూస్తున్నప్పుడు వేరే యేవో తోడు అయిన భావాలతో దానిని గురించి యిదివరకే తెలిసివున్న జ్ఞానంతో కాక, యే అభిప్రాయము – తీర్పు చెట్టుకు మీకు మధ్య ఏవో పొరలు యేర్పడి అసలు వస్తువును కనిపించనీయకుండా చేయని స్థితిలో చూడగలుగుతున్నామా? ఒకమారు ప్రయత్నించి చూడండి. మీ అస్తిత్వం అంతటితోను గమనించండి. మీ శక్తి అంతా వినియోగించి చూడండి. అప్పుడు యేమవుతుందో గమనించండి. ఆ తీవ్రతతో పరిశీలకుడు అంటూ వేరుగా ఒకడు వుండడు అని అనుభవానికి వస్తుంది. పరిశీలన, గమనం అనేదే వుంటుంది. అజాగరూకత గమనం వున్నప్పుడు పరిశీలకుడు, పరిశీలన వస్తువు అన్నవి వేరు వేరుగా వుంటాయి. పరిపూర్ణ గమనంతో ఒక వస్తువును చూస్తున్నప్పుడు, మధ్యలో దూరటానికి విరామం లేదు. జాగా లేదు. ఓ సూత్రం, జ్ఞాపకం ఉత్పన్నం కాదు. ఈ విషయం అర్థం చేసుకోవడం చాల అవసరం. ఎందుకంటే, యింకా

తీవ్రతరంగా అన్వేషించి తెలుసుకోవలసిన విషయాలవైపు వెళ్లబోతున్నాం మనం.

మనసు పరిపూర్ణ విసర్జన భావంతో, అనాసక్తంగా ఓ చెట్టువంక, నక్షత్రాల వంక, నదీజలాల వంక చూచినప్పుడే సౌందర్యం అంటే యేమిటో తెలిసి వస్తుంది. అలా చూస్తున్నప్పుడు ప్రేమ అంతస్తులో వున్నాం. సౌందర్యాన్ని మనం పరిపోల్చి చూచుకోవటానికే అలవాటు పడివున్నాం. మనిషి పోగుచేసి కలిపి చూపిన దానిలోనే సౌందర్యం వున్నదనుకుంటాం. ఫలాన వస్తువు అందంగా వుందంటాం. ఒక అందమయిన బంగళా చూస్తాను. నాకున్న భవన నిర్మాణ శాస్త్ర పరిజ్ఞానం దృష్ట్యా అది అందమయినదని భావిస్తాను. నేను చూచిన యితర భవంతులతో దానిని పోల్చి చూచుకుంటాను. కాని, యిప్పుడు అడుగుతున్నది యేమంటే – 'వస్తువును ఆశ్రయించుకోకుండా అందం అనేది వున్నదా?' అని. పరిశీలకుడు అంటూ ఒకడు వుండి, అతడు మధ్యవర్తిగా – అనుభూతిపరుడుగా ఆలోచించేవాడుగా ప్రవర్తిస్తున్నంతసేపూ సౌందర్యం అంటూ యేమీలేదు. ఎందుకంటే, సౌందర్యం బాహ్యామైనది, పరిశీలకుడు చూచి తీర్మానించుకునేది. పరిశీలకుడు అంటూ ఒకడు లేనప్పుడు – దీనికి అద్భుతమయిన ధ్యానం అవసరం, లోచూపు అవసరం – అప్పుడు వస్తువుతో ప్రమేయం లేకుండానే సౌందర్యం వుంటుంది.

పరిశీలకుడు, పరిశీలన వస్తువు అన్న వస్తువుల విసర్జనం వల్లనే సౌందర్యం ఉత్పన్నమవుతోంది. పరిపూర్ణ సంయమం వున్నప్పుడే యిటువంటి విసర్జనం సాధ్యమవుతుంది. సంయమం అంటే పురోహితుడు తన గట్టి మాటలతో విధించేది కాదు. నియామకాలు, విధేయతలు, వరప్రసాదాలతో నిమిత్తం వున్నది కాదు. బట్టలలో, అభిప్రాయాలలో, ఆహార విహారాలలో కనిపించే సంయమనం కాదు. పూర్తి వినయానికి ప్రతీక అయిన సంయమం. అప్పుడు యేదో సాధించామన్న భావం లేదు, ఎక్కవలిసిన నిచ్చెన లేదు, ఉన్నది ఒక్కటే మెట్టు. ఆ మెట్టే ఎప్పటికీ నిలిచివుండే మెట్టు అవుతుంది.

మీరు యెవరితోనో కలిసో లేక వంటరిగానో నడిచి వెడుతున్నారు. మీరు సంభాషణ నిలిపి వేశారు. మీ చుట్టూ ప్రకృతి వున్నది. ఓ కుక్క మొరుగుడు గాని, కారు వెడుతున్న చప్పుడుగాని, పక్షుల కలకలంగానీ లేదు. మీరు పూర్తిగా మౌనంగా వున్నారు, మీ చుట్టూ వున్న ప్రకృతి గూడా మౌనంగానే వుంది. ఆ రకమయిన మౌనం – నిశ్శబ్ద స్థితిలో – పరిశీలకుడు, పరిశీలన వస్తువులలో – పరిశీలకుడు తన పరిశీలనము భావాలలోనికి ప్రసరించనప్పుడు – ఆ నిశ్శబ్దంలో వేరే విధమయిన సౌందర్యం వుంటుంది. ప్రకృతి గానీ పరిశీలకుడు గానీ లేరు. పరిపూర్ణమైన మానసిక స్థితి, పూర్తిగా ఒంటరిగా వుంది. ఆ నిశ్చలతే సౌందర్యం. మీరు ప్రేమించినప్పుడు పరిశీలకుడు వున్నాడా? ప్రేమ కామనగానో సుఖంగానో రూపొందినప్పుడు మటుకే పరిశీలకుడు వేరుగా వున్నాడు. కామన, సుఖము ప్రేమతో అంటిపెట్టుకు వుండనప్పుడు ప్రేమ తీవ్రతరంగా వుంటుంది. అది, సౌందర్యంలాగానే, అనుదినము నూతనమయినది. ముందుగా చెప్పినట్లు దానికి నిన్న, రేపు అనేవి లేవు.

ముందు చేసుకున్న నిర్ణయాలు లేకుండా, రూపకల్పనలు లేకుండా వుంటేనే

జీవితంలో దేనితోనయినా ప్రత్యక్ష సంబంధం యేర్పరుచుకోగలుగుతాము. మన సంబంధాలన్నీ ఊహా కల్పనలే. అంటే, మన భావన కల్పించిన రూపాల మీదనే ఆధారపడివుంటాయి. నన్ను గురించి మీకు, మిమ్మల్ని గురించి నాకు కల్పితరూపం వుంటే – యిక మన మిద్దరం యధాతథంగా కలుసుకోవడమనేది కుదరదు. మనం కలుసుకుంటున్నది, చూస్తున్నది యితరులను గురించి మనం కల్పించుకున్న రూపాలే. అందుచేతనే మన అసలు స్వరూపాలు సంపర్కంలోనికి రావడమేలేదు; అందువల్లనే మన సంబంధాలన్నీ తప్పుదారి పడుతున్నాయి.

నేను మిమ్మల్ని యెరుగుదును – అన్నప్పుడు నిన్నటి మిమ్మల్ని నేను యెరుగనే యెరుగను. ఆ కల్పితరూపం అయినా, నిన్నటి వరకూ మీరు చెప్పిన దానిని గురించి, నాకు గుర్తున్నంత వరకూ – యేర్పడుతూ వుంది. నన్ను గురించి మీరు కల్పించుకున్న రూపం గూడా అటువంటిదే. ఈ రూపాలు – కల్పితమయినవి – ఒకదాన్నొకటి కలుసుకు చరిస్తాయి. మనం అంటూ అసలు కలుసుకోవడమే జరగడం లేదు. పైగా, మనం కలుసుకుందుకు యివి అవరోధం కల్పిస్తాయి.

చాలకాలంగా పరస్పర పరిచయం వున్న యిద్దరు వ్యక్తులు – యిలా రూప ప్రతిరూపాలు యేర్పరుచుకుని, అసలు వ్యక్తులు సంపర్కం లేకుండానే వుండిపోతారు. మనకు సంబంధం అనేది అవగాహన అయితే, అప్పుడు పరస్పరం సహకరించుకోవచ్చును. కాని, రూప ప్రతిరూపాల ద్వారా సహకారం సాధ్యంకాదు. ప్రతీకల ద్వారా, ఆదర్శవాదాల ద్వారా సహకారం కుదరదు. ఇద్దరి మధ్య నిజమయిన సంబంధం వున్నప్పుడే ప్రేమకు ఆస్కారం యేర్పడుతుంది. అందుచేత యీ విషయాన్ని కేవలం మాటమాత్రంగా కాకుండా యదార్థంగా అర్థం చేసుకోవడం అవసరం. ప్రతీకలు, రూపాలు, చిహ్నాల ద్వారా ప్రేమ సాధ్యపడదు. నిత్యజీవితంలో మీరు యితరులను గురించి – మీ భార్య, భర్త, యిరుగు పొరుగువారు, పిల్లలు, దేశం, నాయకులు, రాజకీయవేత్తలు, భగవంతుళ్లు – – వీటన్నిటినీ గురించి రూపకల్పనలలోనే వుండిపోతున్నారు గాని, వారిని యదార్థంగా యెరగరు.

ఈ రూపాలు మీకు, మీరు గమనిస్తున్న దానికీ నడుమ విరామాన్ని తీసుకు వస్తాయి. మనం యిప్పుడు పరిశీలించబోతున్నది యేమంటే – యిలా మనం నిర్మించుకుంటున్న విరామాల కాళీలనుంచి మనం స్వేచ్ఛగా వుండగలమా? బయటి స్వేచ్ఛ మాత్రమే కాకుండా ఆంతరిక స్వేచ్ఛ పొందగలమా? ఈ విరామం మనుషులను వేరు చేస్తోంది, విడదీస్తోంది.

ఒక సమస్యకు మీరు యిచ్చే గమనమే ఒక శక్తి; అదే సమస్యను పరిష్కారం చేస్తోంది. మీరు పూర్తి గమనాన్ని యిచ్చినప్పుడు – మీ సర్వశక్తిని వినియోగించినప్పుడు – పరిశీలకుడు అంటూ వేరుగా యెవరూ లేరు. గమనస్థితి, సర్వశక్తి వున్నది. ఉన్నతస్థాయిలో యీ సర్వశక్తి వివేకం. సహజంగా ఆ మానసిక స్థితి పూర్తిగా నిశ్శబ్దంగా వుండాలి. ఆ నిశ్శబ్దం – నిశ్చలత – పూర్తి గమనం వున్నప్పుడే యేర్పడుతుంది. ఇది తెచ్చిపెట్టుకున్న నిశ్చలత కాదు. పరిశీలకుడు, పరిశీలన వస్తువు అంటూ లేకుండా వుండే పూర్తి నిశ్శబ్దం – మౌనం – యిదే మతపరమయిన మనసు యొక్క ఉన్నత రూపస్థాయి. అయితే, ఆ స్థాయిలో యేం జరుగుతుందో

మాటలలో పెట్టటానికి వీలులేదు. ఎందుకంటే, మాటలలో చెప్పినది యెప్పుడూ యదార్థం కాదు. మీ అంతట మీరు కనుక్కోవటానికి మీరే దీని లోపలకు వెళ్లవలసి వుంటుంది.

ప్రతి సమస్య ప్రతి యితర సమస్యతోను ముడిపడి వుంటుంది. అంటే, ఒక సమస్యను పూర్తిగా పరిష్కరించగలిగితే – అది యే సమస్య అయినా సరే – మీకే తెలిసి వస్తుంది; తతిమ్మా సమస్యలు కూడా వాటంతట అవే హరించుకు పోతున్నాయని. మనం, మానసిక సమస్యలను గురించి మాట్లాడుతున్నాం. సమస్య అనేది కేవలం కాలాధీనమై వుంటుందని ముందే చూచాం; సమస్యను అపరిపూర్ణంగా చూచినప్పుడు జరిగేది యిదే. సమస్య యొక్క స్వరూప స్వభావాలను గమనించడమే కాకుండా, దానిని సంపూర్ణంగా చూడగలగాలి. సమస్య ఉత్పన్నం కాగానే దానిని పరిష్కరించి వేయాలి; మనసులో వేరులు వేసుకునేంతవరకూ ఊరుకోగూడదు. ఒక సమస్యను ఒక నెల రోజులో ఒక రోజో ముురగబెట్టినట్లయితే – కొన్ని నిమిషాల పాటయినా అట్టే వుండనిస్తే – అది మనసును వికృత పరుస్తుంది. కనుక సమస్యను తక్షణమే పరిష్కరించుకోవడం అవసరం. దాని తాలూకు జ్ఞాపకాలు, మరకలు యేవీ మిగలకుండా మనసుమీద గీతలు యేర్పడకుండా జాగ్రత్తపడాలి. ఈ జ్ఞాపకాలే మనం మోసుకు తిరిగే రూపాలు. ఈ రూపాలే మన జీవితంతో ఒరుసుకుని, సంఘర్షణను వైరుధ్యాలను తీసుకు వస్తున్నాయి. జీవితం చాల యదార్థమయినది – జీవితం అరూపమయినది కాదు, సిద్ధాంతం మటుకే కాదు – దానిని రూపాల ఆశ్రయంతో కలుసుకుంటే సమస్యల ఉత్పన్నం కాక తప్పదు.

ప్రతి సమస్యను ఈ కాల విరామ వ్యవధితో నిమిత్తం లేకుండా, మనకు – మనం భయపడే దానికీ మధ్య విరామం లేకుండా, చూడగలగడం సాధ్యమా? పరిశీలకుడికి 'కొనసాగింపు' లేకపోతే యిది సాధ్యమే. రూపకల్పనలు చేసే పరిశీలకుడు, జ్ఞాపకాలను పోగుచేసుకునే పరిశీలకుడు, అభిప్రాయాలను – అరూపభావనలను పోగు చేసుకునే పరిశీలకుడు 'కొనసాగింపు' వున్నవాడు.

మీరు ఆకాశంలోని నక్షత్రాలవంక చూస్తున్నారు. మీరు ఉన్నారు. ఆకాశం నిండా ప్రకాశిస్తున్న నక్షత్రాలు వున్నాయి. చల్లని గాలి వుంది. మీరు – పరిశీలకునిలా, అనుభవించేవానిలా, ఆలోచనపరుడిలా, హృదయభారంతో, కేంద్రస్థులయివుండి విరామాన్ని సృష్టిస్తున్నారు. మీకు, నక్షత్రాలకు మధ్యవున్న స్థల విరామాన్ని గురించి మీకు యెన్నటికీ తెలియదు. అలాగే – మీ భార్య, స్నేహితుడు – యిలా ఎవరిని గురించి అయినా సరే – మీరు రూపకల్పన చేసుకున్నారు గనుక, ఎప్పుడూ దానిద్వారానే గమనిస్తూ వుంటారు గనుక, మీకు సౌందర్యం అంటే యేమిటో, ప్రేమ అంటే యేమిటో తెలియదు. మీరు దాన్ని గురించి మాట్లాడుతారు, వ్రాస్తారు, కాని దాని నిజస్వరూపం మీకు తెలియనే తెలియదు; ఎప్పుడో మీరు పూర్తి విసర్జన చేసుకున్న అరుదయిన క్షణాలలో తప్ప. విరామాన్ని తయారుచేస్తున్న కేంద్రం వున్నంతవరకు, ప్రేమగాని సౌందర్యంగాని వుండదు. కేంద్రం లేనప్పుడు, పరిధి లేనప్పుడు – ప్రేమ వుంటుంది. మీరు ప్రేమించినప్పుడు మీరే సౌందర్యం కూడా.

మీకు ఎదురుగా వున్న ముఖాన్ని చూచినప్పుడు మీరు ఒక కేంద్ర స్థానంనుంచి చూస్తున్నారు. ఈ కేంద్రం మనిషికి మనిషికి మధ్య విరామాన్ని సృష్టిస్తుంది. అందుకనే మన జీవితాలు యిలా డొల్లలయి, నిరర్థకంగా తయారవుతున్నాయి. ప్రేమను, సౌందర్యాన్ని అలవరచుకోవడం కుదరదు. సత్యాన్ని సృష్టించడం సాధ్యంకాదు. అయితే, అనుక్షణము మీరు యేం చేస్తున్నారన్న గమనం, ఎఱుక మీకు ఉన్నట్లయితే, ఈ ఎఱుకను అలవరచుకోవచ్చును. ఈ ఎఱుక మూలంగా మీరు సుఖం, కోరిక, విచారం, వంటరితనం, అలసట – యివన్నీ గమనించగలుగుతారు; 'విరామం' అనేది మీకు సవివరంగా తెలిసివస్తుంది.

మీకు, మీరు పరిశీలిస్తున్న వస్తువుకు మధ్య 'విరామం' వున్నప్పుడు – ప్రేమ అనేది లేదని మీకు తెలుసును. ప్రేమ లేకుండా, మీరు ఎంత కష్టపడి పని చేసినా ప్రపంచాన్ని సంస్కరించలేరు. కొత్త సాంఘిక వ్యవస్థను తీసుకు రాలేరు; మార్పులను గురించి యెంత తీవ్రంగా మాట్లాడినా గానీ, మరింత క్లిష్టత, బాధ తీసుకువస్తారు – అంతే. కనుక మీ యిష్టం. నాయకుడు లేడు, గురువు లేడు, మీరు యేం చేయాలనేది చెప్పే వారెవరూ లేరు; ఈ ఉన్మత్త కిరాతక ప్రపంచంలో మీరు వంటరిగా వున్నారు.

★ ★ ★

# 12

## పరిశీలకుడు - పరిశీలన వస్తువు

నాతో మరికొంత దూరం నడవండి. చాల కష్టం కావచ్చును, అతిసులభం కావచ్చును. అయినా ముందుకు నడుద్దాం.

మిమ్మల్ని గురించి నేనో రూపకల్పన చేసుకున్నప్పుడు, నేను ఆ రూపాన్ని గమనించ గలుగుతున్నాను. అందుచేత ఆ రూపము – ఆ రూపాన్ని గమనిస్తున్న పరిశీలకుడు – వున్నారు. ఎవరినో చూస్తాను. అతను ఎర్ర చొక్కా తొడుగుకుని వున్నాడు. నా తక్షణ ప్రతిచర్య యేమిటంటే – ఆ ఎర్ర చొక్కా నాకు యిష్టము లేదా యిష్టము కాదు అనేది. ఇష్టము, అయిష్టము అనేది నా సంస్కారం, శిక్షణ, సహవాసం, వైఖరులు, అలవరుచుకున్న – సహజంగా సంక్రమించిన లక్షణాలపైని ఆధార పడి వుంటుంది. ఆ కేంద్రం నుంచి నేను గమనిస్తాను; నా తీర్మానం చేస్తాను. అప్పుడు పరిశీలకుడు వేరు అయిపోతాడు, తాను పరిశీలిస్తున్న దాని నుంచి.

కాని, పరిశీలకుడు ఒకటికంటె ఎక్కువ రూపాలను యెరుగును. అతను వేలాది రూపాలను నిర్మించుకుంటాడు. అయితే, పరిశీలకుడు యీ రూపాలనుంచి వేరు అయినవాడా? అతనుగూడా ఒక రూపమే కదూ? తన రూపానికి యెప్పుడూ యేదో కొత్త సంగతి కలుపుకోవడము, పాతది తీసివేసుకోవడము చేస్తూవున్నాడు. అనుక్షణము తూకం వేసుకుంటూ – బయటి లోపలి వత్తుడులకు అనుగుణంగానే – ఒక ప్రజ్ఞాక్షేత్రంలో సజీవంగా కదలాడుతున్నాడు. తన పాండిత్యము, ప్రభావము, లెక్కలేనన్ని అంచనాలు – యివీ అతని క్షేత్రం. అదే సమయంలో పరిశీలకుని వంక చూచినప్పుడు – మీరే ఆ పరిశీలకుడు కదూ – అతడు జ్ఞాపకాల పోగు, అనుభవాల, సంఘటనల, ప్రభావాల, సంప్రదాయాల, రకరకాల బాధల సముదాయం అని గమనిస్తారు. ఇవన్నీ గతానికి చెందినవే. అంటే, పరిశీలకుడు గతము, వర్తమానము యొక్క కలగాపులగం అన్నమాట. వేచివున్న రేపుకూడా అతనిలో భాగమే. అతను సగం జీవించి వున్నాడు, సగం మృతుడూను. ఈ మృత్యు జీవనాల నడుమ అతను గమనిస్తూ వున్నాడు – వాడిన, సజీవ పత్రంతో, ఆ మానసిక స్థాయిలో – అదంతా సమయక్షేత్రంలోనే వుంది – మీరు (పరిశీలకుడు) భయంవంక చూస్తున్నారు; ఈర్ష్య, యుద్ధం, కుటుంబం (సంకుచిత మయిన ఖైదులాంటి కుటుంబం కదూ!) వంక చూస్తూ పరిశీలిస్తున్న సమస్యను పరిష్కరించాలని చూస్తున్నారు. అదే సవాలు. అదే కొత్తది. ప్రతిమారూ యీ కొత్త దానిని పాత ప్రమాణాలలోనికి మార్చుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. అందుచేతనే యెప్పుడూ సంఘర్షణలో కూరుకుపోయి వుంటున్నారు.

ఒక రూపం – పరిశీలకుని హోదాలో అనేక యితర రూపాలను గమనిస్తుంది.

ఈ రూపాలు అతనిలోను, అతని వెలుపలను వున్నాయి. 'నాకు ఈ రూపం అంటే యిష్టం. దీన్ని నేను అట్టే పెట్టుకుంటాను', లేదా 'యిది నాకు రుచించదు, దీన్ని వదిలించుకుంటాను,' అనుకుంటుంది. అయితే, పరిశీలకుడే అనేక రూపాల పోగు. ఎన్నో రూపాలకు ప్రతిగా యేర్పడిన రూపాల సముదాయం. అందుచేత మనం ఒక కొత్త స్థాయికి వచ్చి 'పరిశీలకుడు గూడా రూపకల్పనే. అతను వేరై వచ్చి పరిశీలిస్తున్నాడు' అనుకుంటున్నాము. 'అనేక రూప ప్రతిరూపాల కల్పనల పోగు అయిన పరిశీలకుడు తాను శాశ్వతం అనుకుంటున్నాడు; అతనికీ రూపాలకు మధ్య ఒక అడ్డు తెర – విభాగం వున్నది; సమయ విరామం వున్నది. ఇది అతనికీ, అతని కష్టాలకు కారణం అనుకుంటున్న రూపాలకూ నడుమ సంఘర్షణ తీసుకువస్తోంది. అప్పుడతను అంటున్నాడు: "ఈ సంఘర్షణను నేను అంతమొందించుకోవాలి" – అని. ఈ ప్రయత్నమే మరొక రూపాన్ని కల్పిస్తూ వున్నది.'

ఇదంతా ఎరిగి వుండడం – యిదే నిజమయిన ధ్యానం – ఒక విషయాన్ని తెలివిడి చేస్తోంది. అదేమంటే, అన్ని రూపాలు కలిసి ఒక కేంద్ర రూపాన్ని ప్రతిష్ఠిస్తున్నాయి. ఈ కేంద్ర రూపం, పరిశీలకుడు, యితనే తీర్పరి – దోష నిర్ణేత – అనుభవపరుడు, వెలకట్టేవాడు, యితర రూపాలను జయించి, మటుమాయం చేయాలనుకునే తీర్పరి. ఇతర రూపాలన్నికూడా పరిశీలకుని తీర్పులు, అభిప్రాయాలు, నిర్ణయాల ఫలితంగా యేర్పడినవే. పరిశీలకుడు యీ యితర రూపాల ఫలితంగా రూపుకట్టుకున్నవాడు. అందుచేత పరిశీలకుడే పరిశీలన వస్తువు కూడా.

కనుక, మన ఎఱుక యేం తెలివిడి చేస్తున్నదంటే – మనసులో అనేక అంతస్తులు వున్నాయి, అనేక రూపాలు – యీ రూపాల మధ్య వైరుధ్యాలు – వున్నాయి. ఈ పరిస్థితి నుంచి బయటపడలేని నిరాశ స్థితికూడా వున్నది. దీన్నించి తప్పించుకుందుకు పన్నే అనేక పన్నాగాలు వున్నాయి. ఇదంతా బహు జాగ్రత్తగా తాపీగా చేసిన ఎఱుకవల్ల తెలుస్తోంది. పరిశీలకుడే పరిశీలన వస్తువు అన్న విషయం కూడా యిదే బహిర్గతం చేస్తోంది. ఇదేదో ఉన్నతమయిన స్థాయికి చెందిన వ్యక్తిత్వం కాదు. ఉన్నతస్థాయి అనేది, అంతరాత్మ అనేది యివన్నీ కేవలం కల్పనలు, కల్పన రూపాలు. ఎఱుకమటుకే వీటన్నిటినీ బట్టబయలు చేస్తోంది. పరిశీలకుడే పరిశీలన వస్తువు అన్న విషయం చెబుతోంది.

మీకు మీరు ఓ ప్రశ్న వేసుకుంటున్నప్పుడు జవాబును అందుకునేది ఎవరు? వివరణలు చేసేది ఎవరు? ఇదంతా ప్రజ్ఞలో భాగమే అయితే, భావనలో భాగమే అయితే, దానికి ఆ సామర్థ్యం లేదు. అది తెలుసుకోగలదల్లా ఎఱుక యొక్క స్థాయిని మటుకే. అయితే, ఆ ఎఱుక స్థాయిలో మరో అంశం వుండనే వుంది: 'నేను తెలుసుకోవాలి. నేను ఎఱుకను అభ్యసించాలి' అనుకునేది. ఇది మళ్ళీ ఒక కల్పితరూపమే.

పరిశీలకుడే పరిశీలన వస్తువు అనే ఎఱుక పరిశీలన వస్తువుతో సారూప్యం పొందే ప్రక్రియ కాదు. ఒక వస్తువుతో సారూప్యం పొందడం బహు తేలిక. మనలో చాలమందిమి దేనితోనో కలిసిపోతాం, సారూప్యం పొందుతాం: మన కుటుంబంతో, భర్తతో – లేక భార్యతో, జాతితో. ఇదే మరింత దుఃఖాన్ని తీసుకు వస్తోంది. మరిన్ని యుద్ధాలను తెస్తోంది. మనం దీనికంటే విభిన్నమయిన మరో విషయాన్ని

పరిశీలించటానికి ప్రయత్నిస్తున్నాం. దానిని కేవలం మాటలుగా – ఊహగా – తెలుసుకుంటే లాభం లేదు. మన పూర్తి స్వరూపాన్ని మిళాయించి, అస్తిత్వం అంతటితోనూ తెలుసుకోవాలి. ప్రాచీన చైనా దేశంలో యే చిత్రకారుడయినా ఒక చిత్రాన్ని గీయదలుచుకున్నప్పుడు – ఉదాహరణకు ఒక చెట్టునే అనుకుందాం – దాని ముందు కొన్ని రోజులు, నెలలు, సంవత్సరాలు – ఎంత కాలమయినా సరే, కూర్చుండిపోతాడు; ఆ చెట్టే తాను అయిపోయేంత వరకు. చెట్టుతో సారూప్యం పొందడు. చెట్టే తాను అయిపోతాడు. అంటే, అతనికి చెట్టుకు నడుమ విరామం అన్నది లేదు. పరిశీలకుడికి పరిశీలన వస్తువుకు మధ్య విరామం లేదు. సౌందర్యాన్ని అనుభవించే అనుభూతిపరుడు అంటూ వేరుగా లేడు. సౌందర్యాన్ని, కదలికను, నీడను, ఆకుల ప్రగాఢతను, రంగుల వైఖరిని – ప్రత్యేకంగా అనుభవించేవాడు అంటూ లేడు. అతడే పూర్తిగా చెట్టు అయిపోతాడు; అటువంటి స్థితిలోనే చిత్రం గీయడం ఆరంభం చేస్తాడు.

పరిశీలకునిలో యే భాగమయినా కదలిక పొందితే – పరిశీలకుడే పరిశీలన వస్తువు అని గుర్తించకపోతే – అది ఎన్నో రూపాలను సృష్టిస్తుంది. మళ్లీ అతను వాటిలో చిక్కుకుపోతాడు. పరిశీలకుడే పరిశీలన వస్తువు అని తెలుసుకున్నప్పుడు ఏం జరుగుతుంది? నింపాదిగా ఆలోచించండి; బహు నింపాదిగా. ఎందుకంటే, యిది చాల క్లిష్టమయిన విషయం – దీని లోతులకు వెళ్లుతున్నాం మనం. ఏం జరుగుతుంది? పరిశీలకుడు యేమీ పని చేయడు. అతను ఎప్పుడూ అంటాడు: 'ఈ రూపాల విషయం నేను యేదయినా చేయాలి. వాటిని నేను అణచాలి. లేదా మరొక రూపం యివ్వాలి.' అతను ఎప్పుడూ పరిశీలన విషయంలో చురుకుగానే వుంటాడు. ఉద్విగ్నంగానో ఆషామాషీగానో ప్రవర్తిస్తూ, ప్రతిచర్యలు చేస్తూ వుంటాడు. ఈ యిష్టా యిష్టాల చర్య పరిశీలకుని దృష్టిగా సక్రమమయినదే. 'నాకు యిష్టం. దీనికి అంటి పట్టుకు వుండాలి. నాకు యిష్టం లేదు, దీనిని వదిలించుకోవాలి.' అయితే, పరిశీలకుడు తాను గమనిస్తున్నది తనను గురించే అని ఎరిగినప్పుడు, అతనికి రూపాలకు మధ్య వైరుధ్యం యేమీలేదు. అతడే అది. దానినుంచి వేరు కాదు. వేరు అయినప్పుడు, దానిని గురించి యేదో చేయటానికి ప్రయత్నం చేశాడు: యేదో చేశాడు. కాని, తానే అది అని గుర్తించినప్పుడు – యిష్టము అయిష్టము అనేవి లేవు. సంఘర్షణ అంతరించిపోతుంది.

అతను యిప్పుడు యేం చేయాలి? మీరు యేదయినా అయితే, యేం చేస్తారు? దాన్నించి తిరుగుబాటు చేయలేరు; పరుగెత్తి పారిపోలేరు: దానిని అంగీకరించను కూడా లేరు. అది ఉన్నది అంతే. కనుక యిష్ట అయిష్టాల ప్రాతిపదికమీద జరిగే అన్ని చర్యలూ అంతరించిపోయాయి.

మహోజ్వలంగా సజీవంగా ఒక ఎఱుక వున్నదని మీకు తెలిసి వచ్చింది. అది యేదో మధ్య బిందువుకు – రూపానికి చెందినది కాదు. ఆ ఎఱుక నుంచి వేరే రకమయిన గమనం, గమనిక వస్తున్నాయి. కనుక మనసు – మనసే యీ గమనిక, ఎఱుక – ఎంతో అసాధారణంగా లలితంగా మహోన్నత వివేకంగా తయారవుతోంది.

# 13

## ఆలోచన అంటే యేమిటి? - అభిప్రాయాలు: ఆచరణలు - సవాలు - ద్రవ్యవస్తువు - భావ ప్రారంభం.

ఇప్పుడు ఆలోచన అంటే యేమిటి; జాగ్రత్తగా, తార్కికంగా, దైనందిన కార్యకలాపాలలో స్పష్టతతో ఆలోచించడం ఎలా; యే మాత్రమూ ప్రాముఖ్యం లేని ఆలోచన యేమిటి – అన్న విషయాలు ప్రస్తావించుకుందాము. ఈ రెండు రకాలను స్పష్టంగా యెరుగక పోయినట్లయితే యింతకంటే ప్రగాఢమయినది – భావన అంటలేనిది యేమిటో తెలుసుకోలేము. కనుక ఆలోచించడం అంటే వున్న క్లిష్టతలన్నీ తెలుసుకుందాం. జ్ఞాపకం అంటే యేమిటి, ఆలోచన ముందు ఎలా ప్రారంభమవుతుంది, ఆలోచన మన పనులను ఎలా నిబద్ధం చేస్తుంది – తెలుసుకుందాం. ఈ తెలుసుకోవడంలో అసలు ఆలోచన అనేది యింతవరకు కనిపెట్టనిదేదయినా వున్నదా, ఆలోచన ద్వారాలు తెరుచుకొని యేమన్నా వున్నదా అని కూడా చూద్దాం.

మన జీవితాలలో ఆలోచన – భావన ఎందుకంత ప్రముఖపాత్ర వహిస్తోంది? ఆలోచన అంటే అభిప్రాయాలు, మెదడు కణాలలో అలవాటు పడిపోయిన జ్ఞాపకాల ప్రతిస్పందనలు. బహూశ మీలో చాలమంది యింత వరకు యిటువంటి ప్రశ్న వేసుకోలేదనుకుంటాను. ఒకవేళ వేసుకున్నా, 'యిదంత ముఖ్యమయినది కాదు. ముఖ్యమయినది భావోద్వేగం' అనుకుని వుంటారు. అయితే, యీ రెంటినీ వేరు చేయడం ఎలాగో! ఆలోచన, రాగాభావానికి కొనసాగింపు యివ్వకపోయినట్లయితే, ఆ భావన త్వరలోనే క్షీణించి పోతుంది. కనుక – మన నిత్య జీవితాలలో, తిరుగుడు రాళ్ల మధ్య నలిగిపోతూ, భయ విహ్వలమయిన జీవితాలలో ఆలోచన ఎంత ప్రాముఖ్యత సంపాదించుకుంది? నేను ప్రశ్నిస్తున్నట్లే మీరు ప్రశ్నించుకు చూడండి.

మనిషి ఆలోచనకు ఎందుకు బానిస అయిపోయాడు? మోసకారి, తెలివి అయినది, అన్నిటినీ అమర్చేది, ప్రారంభించేసేది, అన్వేషించి పెట్టేది, యుద్ధాలను తీసుకు వచ్చింది, భయోత్పాతాన్ని సృష్టించినది, ఎంతో ఆదుర్దాను క్షణక్షణమూ రూపకల్పనలు చేస్తున్నది, తన తోకను తానే మింగుతున్నది – నిన్నటి సుఖాలలో ఓలలాడుతూ ఆ సుఖాలను నేడు రేపుకూడా కొనసాగించేది – ఆలోచన ఎప్పుడూ చురుకయినది, కబుర్లు చెబుతుంది, కదులుతుంది, నిర్మాణం చేస్తుంది, తీసుకుపోతుంది, కలుపుతుంది, అనుకుంటుంది!

అభిప్రాయాలు మనకు ఆచరణకంటే ముఖ్యమయిపోయినాయి. అనేక క్షేత్రాలలో పాండిత్యం సంపాదించిన మహా విజ్ఞానులు వ్రాసిన పుస్తకాలలో వెలిబుచ్చిన అభిప్రాయాలు – చాల మోసకారి, సూక్ష్మం అయిన యీ అభిప్రాయాలను మనం ఆరాధిస్తున్నాం. పుస్తకాలను పూజిస్తున్నాం. మనమే ఆ పుస్తకాలం. మనమే ఆ అభిప్రాయాలు. వాటితో నికటంగా నిబద్ధులమయి పోయాం. అభిప్రాయాలను ఆదర్శాలను ఎప్పుడూ చర్చించుకుంటూ తార్కికంగా ఉద్దేశ్యాలు వెలిబుచ్చుతున్నాం. ప్రతి మతానికి తనదే అయిన సిద్ధాంతము, సూత్రము, భగవంతుళ్లను చేరుకునే మూసకట్టు వున్నాయి. ఆలోచన ప్రారంభాన్ని గురించి చూస్తున్నప్పుడు యీ మూసకట్టు యొక్క ప్రాశస్త్యాన్ని గురించి ప్రశ్నిస్తున్నాం. అభిప్రాయాలను ఆచరణనుంచి వేరు చేశాం. ఎందుకంటే, అభిప్రాయాలు ఎప్పుడూ గతానికి చెందినవి: ఆచరణ వర్తమానానికి సంబంధించినది. అంటే, జీవితం ఎప్పుడూ వర్తమానంలోనే వుంటుంది. మనకు జీవించడం భయం; కనుక గతం – అభిప్రాయాల పోగుగా, మనకు అత్యంత ముఖ్యమయినది అయిపోయింది.

మన ఆలోచన విధానాన్ని గమనించడం అభిరుచిదాయకంగా వుంటుంది. మనం ఎలా ఆలోచిస్తున్నాం, మనం ఆలోచన అనుకుంటున్న ప్రతి చర్య ఎక్కడనుంచి బయలుదేరుతోంది? తప్పనిసరిగా జ్ఞాపకం నుంచే కదూ! ఆలోచించటానికి ప్రారంభం అంటూ వున్నదా? ఉంటే, దానిని మనం పట్టుకోగలమా – అంటే, జ్ఞాపకం యొక్క ప్రారంభం; ఎందుకంటే – మనకు జ్ఞాపకశక్తి అంటూ లేకపోతే ఆలోచన క్రమమే వుండదు.

ఆలోచన ఏ రకంగా ఒక సుఖానికి కొనసాగింపు యిస్తుందో గమనించాం. నిన్నటి అనుభవం – ఆలోచన సుఖానికి వ్యతిరిక్తమయిన దుఃఖం, భయాలను సైతం కొనసాగించడం, అనుభవించేవాడు – ఆలోచించేవాడు – ఆ సుఖము, దుఃఖము అయి, వాటిని పెట్టి పోషించేవాడు అవడము – యిదంతా చూచాం. ఆలోచన చేస్తున్నవాడు సుఖాన్ని బాధనుండి వేరు చేస్తాడు. సుఖాపేక్షలోనే దుఃఖము, బాధ, భయాలకు ఆహ్వానం యిమిడి వున్నదని గమనించడు. మానవ సంబంధాలలో ఆలోచన ఎప్పుడూ సుఖాన్ని కోరుతోంది. దీనికి అనేక పేర్లు యిస్తుంది: విశ్వాసం, సహాయం, దానం, పోషణ, సేవ – యిలా, మనం ఎందుకు సేవించాలనుకుంటున్నామో! పెట్రోల్ స్టేషన్ మంచి సేవలను అందిస్తుంది. ఈ మాటల అర్థం యేమిటి, – సహాయం, యివ్వడం, సేవలు చేయడం? ఇదంతా యేమిటి? సౌందర్యంతో, తేజస్సుతో, సౌకుమార్యంతో నిండిన కుసుమం 'నేను యిస్తున్నాను, సహాయ పడుతున్నాను, సేవిస్తున్నాను' అని ప్రకటిస్తుందా? అది వుంటుంది, అంతే. అది యేమీ చేయటానికి ప్రయత్నం చేయదు గనుక భూమినే అంటుకుని వుంటుంది.

ఆలోచన చాల మోసకారి; తెలివయినది. తన సౌకర్యం కోసం దేన్నయినా వికృత పరచగలదు. సుఖాపేక్షతో విర్రవీగే ఆలోచన తన బంధాన్ని తానే తెచ్చుకుంటుంది. ఆలోచన ద్వంద్వ ప్రకృతిని తీసుకు వస్తుంది – మన సంబంధ బాంధవ్యాలలో, మనకు సుఖాన్ని తీసుకు వచ్చే దౌర్జన్యం వున్నది; శాంతికోసం కామనకూడా

వున్నది. దయగా ఉదారంగా వుండాలనే కోరిక వున్నది. మన జీవితాలలో యెప్పుడూ జరుగుతున్నది యిదే. ఆలోచన యీ ద్వంద్వాన్ని తీసుకురావడం, వైరుధ్యాన్ని ప్రవేశపెట్టటమే కాక, అసంఖ్యాకంగా జ్ఞాపకాలను పోగు చేసుకుంటుంది. ఈ జ్ఞాపకాలద్వారా అది పునరుజ్జీవనం పొందుతుంది. కనుక ఆలోచన గతానికి చెందినది. పాతది; ఈ విషయం యిదివరకే చెప్పాను గదా!

ప్రతి సవాలును గతం తాలూకు జ్ఞాపకాలతో సర్దుకు పోయేందుకు ప్రయత్నించినట్లు – సవాలు ఎప్పుడూ నూతనం – మన సర్దుకుపోవడం ఎప్పుడూ అసమానం, అసంపూర్ణమూను. అందువల్లనే వైరుధ్యం, సంఘర్షణ. మనకు వారసత్వంగా దుఃఖము, ఖేదము మిగులుతున్నాయి. మన మెదడు యేం చేసినా సంఘర్షణలోనే చిక్కుకుంటూంది. అది యేమయినా కోరుకున్నా, అనుకరించినా, నిబద్ధం అయినా, అణచివేసినా, మార్చినా, విస్మృతి కోసం మందులు మాకులు తీసుకున్నా – అది యేం చేసినాగానీ – ఒక సంఘర్షణ స్థితిలోనే కూరుకుపోతుంది; సంఘర్షణనే ప్రసవిస్తోంది.

ఎక్కువగా ఆలోచించేవాళ్లందరూ పదార్థవాదులే. ఎందుకంటే, ఆలోచన పదార్థమే. నేల, గోడ, టెలిఫోన్‌లలాగే ఆలోచన గూడా పదార్థమే; ద్రవ్యమే. శక్తి ఒక ప్రక్రియలో పనిచేస్తూ ద్రవ్యంగా రూపొందుతుంది. శక్తి ఉంది; ద్రవ్యం వుంది. జీవితం అంతా అంతే. మనం ఆలోచన ద్రవ్యం కాదు అనుకోవచ్చును, కాని అది మాత్రం పదార్థమే. ఆదర్శవాదం మాదిరే ఆలోచన గూడా ద్రవ్యపదార్థమే. శక్తి వున్నచోట అది ద్రవ్యంగా రూపొందుతుంది. ద్రవ్యం, శక్తి – యీ రెండు పరస్పర సంబంధం వున్నవి. ఒకటి రెండవది లేకుండా వుండలేదు. ఈ రెంటి నడుమ సమరసత వున్న కొద్దీ, మెదడు కణాలు ఎక్కువ చురుకుగా పనిచేయ గలుగుతాయి. ఆలోచనే యీ సుఖము, బాధ, భయము అనే పద్ధతిని ప్రవేశబెట్టింది. వేలసంవత్సరాలుగా యీ పద్ధతిలోనే పనిచేస్తూ వుంది. ఈ పద్ధతిని, చట్రాన్ని అది బద్దలుకొట్టలేదు; ఎందుకంటే, దానిని నిర్మించినది అదే గనుక.

ఓ కొత్త విషయం ఆలోచన ద్వారా అగుపించదు. ఆలోచన ద్వారా దానిని అర్థం చేసుకోవడం, ఆ తరువాత జరుగవచ్చును. అయితే, ఓ కొత్త విషయాన్ని – సంగతిని – తెలుసుకోవడం, ఆలోచనకు – భావనకు యదార్థ ప్రక్రియ కాదు. ఆలోచన మానసిక సమస్యలను యెన్నటికీ పరిష్కరించలేదు. ఎంత తెలివిగలది ఎంత మోసకారి అయినా, ఎంత పాండిత్య ప్రకర్షవున్నా యే రూపనిర్మాణంలోనైనా శాస్త్ర పరిజ్ఞానంవల్ల ఎలక్ట్రానిక్ మెదడును కనుగొన గలిగినా, తప్పనిసరి వల్లనో అవసరం వల్లనో – ఆలోచన మటుకు నూతనమయినది కాదు. అందుచేత, అది బ్రహ్మాండమయిన ప్రశ్నలకు బదులు చెప్పలేదు. జీవితానికి సంబంధించిన బృహత్తర సమస్యలను పాతమెదడు పరిష్కరించలేదు.

ఆలోచన వక్రమయినది. ఎందుకంటే, అది దేన్నయినా కనిపెట్టగలదు. లేని వస్తువులను చూడగలదు. అత్యంత అసాధారణ తమాషాలను ఇంద్రజాలాలను చేయగలదు; అందుచేత దానిపైని ఆధారపడటానికి కుదరదు. అయితే మీరు, ఎలా

ఆలోచిస్తున్నారు, ఎందుకు ఆలోచిస్తున్నారు, ఏం మాటలు ఉపయోగిస్తున్నారు, నిత్యజీవితంలో ఎలా వర్తిస్తున్నారు, మనుషులతో ఎలా మాట్లాడుతున్నారు, మనుషులను ఎలా చూస్తున్నారు, ఎలా నడుస్తున్నారు, ఎలా తింటున్నారు – యివన్నీ మీరు స్పష్టంగా గమనించినట్లయితే, అప్పుడు మీ మనసు మిమ్మల్ని మోసగించలేదు; అప్పుడు మోసగించవలసింది అంటూ యేమీలేదు. మనసు దేనినీ అపేక్షించడంలేదు. దేనినీ అణచడం లేదు; అది అసాధారణంగా ప్రశాంతంగా, మెత్తగా, లలితంగా, ఏకాంతంగా తయారవుతుంది. ఆ స్థితిలో ఎటువంటి వంచన వుండదు.

మీరు పరిపూర్ణమయిన సావధానంలో – పరిశీలనలో నిమగ్నులయివున్నప్పుడు, పరిశీలకుడు, ఆలోచనపరుడు, కేంద్రము, 'నేను' – అనేవి అంతం అయిపోతున్నాయి అన్న సంగతి యెప్పుడయినా గమనించారా? ఆ సావధానస్థితిలో ఆలోచన, భావన వడలిపోవడం ప్రారంభిస్తుంది.

ఒక వస్తువును స్పష్టంగా వివరంగా చూడదలుచుకున్నప్పుడు, మనసు ఎంతో ప్రశాంతంగా, యేమాత్రం దురూహలు – వదరుబోతుతనం, సంభాషణ, రూపకల్పన, చిత్రణ లేకుండా వుండాలి. వీటన్నిటినీ పక్కకు పెట్టగలగాలి. నిశ్శబ్దంలోనే మీరు ఆలోచన యొక్క ప్రారంభాన్ని పరిశీలించగలుగుతారు. అంతేగాని, మీరు యేదో అన్వేషణ చేస్తున్నప్పుడు, ప్రశ్నలు అడుగుతున్నప్పుడు, జవాబులకోసం వేచివున్నప్పుడూ కాదు. కనుక, మీరు పూర్తిగా ప్రశాంతంగా వున్నప్పుడే, మీ అస్తిత్వం అంతటితోను, 'ఈ ఆలోచనకు ప్రారంభం యెక్కడ?' అని ప్రశ్న వేసుకున్నప్పుడు, చూడడం మొదలు పెడతారు, ఆ నిశ్శబ్దంలో – ఆలోచన ఎలా రూపుకట్టుకుంటూందో దర్శిస్తారు.

ఆలోచన ఎలా ప్రారంభం అవుతోంది అన్న ఎఱుక సంప్రాప్తం అయిన తరువాత, ఆలోచనను నిగ్రహించవలసిన అవసరం లేదు. మన జీవితాలలో చాల సమయాన్ని, చాల శక్తిని – కేవలం పాఠశాలలోనేకాదు – జీవితం పొడుగునా ఆలోచనను అణచడం ఎలా అన్న సమస్యమీద వ్యర్థం చేస్తాము. 'ఇది మంచి ఆలోచన. దీనిని గురించి యింకా బాగా ఆలోచించాలి. ఇది వికృతమయిన ఆలోచన. దీనిని అణగద్రొక్కాలి' – అనుకుంటాము. ఒక ఆలోచనకు మరొదానికి నడుమ నిరంతర యుద్ధం జరుగుతోంది. ఒక కోరికకు మరో కోరికకు పోరాటం కొనసాగుతూ వుంది. ఒక సుఖం తతిమ్మా సుఖాలపై ఆధిపత్యం వహిస్తోంది. అయితే, ఆలోచన ప్రారంభాన్ని గురించి ఎఱుక వున్నట్లయితే, ఆలోచనలో వైరుధ్యం అనేది వుండదు.

'ఆలోచన ఎప్పుడూ పాతదే,' అనో, 'కాలం దుఃఖమయం' అనో మీరు విన్నప్పుడు ఆలోచన యీ భావాన్ని ఆచరణగా అనువదించడానికి ప్రారంభం చేస్తుంది, భాష్యం చెప్పటానికి ప్రయత్నిస్తుంది. ఈ అనువాదము, భాష్యము నిన్నటి పాండిత్యం మీద ఆధారపడి వున్నాయి. అందుచేత మీ నిబద్ధతకు అనుగుణంగానే మీరు అనువదించుకుంటారు. అయితే, యీ వాక్యాలవంక చూచి, వాటిని వివరించుకోకుండా – వాటికి మీ పూర్తి గమనాన్ని, సావధానతను యివ్వగలిగితే అప్పుడు పరిశీలకుడు, పరిశీలన వస్తువు అనేది లేదని మీకు తెలిసి పోతుంది.

ఆలోచనపరుడు, ఆలోచన అనేవి లేవని తేలిపోతుంది. ఏది ముందు ప్రారంభమయింది – అన్న ప్రశ్న తీసుకురాకండి. అదో తెలివయిన వాదన. అయితే, ఎక్కడికీ తీసుకుపోదు. ఆలోచన అన్నది లేనంత వరకు – అంటే మొద్దుతనం, అవివేకం కాదు – జ్ఞాపకాలనుండి ఉత్పన్నమయే ఆలోచన లేనంతవరకు ఆలోచన పరుడు అనేవాడు కూడా లేడని మీకు అవగాహన అవుతుంది. జ్ఞాపకాలు, అనుభవం, జ్ఞానం – యివన్నీ గతానికి సంబంధించినవి గదా! ఇదో తాత్త్విక సమాచారం అనీ, మార్మిక విషయమనీ అనుకోకండి. మనం యదార్థ విషయాలతో వ్యవహరిస్తున్నాం. మీరు యీ మాత్రం ముందుకు ప్రయాణం చేశారు గనుక – సవాలుకు స్పందించగలమని తెలుసుకుంటారు. ఈ స్పందన – జవాబు – పాత మెదడుతో, గతంతో కాదు; పరిపూర్ణంగా కొత్తదానితోనే.

★ ★ ★

# 14

## నిన్నటి బరువులు - ప్రశాంత మనసు - విచార వినిమయం - సాధన - నేర్చుకోవడం - నిశ్శబ్దం - సత్యము; యదార్థము.

మనం సాధారణంగా గడిపే జీవితంలో చాల తక్కువ ఏకాంతం వుంటుంది. మనం వంటరివాళ్ళం అయినా ఎన్నో ప్రభావాలు, పాండిత్యం, జ్ఞాపకాలు, అనుభవాలు, ఆదుర్దాలు, దుఃఖం, సంఘర్షణ – యివన్నీ మన మనసును మొద్దుబారిపోయేట్లుచేసి, సౌకుమార్యం అంతా హరింపచేసి, యాంత్రికం దుర్భరం అయిన కార్యక్రమంగా తయారు చేస్తుంది జీవితాన్ని. మనం ఎప్పుడయినా వంటరిగా వున్నామా? లేక ఎప్పుడూ నిన్నటి బరువులు మోసుకుంటూ తిరుగుతున్నామా?

ఒక కథ వుంది: ఇద్దరు సన్యాసులు ఒక గ్రామం నుంచి మరో గ్రామానికి వెడుతున్నారు. నదీతీరంలో ఒక యువతి కూర్చుని వుంది. ఆమె యేడుస్తోంది. ఒక సన్యాసి ఆమె దగ్గరకు వెళ్ళి 'యేమిటి సమాచారం?' అని అడిగాడు. 'నదికి ఆవలి తీరంలో ఆ కనిపిస్తూ వున్న యిల్లు వుంది చూచారా, అక్కడనుండి వచ్చాను యీ ఉదయం. అప్పుడు నదిని తేలికగా దాటగలిగాను. ఇప్పుడేమో నది వరదలలో వుంది. నేను యిప్పుడు యింటికి వెళ్ళలేను. పడవగూడా లేదు' అంది. సన్యాసి అంతా విని 'అది పెద్ద సమస్యకాదు' అంటూ ఆమెను బుజాలకు ఎత్తుకున్నాడు. నది దాటించాడు, ఆవలి తీరంలో ఆమెను వదిలాడు. ఇద్దరు సన్యాసులూ తమ నడక సాగించారు. రెండు గంటల తరువాత, రెండవ సన్యాసి అన్నాడు: 'సోదరా! స్త్రీని తాకము - అని మనం ప్రతిన పూనాం. నీవు యిప్పుడు మహత్తరమైన పాపం చేశావు. నీవు స్త్రీని తాకడం వల్ల కొంత సుఖం పొందావుగదూ?' మొదటి సన్యాసి, 'నేను ఆమెను రెండు గంటల క్రితమే దింపి వేశాను. నీవు యింకా మోసుకు వస్తునట్లున్నావు, కదూ?' అని జవాబు చెప్పాడు.

మనం చేసే పని అదే. మన బరువులు నిరంతరము మోసుకుంటూ తిరుగుతాము. వాటిని ఒకంతట వదలము. ఒక సమస్యపట్ల పరిపూర్ణమయిన సావధానత చూపినప్పుడే దానిని తక్షణం పరిష్కరించగలుగుతాము. రేపటికి వాయిదా వేయగూడదు. మరుసటి క్షణానికయినా వాయిదా పనికిరాదు. అప్పుడు – మనం జనసమ్మర్దంతో నిండిన యింటిలో వున్నా, బస్సులో కూర్చునివున్నా – ఏకాంతంగా వున్నట్లే లెక్క. ఆ ఏకాంతము తాజా మనసును సూచిస్తుంది; అమాయక మనసును సూచిస్తుంది.

ఆంతరిక ఏకాంతం విరామం యేర్పరచుకు వుండడం చాలా ముఖ్యం. దానివల్లనే

స్వేచ్ఛ; ముందుకు పోవటానికి, పనులు చేయటానికి, ఎగరటానికీని. ఏమయినా మంచితనం అనేది, స్వేచ్ఛ వున్నచోట పుష్పం వికసించినట్లుగా, విరామంలోనే స్థావరించుకో గలుగుతుంది. మనకు రాజకీయ స్వాతంత్ర్యం వుండవచ్చును; కాని ఆంతరికంగా స్వేచ్ఛ లేదు. అందువల్లనే విరామ స్థలం లేకుండా పోయింది. మనలో విస్తృతంగా విరామస్థలం వుంటేనే యే సుగుణమయినా, సల్లక్షణమయినా వికసించి ప్రవర్తిల్ల గలుగుతుంది. విరామస్థలం, నిశ్శబ్దం చాల ముఖ్యం. ఎందుకంటే, అవి వున్నప్పుడే మనసు ఏకాంతంగా, ప్రభావితం కాకుండా, శిక్షితం కాకుండా, వివిధ రకాల అనుభవాల పాలపడకుండా వుంటుంది; సరికొత్తగా సంపూర్ణంగా నూతనత్వాన్ని ఆహ్వానించ గలుగుతుంది.

ఒక సంగతి ప్రత్యక్షంగా అర్థం అవుతోంది మనకు: అది యేమంటే, మనసు నిశ్శబ్దంగా వుంటే తప్ప స్పష్టతకు ఆస్కారం లేదు. తూర్పుదేశాలలో ధ్యానప్రక్రియ ప్రయోజనం అంతా యిదే; ఆలోచనను నిగ్రహించుకోవడం; మనసును ప్రశాంత పరచడం కోసం ఏవో స్తోత్రాలు చదువుకుని, తరువాత సమస్యను అవగాహన చేసుకునే ప్రయత్నం చేయడం. కాని, భూమిక అంటూ యేర్పడితే తప్ప – భయం, దుఃఖం, ఆదుర్దాల వంటి బోనులలో పడకుండా మనసు తాజాగా వుండలేదు. మనసు యిలాంటి ప్రశాంతతను చిక్కించుకోవడం యెలానో నాకు తెలియదు. అర్థం చేసుకోవటానికి చాల కష్టం యిది. మరొకళ్ళకు చెప్పడం మరింత కష్టం. మరొకళ్ళతో ప్రస్తావించడంలో వున్న యిబ్బంది యేమిటంటే – అర్థం చేసుకున్న దానిని మాటలలో యిమడ్చడం; అంతకన్నా కష్టం యిద్దరమూ ఒకే రకమైన తీవ్రతతో యేకకాలమందు వ్యవహరించడం; సమతలంలో వుండగలగడమూను. చదువుతున్న దానిని మీ పూర్వపాండిత్యం ద్వారా మీ యిష్టం వచ్చినట్లు భాష్యం చెప్పకుంటూ వుంటే యీ సందేశ ప్రసారం జరగదు. మన సుఖాలు, ఉద్దేశ్యాలు, అర్థం చేసు కోవడంలో పడే యాతన – యివన్నీ యేమీలేనప్పుడే ప్రసారం చక్కగా వుంటుంది.

జీవితంలో క్లిష్టాతి క్లిష్టమయిన విషయం యేమిటంటే – అందుకోవటానికి, సాధించటానికి, పొందటానికి పడే యాతన. మనం చిన్నతనం నుంచి పొందడంలోను, సాధించడంలోను మంచి శిక్షణ పొందాం. మెదడులోని కణాలు యిలాంటి సాధనకు అలవాటు పడిపోయినాయి. భౌతిక భద్రత కోసం అవి యీ పనిని సురక్షితంగా చేస్తాయి. అయితే, మానసిక భద్రత, యీ సాధన క్షేత్రంలోనిది కాదు. మనకు అన్ని సంబంధ బాంధవ్యాలలోను భద్రత కావాలి. వైఖరులు, కార్యకలాపాలు అందుకు అనుగుణంగానే వుంటాయి. అయితే – ముందే మనం గమనించినట్లు అసలు భద్రత అనేది యేమీలేదు. ఏ సంబంధంలోనైనా భద్రతకు ఆస్కారం లేదని గమనించడం – మానసికంగా శాశ్వతత్వం అనేది లేదని గ్రహించడం – జీవితానికి పూర్తిగా వేరయిన అవగాహనను తీసుకువస్తుంది. ఇల్లు, బట్ట, భోజనం విషయంలో బహిరంగ భద్రత వుండడం తప్పనిసరే. అయితే, ఆంతరిక భద్రత కోసం వెంపర్లాడడంలో యీ బహిరంగ భద్రత కూడా నాశనం అయిపోతోంది.

ప్రజ్ఞా పరిధులను అధిగమించటానికి స్థలవిరామం, సమయ విరామం అవసరం. స్వానురక్తిలో నిర్విరామంగా పనిచేస్తున్న మనసు ప్రశాంతంగా వుండడం ఎలా

సంభవిస్తుంది? మనసును నిగ్రహించవచ్చు, సంయమ పరచవచ్చు, రూపు దిద్దవచ్చు – కాని, యీ యాతనలు యేవీ దానిని ప్రశాంత పరచలేవు. దానిని మొద్దుబారేట్లు మటుకు చేస్తాయి. ప్రశాంత చిత్తం వుండాలి అనే ఆదర్శం, దానికోసం వెంపర్లాడడం విలువలేని సమాచారం. ఎందుకంటే, మనం బలవంతం చేసిన కొద్దీ అది మొరాయించడం చేస్తుంది; సంకుచితం – స్తబ్ధం అయిపోతుంది. నిగ్రహం అనేది యే రూపంలో వున్నా – అణచివేత మాదిరే – సంఘర్షణనే సృష్టిస్తుంది. నిగ్రహము, బాహ్యశిక్షణ – సరైన మార్గం కాదు. అలాగే సుశిక్షితం కాని జీవితం గూడా యే మాత్రమూ విలువైనది కాదు.

మన జీవితాలు చాలమటుకు సాంఘిక ఒత్తుడులకు, కుటుంబ అవసరాలకు, వ్యక్తిగత బాధలు – అనుభవాలకు, యేవో ఆదర్శవాదాలకు అనుగుణంగా వుండటానికి – చట్రంలో యిమిడి పోవటానికి – అలవాటు పడిపోయినాయి. ఇలాంటి క్రమశిక్షణ మరణసదృశం. శిక్షణ అనేది యెలాంటి నిగ్రహము లేకుండా జరగాలి. అణచివేత వుండగూడదు. భయం యే రకంగానూ స్థావరించుకు వుండగూడదు. ఈ రకమైన క్రమశిక్షణ ఎలా లభిస్తుంది? ముందు క్రమశిక్షణ – తరువాత స్వేచ్ఛ అనేది కాదు వరుస. స్వేచ్ఛ అనేది మొట్టమొదటిగా – ప్రారంభదశనుంచీ – వుండాలి; ఎప్పుడో చిట్టచివర కాదు. ఏదో యేర్పాటుకు కట్టుబడిపోయి వుండే శిక్షణనుండి స్వేచ్ఛ కావాలి. ఇలాంటి స్వేచ్ఛను అవగాహన చేసుకోవడమే క్రమశిక్షణ. అసలు నేర్చుకోవడం అంటేనే క్రమశిక్షణ – ఆ మాటకు ఉన్న వ్యుత్పత్తి అర్థం ప్రకారం. నేర్చుకోవడమే స్పష్టతను తీసుకువస్తుంది. నిగ్రహం యొక్క పూర్తి స్వభావము, నిర్మాణ క్రమము అర్థం చేసుకోవటానికి – దానిని అణచడం, లొంగడం ప్రక్రియలు తెలుసుకోవటానికి – ఎంతో సావధానత కావాలి. దాన్ని తెలుసుకునేందుకు క్రమశిక్షణ అవసరం లేదు; కాని – చదువుకోవడం, నేర్చుకోవడం అనే పనిలోనే ఎంతో స్వశిక్షణ వున్నది. దానిలో అణచివేత లేదు.

ఆధిపత్యాన్ని నిరాకరించటానికి (మానసిక ఆధిపత్యాన్ని గురించి మాట్లాడుతున్నాం మనం; దేశ చట్టాలను గురించికాదు), మతసంస్థల ఆధిపత్యాన్ని, సంప్రదాయ – అనుభవాల అధికారాలను – త్రోసిరాజు అనడానికి, ముందు అసలు ఎందుకు మనం విధేయులుగా తయారవుతున్నామో తెలుసుకోవాలి. జాగ్రత్తగా పరిశీలించాలి. ఆ పరిశీలన పరిపూర్ణ స్వేచ్ఛలో జరగాలి. సమర్థనలు, ఖండనలు, అభిప్రాయాలు, అమోదాలు ప్రవేశ పెట్టగూడదు. మనం ఆధిపత్యాన్ని అంగీకరించకుండానే దానిని పరిశీలించ వచ్చును. మానసిక నిర్మాణం అంతా సావధానంగా గమనించటానికి, మనలోని ఆంతరిక కల్పనలు తెలుసుకోవటానికి – ముందుగా స్వేచ్ఛ కావాలి. మనం పరిశీలిస్తున్నంత సేపూ, యీ చట్రాన్ని నిరాకరిస్తున్నాం. ఆ నిరాకరణే మనసుకు అవసరం అయిన వెలుగును, ఆధిపత్యం నుండి స్వేచ్ఛను తీసుకు వస్తుంది. బాహ్య క్రమశిక్షణ, నాయకత్వం, ఆదర్శవాదం – యిలా బయటకు అగుపించే వాటి నన్నిటినీ కాదని, వాటిని పరిశీలించాలి. ఆ పరిశీలనే శిక్షణ; శిక్షణ కాదు కూడాను. నిరాకరణే సవ్యమయిన పని. అందుచేత మనసును ప్రశాంతమయం చేయటానికి యిన్నాళ్ళు ఏయే చర్యలు అత్యవసరం అనుకున్నామో వాటన్నిటినీ నిరాకరిస్తున్నాం మనం.

అలా, ప్రశాంతతను తీసుకువచ్చేది నిగ్రహం కాదు అని గ్రహించాం. నిమగ్నత కాదు అని గూడా గ్రహించాం. కుర్రవాడికో ఆటబొమ్మ యిస్తాం; వాడు దానితో ఆడుకుంటూ అల్లరి చేయకుండా వుంటాడు. ఆ బొమ్మను తీసివేయి – వాడి ఆగం మళ్ళీ ప్రత్యక్షం. అలాగే మనం గూడా యేదో ఆట వస్తువులకు నిమగ్నమయిపోయి, అవి ప్రశాంతత తీసుకువస్తున్నాయని అనుకుంటున్నాం, భ్రమిస్తున్నాం. విజ్ఞానం, సాహిత్యపరం అయిన కార్యకలాపాల వల్ల ప్రశాంతత వస్తున్నదని ఒక భ్రమ. కొంత సమయం నిమగ్నత యేర్పడుతున్నదిగాని అది ప్రశాంతత కాదు.

శబ్దం ఆగిపోయినప్పుడు వుండే నిశ్శబ్దమే మనము ఎరుగుదుము. భావన ఆగిపోయినప్పుడూ నిశ్శబ్దం వుంటుంది. దీనినీ మనం ఎరుగుదుము. కాని, ఇవి నిజానికి నిశ్శబ్దం కాదు. నిశ్శబ్దం అనేది పూర్తిగా వేరు విషయం; సౌందర్యం, ప్రేమల మాదిరిగానే. ఈ నిశ్శబ్దం ప్రశాంత మనసువల్ల యేర్పడేది కాదు. మెదడు కణాలు తమ కార్యకలాపాలను అర్థం చేసుకుని, ప్రయత్నపూర్వకంగా నిశ్శబ్దాన్ని శాసించి తీసుకువస్తాయి. మనం పరిశీలిస్తున్న నిశ్శబ్దం యిది కూడా కాదు. సావధానత వల్ల యేర్పడేది కూడా కాదు నిశ్శబ్దం. ఎందుకంటే, అప్పుడు కొంత రాపిడి వుంటుంది.

సరే, ఈ నిశ్శబ్దం అంటే యేమిటో నేను వర్ణించి చెప్పాలనీ అప్పుడు మీరు మీకు తెలిసిన దానితో దానిని పోల్చిచూచుకుని వ్యాఖ్యానించుకుని అంగీకరించడమో అంగీకరించక పోవడమో చేద్దామనీ చూస్తున్నారు. నిశ్శబ్దాన్ని వర్ణించడం కుదరదు. తెలిసిన దానిని వర్ణించడం సాధ్యం అవుతుంది. తెలిసిన దానినుండి స్వేచ్ఛ – అనుదినమూ చనిపోవడం, తెలిసిన విషయాలను విసర్జించడం చేతనయితే అప్పుడు వస్తుంది. మీకు తటస్థపడే మానసిక గాయాలు, పొగడ్తలు, మీరు నిర్మించుకున్న అనేక రూపాలు, మీరు పొందిన అనేక అనుభవాలు – – వీటన్నిటికీ మీరు అంతరించిపోవాలి. అప్పుడే మెదడు కణాలు తాజాగా యౌవనంతో అమాయకంగా తయారవుతాయి. అయితే, ఆ అమాయకత్వం, ఆ తాజాతనం, ఆ లాలిత్యం సౌకుమార్యం – – ప్రేమను ఉత్పన్నం చేయవు. అది సౌందర్యం, నిశ్శబ్దం తాలూకు లక్షణం కూడా కాదు.

శబ్దం ఆగిపోవడంతోటే యేర్పడే నిశ్శబ్దం ఓ చిన్న ప్రారంభం మటుకే. ఓ చిన్న రంధ్రంలోంచి ప్రవేశించి క్రమంగా విస్తృతమయిన అగాధము అనంతము అయిన సముద్రంలోనికి జొరబడడం లాంటిది అది. కొలవరాని, కాలానికి అతీతమైన స్థితికి చేరుకోవడం. అయితే, యిది మాటలతో అర్థం చేసుకోవడం కుదరదు. ప్రజ్ఞయొక్క సంపూర్ణ స్వరూపం, సుఖం యొక్క అర్థం, దుఃఖం – నిరాశల అర్థం తెలుసుకుంటే కాని యిది అర్థంకాదు. మెదడు కణాలే ప్రశాంతంగా తయారయిపోయాయి. అప్పుడు మీరు ఎవరూ మీకు తెలివిడి చేయలేని, యేదీ నాశనం చేయలేని అద్భుత సందర్భం – అర్థంకాని సన్నివేశానికి చేరుకుంటారు. సజీవ మనసు నిశ్చలమైన మనసు. సజీవ మనసు కేంద్రబిందువు అంటూ లేని మనసు. ఆ మనసు అపరిమితమైనది. అదే సత్యం; అదే యేకైక యదార్థం.

# 15

## అనుభవం - సంతృప్తి - ద్వంద్వ ప్రవృత్తి - ధ్యానం.

మనకందరకు యేదో రకమయిన అనుభవం కావాలి. అద్భుతమైనది, మత్తైకమైనది; లైంగికమైనది; పుష్కలంగా ధనం, అధికారం, పదవి, ఆధిక్యతవున్న అనుభవం. మనం పెద్దవాళ్ళం అయిన కొద్దీ భౌతికమైన వాంఛలు అంతరించి పోవచ్చును గాని మనం యింకా విస్తృతము, ప్రగాఢము, మరింత ప్రముఖము అయిన అనుభవాలు వాంఛిస్తాము. వాటిని పొందటానికి ఎన్నో సాధనలు అవలంబిస్తాము – ప్రజ్ఞా వికాసం కోసం ప్రయత్నించడం యిందుకు ఒక ఉదాహరణ. ఇదో కళ – అలాగే మందులు మాకులు కూడా ఉపయోగిస్తాం. అనాది కాలంనుంచి వున్న తమాషా వ్యవహారం యిది – యేదో చిన్న ఆకును నమలడం; మెదడు కణాలమీద చురుకుగా పని చేయడానికి కొత్త కొత్త రసాయన ద్రవ్యాలు వాడడం, సత్యానికి సదృశమయిన ప్రజ్ఞా విస్తృతి, దర్శనం పొందటానికి చూడడం – ఇలా యింకా యింకా ఎక్కువ అనుభవాలు పొందాలి అని తాపత్రయ పడడం మనిషి యొక్క ఆంతరిక బీదరికానికి, దారిద్ర్యానికి తార్కాణం. ఈ అనుభవాలద్వారా మనం మన నుంచి పలాయనం కాగలం అనుకుంటాం. అయితే, యీ అనుభవాలన్నీ మన చేత – మనవల్లనే నిబద్ధితం అవుతున్నాయి. మనసు కొద్దిది, అసూయాగ్రస్తం, ఈర్ష్యాళువు, ఆదుర్దా కలది – అయినట్లయితే అది తాజాగా తయారయిన మందుమాత్రలు తీసుకోవచ్చును గాని – అది చూడగల దృశ్యాలు మాత్రం తాను సృష్టించుకున్నవే. తన నిబద్ధిత వాతావరణం నుంచే ముక్కలు ముక్కలుగా అనేక చిత్రాలను చూడగలుగుతుంది.

మనలో చాలమందిమి పూర్తిగా తృప్తిని యిచ్చే, ఎప్పటికీ కొనసాగగల అనుభవాలు, భావనచేత నాశనం కానటువంటివి కావాలనుకుంటాం. కనుక, అనుభవం కావాలనుకోవడం వెనకాల తృప్తి కావాలని కోరుకోవడం వుంటుంది. తృప్తికాంక్ష అనుభవాన్ని నిర్దేశిస్తుంది. అందుచేత మనం ముందుగా 'తృప్తి' తాలూకు పూర్తి వ్యవహారం తెలుసుకోవాలి. అందుతోపాటు అనుభవానికి వస్తున్న వస్తువునూ తెలుసుకోవాలి. ఏదో గొప్ప తృప్తి కలగడం అత్యంత సుఖాన్ని యిస్తుంది. ఎక్కువ కాలం మన్నుతుంది. లోతుగా విస్తృతంగా వుంటుంది అనుభవం – సుఖతరం అయినప్పుడు. అందుచేత సుఖమే మనకు కావలసిన అనుభవ రూపాన్ని నిర్దేశిస్తోంది. సుఖం కొలతతోనే మనం అనుభవాన్ని మలుచుకుంటున్నాం. కొలతలకు అందేది యేదయినా భావపరిధిలోనే వుండిపోతుంది. భ్రమలు సృష్టిస్తుంది. మీకు అత్యద్భుతం అయిన అనుభవాలు కలుగవచ్చును. అయినా, యింకా అసంతృప్తిగానే వుండవచ్చును.

మీ నిబద్ధతకు అనుగుణం అయిన రూపాలు - దృశ్యాలనే చూస్తారు. మీ నిబద్ధతకు అనుగుణమయిన చిత్రాలనే చూస్తారు. మీరు క్రైస్తునో, బుద్ధుడినో - ఎవరిని విశ్వసిస్తూ వుంటే వాళ్లనే చూస్తారు. మీ విశ్వాసం ఎంత మహత్తరంగా వుంటే ఆ దృశ్యం అంత దృఢతరంగా వుంటుంది. ఇవన్నీ మీ వాంఛలు, తపనల ప్రతిరూపాలే.

అందుచేత యేదయినా ప్రధానమైనది కావాలనుకుంటే - సత్యం వంటిది - సుఖం అనే ప్రమాణాన్ని ముందుగానే మీరు వెలికి తెస్తున్నారు. అనుభవం యెలా వుండాలో నిర్దేశిస్తున్నారు. అందుచేత యిది ఎంత మాత్రము చెల్లదు.

అనుభవం అంటే యేమనుకుంటున్నాం మనం? దానిలో యేదయినా కొత్తదీ అసలు అయినదీ వున్నదా? అనుభవం జ్ఞాపకాల పోగు. ఒక సవాలుకు బదులుగా బయలుదేరుతుంది. తన పూర్వ రంగం మీదనే పనిచేయ గలుగుతుంది. ఆ అనుభవాలను వ్యాఖ్యానించుకోవడంలో మీకు చాకచక్యం వున్నకొద్దీ అది ప్రతిస్పందన యిస్తూ వుంటుంది. అందుచేత మీరు యితరుల అనుభవాలనే కాకుండా మీ అనుభవాలను కూడా ప్రశ్నించుకు చూచుకోవాలి. ఒక అనుభవాన్ని గుర్తించలేక పోయినట్లయితే అది అసలు అనుభవమే కాదన్నమాట. ప్రతి అనుభవము లోగడ అనుభవంలోనికి వచ్చినదే; లేకపోతే మీరు దాన్ని గుర్తించలేరు. ఒక అసంభవాన్ని మంచిదనీ, చెడ్డదనీ, అందమయినదనీ, పవిత్రమనీ - - యిలా మీ నిబద్ధతను అనుసరించి గుర్తిస్తారు. కనుక, ఈ గుర్తింపు - అనుభవాన్ని బేరీజు వేసుకోవడం తప్పనిసరిగా పాతదే, వెనుకటి సందర్భానికి సంబంధించినదే.

మనకు సత్య స్వరూపం అనుభవం కావలెననే వాంఛ వుంటే - మనకందరికీ యీ వాంఛ తప్పనిసరిగా వుంది కదూ? - ఈ వాంఛ నెరవేరటానికి, ఆ అనుభవం ముందుగా మనకు తెలిసి వుండాలి. దానిని గుర్తించిన క్షణంలోనే - దానిని వెలికి తీసుకు వస్తున్నామన్నమాట. అందుచేత, అది భావన, సమయ క్షేత్రంలోనే వున్నది గనుక - నిజమయినది కాదు. భావన యిదే 'సత్యము' అని నిర్ధారణ చేసుకో గలిగితే, అది సత్యం కానేకాదు. మనకు 'కొత్త' అనుభవం గుర్తింపులోనికి రాదు. అది అసాధ్యం. మనకు లోగడ తెలిసిన విషయమే మన గుర్తింపుకు పాత్రం అవుతుంది. అందుచేత నాకు ఓ కొత్త అనుభవం కలిగింది అని చెప్పుకున్నప్పుడు, అది నిజానికి కొత్తదేమీ కాదన్నమాట. ప్రజ్ఞా విస్తృతి ద్వారా మరింత అనుభవాన్ని పొందవలెననుకొనడం - మందులు మాకుల ద్వారా జరుగుతున్న ప్రయత్నం యిదే - యింకా యీ ప్రజ్ఞా క్షేత్రపరిధిలోనే జరుగుతూవున్న పని. అందుచేత అది పరిమితమయినది.

కనుక, మనం ఒక ప్రధానమైన సత్యాన్ని కనుగొన్నాము. అదేమంటే - అన్వేషిస్తూ, తాపత్రయపడుతూ, విస్తృత - ప్రగాఢ అనుభవం కోసం చూస్తున్నామంటే, మన మనసు చాల సంకుచితము, బద్ధకమయినదీ అన్న మాట. అది ఎంతసేపూ జ్ఞాపకాల పైననే ఆధారపడి జీవించాలని చూస్తుంది.

మనకు యెలాంటి అనుభవము లేకపోతే, అప్పుడు మనకు యేమవుతుంది? మనం అనుభవాలమీద, సవాళ్లమీద, ఆధారపడతాం - మెలుకువగా వుండటానికి. మనలో

సంఘర్షణలు యేమీ లేకపోతే, యేమీ మార్పులు – గందరగోళాలు లేకపోతే మనమంతా ప్రగాఢంగా నిద్రపోతాం – అందుచేత మనలో చాలమందికి సవాళ్లు చాల అవసరం. సవాళ్లు లేకపోతే మనసు మొద్దుబారి, బద్ధకంగా అయిపోతుందనుకుంటాం. అందుచేత సవాలుపైన, అనుభవంపైన, ఎక్కువ హుషారుపైన, తీవ్రతపైన ఆధారపడతాం – మనసును పదునుపట్టటానికి. కాని, యిలా ఆధారపడటం వల్ల మన మనసులు ఎక్కువ సోమరిగా బద్ధకంగా తయారవుతున్నాయి. మెలుకువ లేకుండా పోతోంది. కనుక – నన్ను నేను ప్రశ్నించుకుంటున్నాను, సంపూర్ణంగా మెలుకువగా వుండటానికి వీలున్నదా – ఏవో కొన్ని అంశాలలోమటుకే కాకుండా పరిపూర్ణంగా – అని. ఏ సవాలు, అనుభవం లేకుండా పూర్తిగా మెలుకువగా వుండగలుగుతున్నానా? దీనికి ఎక్కువ సునిశితత్వం కావాలి; స్థూలము – సూక్ష్మమూ కూడా. అంటే – నాలో ఎలాంటి వాంఛలు జబర్దస్తీలు వుండగూడదు. ఎందుకంటే, వాంఛ బయలు దేరడంతోటే అనుభవం వస్తోంది. వాంఛ, తృప్తుల నుండి స్వేచ్ఛ పొందటానికి నన్ను నేను అంతరికంగా పరిశీలించి చూచుకోవాలి. వాంఛ యొక్క సమగ్ర రూపాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలి.

వాంఛ ద్వంద్వ ప్రవృత్తినుండి జనిస్తోంది; 'నేను అసౌఖ్యంగా వున్నాను, సుఖంగా వుండాలి.' ఈ రకమైన వాంఛలోనే, సుఖంగా వుండాలని అనుకోవడంలోనే అసౌఖ్యం యిమిడి వుంది. మంచిగా వుండడం కోసం ప్రయత్నం చేసినప్పుడు, ఆ మంచితనంలోనే తద్వ్యతిరేకత గూడా యిమిడివుంది. ప్రతి ప్రకటనలోనూ దాని విరుద్ధ భావం కూడా వుంది. గెలుపొందాలనే ప్రయత్నంలోనే దేనిమీద జయం సాధించాలనుకుంటున్నామో దానినే బలవత్తరం చేస్తున్నాం. సత్యం, యదార్థం తాలూకు అనుభవం కావాలని వాంఛించినప్పుడు, ఆ వాంఛ మీ అసంతృప్తిలోంచి పుట్టుకు వస్తోంది అని గమనించండి. ప్రస్తుత పరిస్థితిలో మీకు అసంతృప్తి వుంది; వాంఛ యిందుకు వ్యతిరేకతను సృష్టిస్తోంది. వ్యతిరేకతలో యిదివరకు వున్నదంతా – గతం – గూడుకట్టుకు వుంది. కనుక, అంతులేని యీ వాంఛలనుండి మనం దూరంగా స్వేచ్ఛగా వుండాలి. లేకపోతే ద్వంద్వ ప్రకృతికి అంతులేకుండా పోతుంది. అంటే – మీ మనసు యిప్పుడేమీ కోరుకోవడం లేదు, వెదుకులాడడం లేదు అన్న సంగతి మీకు సంపూర్ణంగా తెలియడం అన్నమాట.

అటువంటి మనసు అనుభవాన్ని కోరదు. సవాలును కావాలనుకోదు. అసలు సవాలు అంటే యేమో దానికి తెలియదు. 'నేను నిద్రపోతున్నాను,' లేక 'నేను మెలుకువగా వున్నాను' అని చెప్పదు. తాను యేమిటో అదే అయివుంటుంది పూర్తిగా. నిరాశాపూరితమైన, సంకుచితమైన, కురచైన, నిబద్ధిత మనసు మటుకే యెప్పుడూ యేదో ఒకటి మరింత కావాలనుకుంటుంది. ఈ ప్రపంచంలో మరోలా సాధ్యమా? అలా కాకుండా జీవించటానికి వీలవుతుందా? పోలికలు లేకుండా వుండగలమా? నిశ్చయంగా అటువంటి జీవితం సాధ్యమే. అయితే, ఆ విషయాన్ని ఎవరికి వారు కనుగొనాలి.

ఈ ప్రశ్న అంతటినీ అన్వేషించి తరచి చూచుకోవడమే ధ్యానం. ఈ మాట ప్రాక్ పశ్చిమ దేశాలలో దురదృష్టవశాత్తు యిష్టం వచ్చినట్లుగా వాడుతున్నారు.

ధ్యానానికి అనేక ప్రక్రియలు, పద్ధతులు, పాఠశాలలు వున్నాయి. 'నీ కాలి మడమను గమనించు. గమనించు. గమనించు' అని చెప్పే పద్ధతులు వున్నాయి. తతిమ్మా ప్రక్రియలలో ఎలా కూర్చోవాలో, ఎలా గాలి పీలవాలో, ఎటుకను సాధన చేయాలో చెబుతారు. ఇదంతా పూర్తిగా యాంత్రికమయిన సమాచారమే సుమా! మరో పాఠశాలలో అయితే మీకో మంత్రం యిస్తారు. దాన్ని జపం చేయమంటారు; యేదో భావాతీత అనుభవం వస్తుంది యిందువల్ల - అంటారు. ఇదంతా పరమ చెత్త. నిన్ను నీవు సమ్మోహ పరుచుకోవడం. ఆమెన్ - ఓం - కోకాకోలా వంటి పదాలు నిరవధికంగా జపించినందువల్ల యేదో ఒక అనుభవం తప్పనిసరిగా వస్తుంది. ఎందుకంటే, పునశ్చరణ వల్ల మనసు ప్రశాంతం అవుతుంది. భారతదేశంలో వేలాది సంవత్సరాలుగా సాధనచేసిన ప్రక్రియ యిదే. మంత్రయోగం అని పిలుస్తారు దీన్ని. పునశ్చరణ - జపం - వల్ల, మనసును ఉదారంగా సుతిమెత్తనగా తయారవమని ఆదేశించవచ్చు. అయినా, అది యింకా చిలిపిగా, సంకుచితంగా, అల్పంగా వుండవచ్చును. ఉద్యానవనంలో యేరిన ఒక క(ర)పుల్లను బల్లమీద పెట్టి దానికి ప్రతిరోజూ ఒక పుష్పాన్ని సమర్పించవచ్చును. ఒక నెల రోజులు యిలా చేశారంటే మీరు పూజచేసినట్లు అవుతుంది. తరువాత మానివేస్తే పాపం వస్తుంది.

ధ్యానం అంటే ఒక పద్ధతిని, విధానాన్ని అనుసరించడం కాదు. ఒకే మాటను పదేపదే ఉచ్చరించడం, అనుకరించడం కాదు. ధ్యానం అంటే, అవధానం కాదు. అవధానం నేర్చుకోమని చాలమంది గురువులు తమ శిష్యులను వేధించుకు తింటారు. అంటే మనసును ఒక స్థిరమైన భావనపైని కేంద్రీకరించి వుంచడం; యితర భావనలను దూరంగా తరిమి కొట్టటం. ఇది చాల అవివేకమైన అసంగతమైన విషయం. ఏ బడి కుర్రవాడయినా చేయగలడు యీ పని కాస్త ప్రయత్నిస్తే. అంటే, ఎప్పుడూ మీలో ఒక పోరాటం జరుగుతూ వుంటుందన్నమాట. ఒక భావనే వుండాలనీ, యితర భావనలు వుండగూడదనీ ఒక పక్షం. ఇతర భావనలు ముసురుకుంటూ మరో పక్షం. అయితే, మీరు మనసులోని ప్రతి కదలికకు సావధానంగా గమనం యివ్వవలసి వుంది. అది ఎక్కడకు పరుగెత్తుతోందో గమనించాలి. మీ మనసు యెక్కడికో పరుగెత్తుతోంది. అంటే - మీ ఆసక్తి యింకా దేనిమీదనో వున్నదన్న మాట!

ధ్యానానికి చాల చురుకు అయిన మనసు కావాలి. జీవితాన్ని సమగ్రంగా సంపూర్ణంగా అర్థం చేసుకోవడమే ధ్యానం. ఇప్పుడు మనసులో ముక్కలు - తునకలు లేవు. ధ్యానం అంటే భావనను నియంత్రణం చేయడం కాదు. నియంత్రణం చేయడంతోటే సంఘర్షణ మొదలవుతుంది. భావనయొక్క స్వరూపము, నిర్మాణము అర్థం చేసుకుంటే - దాని మొదలును గమనిస్తే; ఈ పని మనం యిప్పటికే చేశాం - అప్పుడు భావన జోక్యం కలిగించుకోదు. భావన నిర్మాణ స్వరూపాన్ని అర్థం చేసుకోవడమే స్వయం శిక్షణ; అదే ధ్యానం.

ప్రతి భావనను ఎరిగి వుండడం ధ్యానం. ప్రతి రాగభావాన్ని - అది సరయినదని, కానిదని తీర్మానాలు చేయకుండా ఎరగడం, గమనించడం, దానితోపాటు ముందుకు కదలడం. ఆ గమనంలో మీరు భావన, రాగభావాలతోపాటు ముందుకు నడుస్తారు. ఈ ఎటుకనుంచి నిశ్శబ్దం ఉత్పన్నం అవుతుంది. భావన యేర్చికూర్చిన నిశ్శబ్దం

అంటే – మురుగు పదార్థం; మృతం. కాని, భావన తన ప్రారంభాన్ని గమనించిన వెనుక యేర్పడిన నిశ్శబ్దం – ధ్యానం అవుతుంది. ఇందులో ధ్యానం అగుపించదు. ఎందుకంటే, మనసు తనలోనుంచి గతాన్ని అంతటనీ తుడిచివేసుకుంది.

ఈ పుస్తకాన్ని మీరో గంటసేపు శ్రద్ధగా చదివారంటే – అదే ధ్యానం. ఏవో నాలుగుమాటలు ఏరుకుని, ఏదో కొన్ని అభిప్రాయాల గురించి తరువాత ఆలోచించుకుందాం అనుకుంటే – అది ధ్యానం అవదు. ధ్యానం మానసిక స్థితి; ప్రతిదానిని పూర్తి సావధానంతో – ముక్కలుముక్కలుగా, కాకుండా, సంపూర్ణంగా చూస్తుంది. సావధానత అనేది ఎలా వస్తుందో మీకు ఎవరూ బోధించలేరు. ఈ బోధనకు యేదయినా పద్ధతి, ప్రకారం వుంటే – మీ గమనం అంతా ఆ పద్ధతి పైననే వుంటుంది. అది సావధానత కాదు. ధ్యానం జీవితంలోని మహోన్నత కళలలో ఒకటే. బహూశ మహత్తరమైనది కూడా. దానిని యితరులనుండి నేర్చుకోవడం సాధ్యంకాదు. అదే దానిలో వున్న సౌందర్యం. అది ఒక వైఖరి కాదు; కనుక దానికి ఆధిపత్యం లేదు. మిమ్మల్ని గురించి మీరు తెలుసుకున్నప్పుడు, గమనించినప్పుడు, ఎలా నడుస్తున్నారు – తింటున్నారు – మాట్లాడుతున్నారు – వృధాప్రసంగం ఎంత – అసహ్యం, ఈర్ష్య వున్నాయా – – – యివన్నీ చూచుకున్నప్పుడు, యేమాత్రం ఎంపిక లేకుండా పోయి, అదే ధ్యానంలో భాగం అయిపోతుంది.

అందుచేత మీరు బస్సులో ప్రయాణం చేస్తున్నప్పుడు, అడవిలో నడుస్తున్నప్పుడు – నీడలు, వెలుగులు దోబూచులాడుతున్నప్పుడు – పక్షుల కిలకిలారావాలు వింటున్నప్పుడు, మీ భార్య లేక పిల్ల ముఖం వంక చూస్తున్నప్పుడు ధ్యానం సందర్భపడటానికి అవకాశం వుంది.

ధ్యానాన్ని అర్థం చేసుకోవడంలోనే ప్రేమ వుంది. ప్రేమ ప్రక్రియల – పద్ధతుల – అలవాట్ల ఫలితంగా యేర్పడేదికాదు. భావనతో ప్రేమను అలవరచుకోవడం సాధ్యంకాదు. పరిపూర్ణ నిశ్శబ్దం వున్నప్పుడు ప్రేమ సంభవం. 'ధ్యానం చేస్తున్న మనిషి' అంటూ యెవరూ లేని నిశ్శబ్దం. భావన, రాగభావంగా తన కదలికను అర్థం చేసుకున్న మనసే నిశ్శబ్దాన్ని చేరువ చేసుకోగలదు. ఈ కదలికలను అర్థం చేసుకోవటానికి, సమర్థనలు – ఖండనలు వుండగూడదు. అలా పరిశీలించడం క్రమశిక్షణ. అలాంటి క్రమశిక్షణ స్రవిస్తుంది. స్వేచ్ఛగా అలరారుతుంది; అంతేగాని, కట్టుబాటుకు ఫలితంగా యేర్పడదు.

★ ★ ★

# 16

## సంపూర్ణ విప్లవం - మత్తైకమనసు - జీవశక్తి - ఉద్వేగం.

ఈ పుస్తకం పొడుగునా మన ప్రయత్నం యేమంటే, మనలో – మన జీవితాలలో సంపూర్ణ విప్లవాన్ని తీసుకురావడం. ఈ విప్లవానికి సంఘస్వరూపంతో ఎలాంటి సంబంధం లేదు. సంఘం ఉన్నది ఉన్నట్లుగా – బహూభయానక మయినది. అంతులేని దురాక్రమణ యుద్ధాలు, యీ దురాక్రమణ స్వరక్షణ కోసం అయినా – దౌర్జన్యం అయినా – యీ సంఘంలో భాగం. మనకు అవసరమైనది, పూర్తిగా నూతనమైనది – ఒక విప్లవం, ఒక తక్షణ మార్పు – మానసిక వాతావరణంలో. పాత మేధస్సు మానవ సంబంధాలలో పొడసూపే సమస్యలను పరిష్కరించలేదు. పాత మెదడు ఆసియాది, యూరోపుది, అమెరికాది లేదా ఆఫ్రికాది. అందుచేత మనం అడుగుతున్నది యేమంటే, మన మెదడు కణాలలో తక్షణమమయిన మార్పును తీసుకురావడం సాధ్యమా – అని.

మళ్లీ ప్రశ్నవేసుకుందాం: మనసు మనం చాలవరకు చక్కగా అర్థం చేసుకున్నాం గనుక, ఈ క్రూర, హింసాత్మక, నిర్లక్ష్య ప్రపంచంలో – నైపుణ్యం విపరీతంగా పెరిగి కర్కశత్వంగా రూపొందుతున్న ఈ ప్రపంచంలో – దైనందిన జీవితం గడుపుతూన్న మనం కేవలం బాహ్య సంబంధాలలో మటుకే కాకుండా, ఆలోచన – భావోద్వేగం – ప్రవర్తన – ప్రతిచర్యల రంగాలలో కూడా సంపూర్ణంగా విప్లవం తీసుకు రాగలమా? తీసుకు రావడం సాధ్యమా మామూలు మనిషికి?

మనిషిలో వున్న హింసాత్మకతను ప్రస్ఫుటంచేస్తూ రోజూ ఎన్నో దారుణకాండలు జరుగుతున్న విషయం మనం చూస్తున్నాం, చదువుతున్నాం. 'నేను దానిని గురించి యేమీ చేయలేను' అని మీరు అనవచ్చును; లేదా 'ఈ ప్రపంచాన్ని నేను ఎలా ప్రభావితం చేయగలను?' అని అడగవచ్చును. మీ అంతట మీరు హింసాపూరితులు, దౌర్జన్యపరులు కాకపోయినట్లయితే మీరు ప్రపంచాన్ని మహోద్భుతంగా ప్రభావితం చేయవచ్చును అనుకుంటాను. మీ దైనందిన జీవితం శాంతియుతం అయి వుండాలి; జీవన పోరాటం మీలో వుండగూడదు. దురాశ, అసూయ వుండగూడదు. శత్రుత్వాన్ని సృష్టించే జీవిత గమనం కాకూడదు మీది. చిన్న చిన్న నిప్పురవ్వలే క్రమంగా రాజుకుంటాయి. మన స్వార్థపూరిత కార్యక్రమాలతో, మన అహంభావం – అసహ్యం – జాతీయ భావాలతో ఈ ప్రపంచాన్ని ప్రస్తుత గందరగోళ స్థితికి దిగజార్చాము. ఇప్పుడు – దీనిని గురించి నేను యేమీ చేయలేను అంటున్నామంటే – క్రమరాహిత్యమే మన జీవన విధానం అని అంగీకరిస్తున్నమన్నమాట. మనం

ప్రపంచాన్ని తునాతునకలు చేసివేశాం. మనమే ముక్కలు ముక్కలయిన మనుషుల మైనప్పుడు ప్రపంచంతో మన సంబంధాలన్నీ యిలా ముక్కముక్కలయే వుంటాయి. ప్రపంచం కూడా ముక్కలయి పోతుంది; ఛిన్నాభిన్నం అవుతుంది. అలా కాకుండా మనం సమగ్రంగా సంపూర్ణంగా ఆచరణ సాగించినట్లయితే, ప్రపంచంతో మన సంబంధం బ్రహ్మాండమయిన విప్లవాన్ని తీసుకువస్తుంది.

ఏది యేమయినా, ప్రతి గమనమూ – ప్రగాఢమయిన ప్రతి చర్య మనలో ప్రతి ఒక్కరితోను ప్రారంభం కావాలి. నేను మారాలి ముందు. ప్రపంచంతో నాకున్న సంబంధం యేమిటి, దాని స్వరూప నిర్మాణం యెలాంటిది అని నేను అర్థం చేసుకోవాలి. ఈ అర్థం చేసుకోవడమే – చూడడమే, గమనించడమే ఆచరణకు నాంది. కనుక నేను, ఈ ప్రపంచంలో నివసిస్తున్న మానవ మాత్రుడిని, వేరయిన లక్షణాన్ని తీసుకు రాగలను. ఆ లక్షణం – నాకు అనిపిస్తుంది – మతైక మనసుకు చెందినదని.

మతైక మనసు – మతాన్ని విశ్వసించే మనసుకంటే భిన్నమయినది. మీరు మతైక మానవులై – తిరిగి హిందువులు, ముసల్మానులు, క్రిస్టియన్లు, బౌద్ధులు కాలేరు. మతైక మనసు అన్నింటినీ వాంఛించదు. అది సత్యంతో ప్రయోగాలు చేయదు. సత్యం అనేది మీ సుఖాలు – దుఃఖాలు, హిందువుగానో యింకేదో మతానుయాయిగానో మీ నిబద్ధత నిర్దేశించే విషయం కాదు. మతైక మనసు స్థాయి యేమిటంటే, దానిలో భయం లేదు; ఎలాంటి విశ్వాసాలు లేవు. ఉన్నది – యదార్థంగా ఉన్నది మటుకే అందులో ఉంది.

భావనచేత ప్రభావితం అయిన నిశ్శబ్దం కాదు దానిలో వున్నది. ఎటుకవల్ల, ధ్యానపరుడు లేని ధ్యానంవల్ల యేర్పడిన నిశ్శబ్దత అది. ఆ నిశ్శబ్దంలో జీవశక్తి వున్నది. ఈ స్థాయిలో ఎలాంటి సంఘర్షణలు లేవు. జీవశక్తి అంటే ఆచరణ, కదలిక – గమనము. ప్రతి పనీ కదలికే. ప్రతి ఆచరణ శక్తే. ప్రతి కోరిక శక్తే. రాగభావం అంతా శక్తే. భావన అంతా శక్తే. జీవనం అంతా శక్తే. జీవితం అంతా శక్తే. ఈ శక్తిని ఎలాంటి అవరోధాలు లేకుండా స్రవించనిచ్చినప్పుడు – అప్పుడు అది పరిధులు లేనిది, అనంతమైనది అవుతుంది. వైరుధ్యాలు, ఒరిపిడులు, సంఘర్షణలు దీనిని తాకగూడదు. ఒరిపిడే లేనప్పుడు శక్తి క్షేత్రానికి సరిహద్దులు వుండవు. శక్తికి పరిమితులను తీసుకువస్తున్నది, అపాదిస్తున్నది ఈ ఒరిపిడే. ఒక్కమారు యీ పరిస్థితిని గమనించిన మీదట – మనిషి ఎందుకు తిరిగి తిరిగి శక్తి ప్రసారంలోకి ఈ ఒరిపిడులను తీసుకు వస్తున్నాడు? జీవిత గమనంలో ఈ ఒరిపిడులను ఎందుకు ప్రవేశపెడతున్నాడు? స్వచ్ఛమైన శక్తి, ఎలాంటి పరిమితులు లేని శక్తి – కేవలం ఊహ, అభిప్రాయము మటుకేనా? దానికి యదార్థత లేదా?

మనలో సంపూర్ణ విప్లవం తీసుకు రావటానికి మాత్రమే కాదు మనకు శక్తి కావలసినది; పరిశీలనకు – చూడటానికి – కార్యాసక్తులం కావడానికీ శక్తి అవసరం. మన సంబంధ బాంధవ్యాలలో ఏ మాత్రం ఒరిపిడివున్నా – భార్యాభర్తల మధ్య, మనిషికీ మనిషికీ నడుమ, ఒక గుంపుకు మరో గుంపుకు మధ్య, ఒక దేశానికి యితర దేశాలకు మధ్య, ఒక ఆదర్శవాదానికి యితర వాదాలకు నడుమ – బాహ్య

సంఘర్షణ, అంతరిక సంఘర్షణ వుంటే, అది ఎంత సూక్ష్మమయిందయినా – శక్తి వృథా అవడానికి దోహదం చేస్తుంది; శక్తిని దుర్వ్యయం చేస్తుంది.

పరిశీలనకు, పరిశీలన వస్తువుకు నడుమ సమయ విరామం వున్నంత వరకు, అది ఒరిపిడి తీసుకు వస్తుంది; అందువల్ల శక్తి దుర్వినియోగం అవుతుంది. పరిశీలకుడే పరిశీలన వస్తువు అయినప్పుడు ఈ శక్తి మహోన్నత స్థాయిలో సమీకరించడం జరుగుతోంది, రెంటికీ మధ్య సమయ విరామం లేదు గనుక, ఉద్దేశ్య రహితమయిన శక్తి వుంటుంది; 'అహం' అనేది అడ్డుపడడం లేదు గనుక అది సజావుగా స్రవించి కార్యాచరణకు దారితీస్తుంది.

మన జీవితాలలోని గందరగోళం అర్థం చేసుకుందుకు మనకెంతో శక్తి అవసరం. 'నేను తెలుసుకోవాలి' అనుకోవడం అన్వేషణకు తగిన జీవసత్త్వాన్ని తీసుకు వస్తుంది. కాని, తెలుసుకోవడం – వెదకడంలో సమయ విరామం వుంది; మనసును కాలక్రమంలో నిబద్ధత నుంచి విముక్తం చేసుకోవడం – జరగని పని అని ముందే గమనించాం. కాలం మార్గం కాదు. మనం వృద్ధులం అయినా, యువకులం అయినా, యిప్పుడే జీవన క్రమం అంతా వేరయిన ప్రమాణంలోనికి తీసుకు రావాలి. మనకంటే వ్యతిరేకమయిన దానిని వెదకడం మార్గంకాదు. ఒక పద్ధతి, తత్త్వవేత్త, గురువు, పురోహితుడు చెప్పే కృత్రిమ క్రమశిక్షణ కూడా మార్గంకాదు. ఇదంతా బాల చేష్ట. ఈ సంగతి గమనించినప్పుడు ఒక ప్రశ్న వేసుకుంటాం: శతాబ్దాల తరబడి వుంటూ వచ్చిన యీ నిబద్ధతను మనం తక్షణమే బద్దలు కొట్టగలమా? దానిని బద్దలు చేసి తిరిగి మరో నిబద్ధత లోనికి జొరబడకుండా వుండగలమా? స్వేచ్ఛగా వుండాలి. అప్పుడు మనసు నూతనంగా, సున్నితంగా, సజీవంగా, ఎఱుకతో, తీవ్రంగా, సమర్థవంతంగా వుంటుంది. ఇదీ మన సమస్య. మరే సమస్య లేదు; ఎందుకంటే, మనసు నూతనంగా తయారయినప్పుడు అది అన్ని సమస్యలను పరిష్కరించుకుంటుంది. మనసు ప్రశ్నించుకోవలసింది యిదే; యీ ఒక్క ప్రశ్నే.

కాని, యీ ప్రశ్న మనం వేసుకోము. మనకు ఎవరో చెప్పాలి. పదివేల సంవత్సరాల ప్రచారానికి ఫలితంగా మనం రూపొంది వున్నాం గనుక మన మానసిక నిర్మాణం యెంత విచిత్రంగా తయారయిందంటే – మనకు అన్నీ ఎవరో చెప్పాలి. మన ఆలోచన క్రమం యింకెవరో నియంత్రించాలి; సరిగా వున్నదని ముద్ర వేయాలి. ప్రశ్న వేయడం – అంటే, మనను మనం అడగడం. నేను చెప్పేది చాల కొద్దిపాటి విలువ వున్న విషయం. ఈ పుస్తకం మూసివేయగానే దాన్ని మీరు మరచిపోతారు. లేదా, యేవో కొన్ని మాటలు గుర్తు పెట్టుకు వల్లిస్తారు. లేదా, మరో పుస్తకంలో మీరు చదివి వున్న సంగతులతో దీన్ని పోల్చి చూచుకుంటారు. అంతేగాని, మీ జీవితాన్ని మీరు ముఖాముఖి దర్శించరు. అదే కావలసింది – మీ జీవితం, మీరు, మీ అల్పత్వం, మీ కొద్దితనం, మీ క్రౌర్యం, మీ హింసా ప్రవృత్తి, మీ దురాశ, మీ వాంఛ, మీ దైనందిన బాధలు, అంతులేని దుఃఖం – ఇదే మీరు అర్థం చేసుకోవలసింది. భూమిపైనగాని, స్వర్గంలోగాని వున్న యింకెవరో మిమ్మల్ని యీ పరిశ్రమనుంచి రక్షించలేరు. మీరే పూనుకోవాలి.

మీ దైనందిన జీవితంలో జరుగుతున్నదంతా చూస్తూ, దినచర్యలు గమనిస్తూ – మీరు కలాన్ని పట్టుకున్నా, మాట్లాడినా, కారులో బయటకు వెళ్లినా, అడవులలో వంటరిగా షికారు చేసినా – మీరు ఒకే ఊపిరిలో, ఒకే శ్వాసలో, ఒకే వీక్షణంలో మిమ్మల్ని మీరు పూర్తిగా తెలుసుకోగలరా? మిమ్మల్ని మీరు ఉన్నవారు ఉన్నట్లుగా తెలుసుకుంటే అప్పుడు మనిషి పరిశ్రమ, అతని మోసాలు, అతని ద్వంద్వ ప్రవృత్తి, అన్వేషణ – వీటి పూర్తి స్వరూపం తెలిసివస్తుంది. ఈ పని చేయటానికి మీకు నిలువెల్లా నికార్సయిన నిజాయితీ వుండాలి. మీ సిద్ధాంతం ప్రకారం పనులు చేస్తున్నారంటే మీలో నిజాయితీ లోపిస్తోంది. మీ భావనను అనుసరించి చరిస్తూవుంటే మీ నిజస్వరూపం బయటపడదు. ఆదర్శాలు వుండడం బహు కఠోరమయిన సంగతి. మీకు ఆదర్శాలు, నమ్మకాలు, సిద్ధాంతాలు వుంటే మిమ్మల్ని మీరు ఉన్నది ఉన్నట్లుగా చూచుకోలేరు; ముఖాముఖి గమనించలేరు. అందుచేత మీరు పూర్తిగా అన్యులు కాగలరా? పూర్తిగా ప్రశాంతచిత్తులై ఆలోచించకుండా, భయపడకుండా – అయినా అసాధారణంగా, ఉద్వేగంగా సజీవులై వుండగలరా?

ఆ మానసిక స్థితి – యే వెంపర్లాటలు లేనిది – నిజమైన మతైక మనసు. ఈ స్థితిలోనే సత్యాన్ని, యదార్థాన్ని, ఆనందాన్ని, భగవంతుడిని, సౌందర్యాన్ని, ప్రేమను చూడగలరు. దీనిని ఆహ్వానం చేయడం అసందర్భం. ఆ విషయాన్ని స్పష్టంగా గమనించండి ముందు. దీనిని ఆహ్వానం చేయలేరు, ఆయత్తం చేయలేరు. ఎందుకంటే, మనసు చాల చిలిపిది, కొద్దిది. మీ ఉద్వేగాలు కలగాపులగంగా వుంటాయి; మీ జీవన విధానం మరీ గందర గోళంగా వుండి ఆ మహోన్నత స్థితిని ఆవాహన చేయలేదు. ఆ మహోత్తమ స్థితి – మీ యిరుకు యింటికి రాలేదు; మీరు ఉమ్మి వేతలతో కలుషితం చేసిన మూలలకు అది రాదు. మీరు ఆహ్వానించలేరు. ఆహ్వానించాలంటే దానిని మీరు ఎరిగి వుండాలి. దానిని మీరు ఎరగలేదు. ఎవరయినా చెప్పనివ్వండి. 'నేను ఎరుగుదును' అని ఎవరేనా అన్నారంటే, అతనికి సుతారమూ తెలియదన్నమాట. దానిని కనుగొన్నాను అని మీరు చెప్పారంటే, ఆ క్షణమే మీరు దానిని కనుగొనలేదన్నమాట. దానిని అనుభూతికి తెచ్చుకున్నాను అన్నారంటే, మీకు అది ఎప్పుడూ అనుభవం కాలేదన్నమాట. ఇవన్నీ యితరులను మభ్యపెట్టి దోచుకునేందుకు మార్గాలు. – అవతలి మనిషి మీ స్నేహితుడయినా సరే, మీ శత్రువు అయినా సరే. ఇదంతా దోపిడీయే.

ఇప్పుడు ఒక ప్రశ్న వేయటానికి ఆస్కారం వుంది.. అనాహ్వానితంగా యీ స్థితికి చేరుకోవటానికి వీలున్నదా? వేచి వుండకుండా – అన్వేషించకుండా – లోతుపాతులు తవ్వకుండా – యీ స్థితిని చేరుకునే సాధ్యత వున్నదా? కిటికీ తలుపు తెరిచి వున్నప్పుడు చల్లనిగాలి లోనికి ప్రవేశించినట్లుగా అది మీకు సంప్రాప్తం అవుతుందా? మీరు మారుతాన్ని ఆహ్వానించలేరు; కాని, కిటికీ తలుపులు తెరుచుకు వుంచుకోగలరు. అంటే, దానికోసం వేచివున్నారని అర్థం కాదు మళ్లీ. అది మరో రకమైన మోసం అవుతుంది. దానిని అందుకునేందుకు మీరు తెరుచుకు కూర్చోవాలనికాదు. అది మళ్లీ మరో రకమైన భావన అవుతుంది.

మానవులకు యిది యెందుకు లోపించింది – అని ఎన్నడయినా మిమ్మల్ని

మీరు ప్రశ్నించుకున్నారా? మనుషులు పిల్లల్ని కంటారు. లైంగిక వ్యాపారాల్లో మునిగిపోతారు. లాలిత్యం వున్నది. స్నేహభావంలో యితరులతో కలిసిపోయి యిచ్చి పుచ్చుకోవటాలు చేస్తారు. స్నేహంగా వుంటారు. సహకరిస్తారు – – – కాని, యీ వస్తువు – – ఎందుకు వాళ్లకు అందకుండా పోయింది? ఏదో మురికి వీధిలో సోమరిగా తిరుగాడుతున్నప్పుడు, బస్సులో ప్రయాణం చేస్తున్నప్పుడు, సముద్రతీరంలో సెలవు రోజులు గడుపుతున్నప్పుడు, అసంఖ్యాకమయిన పక్షులు, చెట్లు, వాగులు, వన్యమృగాలతో నిండిన అడవిలో తిరుగాడుతున్నప్పుడు – – మీకు యీ విషయం తట్టలేదా? ఎందుకని – మనిషి లక్షలాది సంవత్సరాలుగా బతుకుతున్నాడు గదా, దీన్ని ఎందుకు పొందలేకపోయాడు – అని ప్రశ్నించుకున్నారా? ఈ అసాధారణ 'వాడని పుష్పం' అతనెందుకు చేజిక్కించుకోలేకపోయాడో ప్రశ్నించుకున్నారా? ఎంతో సామర్థ్యం వున్న మీరు – మనిషిగా – తెలివితేటలు, మోసాలు, పోటీ, అద్భుత శాస్త్ర పరిజ్ఞానం వున్న మీరు; ఆకాశంలోను భూమిమీద సముద్రగర్భంలోను చరించగలిగి గూడా – ఎలక్ట్రానిక్ మెదడులను సైతం అన్వేషించగల మీరు అత్యంత ప్రధానం అయిన ఈ వస్తువును ఎందుకు లభ్యం చేసుకోలేక పోయారు? మీ హృదయం యెందుకు ఖాళీగా వుండిపోయింది – అని మీరు యెప్పుడయినా తీక్షణంగా తీవ్రంగా ఆలోచించారా?

ఈ ప్రశ్న మీకు మీరు వేసుకుంటే వచ్చే జవాబు యేమిటి? – ఏదో సందిగ్ధం, మోసం లేకుండా ముఖాముఖి లభించే జవాబు యేమిటి? ప్రశ్నను ఎంత తీవ్రంగా అడుగుతున్నారో ఆ మోతాదులోనే జవాబు కూడా వస్తుంది. ఎంత ఆతురంగా అడుగుతున్నారో అంత త్వరగా వస్తుంది. కాని, మీకు తీవ్రత లేదు, ఆతురత లేదు. ఎందుకంటే, మీకు ఆ జీవశక్తి లేదు; ఉద్వేగ పూరితమయిన శక్తిలేదు. ఆవేగం లేకుండా మీరు యెన్నటికీ సత్యాన్ని కనుగొనలేరు. ఆవేశంతో కూడిన ఆవేగం, ఉద్వేగం కావాలి. దానిలో ఎలాంటి కోరికలు ప్రక్షిప్తంగా వుండగూడదు. ఇలాంటి ఉద్వేగం చాల భయంకరమైనది. ఎందుకంటే, ఈ ఉద్వేగం వున్నప్పుడు యిది యెక్కడికి తీసుకుపోతుందో మీకు తెలియదు.

ఈ లక్షణమైన ప్రేమ మీలో లేకపోవటానికి, మీ హృదయంలో యీ జ్వాల లేకపోవటానికి – కారణం యేమిటో కనుక్కునేందుకు అవసరమయినంత ఉద్వేగం మీలో లేకపోవడానికి బహుశ భయమే మూలం కావచ్చును. మీ మనసును హృదయాన్ని బాగా లోతుగా పరిశీలించుకు పరీక్షించుకు చూచినట్లయితే, మీకు యిది యెందుకు లేదో అర్థం అవుతుంది. మీలో అది యెందుకు లేదని ఉద్వేగంగా చూచుకున్నట్లయితే, అది ఉన్నదనే విషయం తెలిసి వచ్చేది. పూర్తి నిరాకరణ ద్వారానే – అదే ఉద్వేగానికి మహోన్నత రూపం – ప్రేమ అనే ఆ వస్తువు అస్తిత్వంలోనికి వస్తుంది. వినయం మోస్తరుగానే మీరు ప్రేమను అలవరచుకోలేరు. మోస ప్రవృత్తి పూర్తిగా అంతరించి పోయినప్పుడు వినయం బయటకు వస్తుంది. అప్పుడు మీకు వినయంగా వుండడం అంటే యేమిటో తెలియదు. వినయంగా వుండడం ఎలానో తెలుసును అనుకున్న మనిషి వ్యర్థుడు. అదే రకంగా మీ మనసును

హృదయాన్ని  సమర్పణం చేసి, మీ నరాశయాన్ని, కళ్లను, యావత్తు ఉనికిని జీవనవిధానం అంతా తెలుసుకునేందుకు వినియోగిస్తే; యదార్థంగా వున్నది యేమిటో చూచి – దానిని అధిగమించి వెళ్లగలిగితే; పూర్తిగా సంపూర్ణంగా యిప్పటి జీవన ప్రక్రియను నిరాకరించితే – వికృతము క్రూరము అయిన దానిని నిరాకరించడంలోనే ఆ కొత్తది ఆవాహన  అవుతుంది; అవతరిస్తుంది. ఆ సంగతి కూడా – అది వచ్చిన సంగతి – మీకు తెలియదు. తాను నిశ్శబ్దంగా  వున్నాను అని తెలుసుకున్న మనిషి, తాను ప్రేమిస్తున్నాను అని తెలుసుకున్న మనిషి – ప్రేమ అంటే యేమిటో యెరగడు; నిశ్శబ్దం అన్నా యేమిటో యెరగడు.

★ ★ ★

# ఈ పుస్తకం గురించి...

మానవుని దురవస్థ, జీవితానికి సంబంధించిన అనంత సమస్యలు – ఈ రెంటినీ సమీకరిస్తూ శ్రీ కృష్ణ మూర్తి చెప్పిన మాటలను ఈ పుస్తకం ద్వారా ప్రప్రథమంగా ప్రజలముందు పెడుతున్నాం. యూరపు, ఇండియా దేశాలలో అన్ని వయసుల వారినీ ఉద్దే శించి వారు యిచ్చిన దాదాపు ఓ వంద పై చిలుకు ఉపన్యాసాల నుంచి ఈ మాటలు – వాక్యాలు తీసుకున్నాం. వారు ఓ సంవత్సరకాలంలో చేసిన ప్రసంగాలకు యిది వడపోత. వారి జీవితంలో బహూశ యిది ఉపన్యాసాల దృష్ట్యా ప్రాధానమయినది.

జీవితాంతం తనకు స్నేహితంగా వున్న మేరీ లుటియన్స్ Mary Lutyens ను ఈ పుస్తకం సమీకరిం చమని శ్రీ కృష్ణమూర్తి కోరారు. ఈ పుస్తకానికి పేరు సైతం వారే సూచిం చారు. ఈ పుస్తకంలోని పదాలు, వాక్యాలు పూర్తిగా వారివే. ఎలాంటి మార్పులు చేయలేదు. పుస్తకం కూర్పు, సంవిధానంమటుకు చదు వరుల అవగాహనకు దోహదం కావాలనే దృష్టితో ఆమె చేశారు.

# జె. కృష్ణమూర్తి



# గతం నుండి విముక్తి